# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంథాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంథాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్థం TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వారు ఉచితంగా విలువైన గ్రంథాలను ఆన్ లైన్ లో eBOOK(PDF) అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంథాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(www.google.co.in), మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇంట్లో ఆధ్యాత్మిక గ్రంథాలయం ఉండాలన్నదే మా కోరిక.

ఈ గ్రంథాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement**(SAI RAM) - **సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## TTD(తిరుమల తిరుపతి దేవస్థానం)

**http://ebooks.tirumala.org**

ebooks.tirumala.org

తిరుమల తిరుపతి దేవస్థానములు
Tirumala Tirupati Devasthanams
ePublications

Languages | Series | Authors | Archives | Saptagiri | Catalog | Contact US

COMPLAINTS PLS CONTACT e MAIL saptagiriittd@gmail.com CAN CALL 0877 225 4359, 4543,4360,4363, 4365 BETWEEN 10.30 AM AND 5 PM (DURING WORKING DAYS)

- TELUGU (1197)
- BANJARA (2)
- ENGLISH (226)
- SANSKRIT (70)
- TAMIL (302)
- KANNADA (175)
- HINDI (181)

Saptagiri
Telugu Tamil Sanskrit Kannada Hindi English
Online Subscription

Panchangam
Telugu Tamil

Sri Bhagavad Ramanuja 'Sahasrabdi' Utsavam
Narada Bhakthi Sutra...

Maha Bharatham - Bhagavatham
Maha Bharatham Vol 1...
Potana Bhagavatam Vo...
Potana Bhagavatam Vo...
Potana Bhagavatam Vo...
Potana Bhagavatam Vo...

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కులశేఖర మహీపాలచరిత్రము – సమగ్ర పరిశీలనము

రచయిత : తట్టా లక్ష్మీనరసింహాచార్యులు

ప్రథమ ముద్రణము : 1990

ప్రతులు : 1,000

మూల్యము : రూ. **30/–**

This book is published with the financial assistance of Tirumala Tirupati Devasthanams under their scheme "AID TO PUBLISH RELIGIOUS BOOKS



ప్రతులకు :

టి. వి. రాఘవమ్మ

శ్రీ విశిష్టాద్వైత పీఠము

రంగస్వామి బజారు, జగ్గయ్యపేట-521 175

ముద్రణ :

శ్రీ సత్యసాయి ప్రింటర్స్

6-2-151-సి, సాయిరాం వీధి, తిరుపతి.



శ్రియః కాంతాయ కల్యాణ నిధయే నిధయేఽర్థినామ్ ।
శ్రీవేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

అవ్యాజకారుణ్యముతో సదా నన్ను చల్లగా జూచుచున్న శ్రీ స్వామివారి పాదపద్మములకు భక్తిప్రపత్తులతో ఈ కృతిని సమర్పించుచున్నాను.



జన్మనిచ్చి, విద్యాబుద్ధులు చెప్పించుటయేగాక స్వయముగ గురుత్వము వహించి యిప్పటి నా స్థితికి కారణభూతులైన అస్మత్పితృపాదులు కీర్తిశేషులు శ్రీమాన్ తట్టా రంగరామానుజా చార్యులు గారు, వారివలెనే నేటికి నాకు మార్గదర్శకత్వము వహించుచున్న మాతృమూర్తి శ్రీ యతిరాజవల్లి తాయారు గారు.

# మోదః ప్రమోదః

ప్రొఫెసర్ ఎస్.బి. రఘునాథాచార్య
ఆచార్యులు & అధ్యక్షులు
సంస్కృతవిభాగం
శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి

శ్రీమద్రామాయణ కాలక్షేపం జరుగుతున్నది. రావణుడు సీత నపహరించి లంకకు తీసుకుపోతున్న ఘట్టం. ఉన్నట్టుండి — "వెంటనే చతురంగబలాలను సిద్ధం చేయండి. రావణుణ్ణి అడ్డగించి మాతల్లి సీతమ్మను విడిపించాలి" - అని ఆవేశంతో సర్వసేనాధిపతిని ఆజ్ఞాపించాడొక మహారాజు. ఎవరాయన? ఎవరోకాదు. పన్నిద్దఱాళ్వార్లలో ఒక్కరైన కులశేఖరులు. పరమభక్తికి ప్రతీక ఆయన. ముకుందపదారవింద మకరందాస్వాదన తత్పరుడా తపస్వి. శ్వేద్భృత్యచరమావధిని నేనని శేషత్వపరమార్థాన్ని ప్రవచించిన మహామనీషి ఆయన. "శ్రీరంగ యాత్రకు సిద్ధం కండి!" అని ప్రతిక్షణం చాటింపు వినవడింది ఆయన రాజ్యంలోనే. కులశేఖరుడనే ఆయన నామధేయం అన్వర్థమయింది.

కొన్ని అభిప్రాయభేదాలున్నా, ప్రతి శ్రీవైష్ణవుని నోట వినపడే ముకుందమాల కులశేఖరుడు పలికిన ముద్దుపలుకులే. "పెరుమాళ్ తిరుమొళి" అనే సూక్తిదుపాశురాలు కులశేఖరుని పరమభక్తికి నిదర్శనాలుగా మిగిలిపోయాయి. అందులో నాల్గోదశకంలో శ్రీవేంకటాద్రిపైన తనకు నిత్యనివాసయోగ్యతను కల్పించమని స్వామినిప్రార్థించడంచూస్తే ఆయన హృదయం ఎంత సంస్కారపూర్ణమో మనకు అర్థమవుతుంది.

అటువంటి మహాభక్తుని చరిత్రను ఇతివృత్తంగా తీసుకొని మహాకవి శ్రీమాన్ శేషము రఘునాథాచార్యులవారు (క్రీ.శ. 17వ శతాబ్దం)

కులశేఖర మహీపాలచరిత్రమనే ఉత్తమప్రబంధాన్ని నిర్మించారు.

ఇంతవఱకు పూర్తిగావెలుగులోకి రాని ఈప్రబంధాన్ని సమగ్రంగా. పరిశీలించినవారు నా మిత్రమణి శ్రీమాన్ తట్టా లక్ష్మీనరసింహాచార్యులు విద్వదభినందనీయమైన వీరి పరిశీలన ఫలించింది. ఆంధ్రవిశ్వకళా పరిషత్ వీరిని ఎం.ఫిల్., డిగ్రీతో సన్మానించింది. అస్తు.

ఈపరిశీలనలో శ్రీఆచార్యులవారనుసరించిన పద్ధతి హేతుబద్ధంగా ఉంది. అత్యున్నతమైన పరిశోధన ప్రమాణాలు ఈ రచనలో పాటింపబడినాయి. వీరు కులశేఖరుల జీవితోదంతాన్ని ఎంతో విస్తరంగా కూలంకషంగా చర్చించారు. కథాకథనంలోను, రసాలంకారవినివేశనంలోను కవి చూపిన నేర్పును చక్కగా నిరూపించారు. రఘునాథాచార్యులపైన ప్రాచీనసాహిత్య ప్రభావం ఎంతవఱకున్నదనే అంశంలో వీరు చేసిన పరిశోధన పండితమండలికి పరమానందాన్ని తప్పక కలిగిస్తుంది.

ఆంధ్రులకు ఇంతమంచి విందుభోజనాన్ని అందించిన శ్రీ లక్ష్మీనరసింహాచార్యులను మనసారా అభినందిస్తున్నాను. ముందు ముందు వీరి లేఖిని ఇంకాఇంకా ఎన్నోరచనల్ని అందించి తప్పక సహృదయుల ప్రశంసల నందుకోగలదని భావిస్తున్నాను.

"నిశ్చలా భక్తిరస్తు"

సత్యమ్
తిరుపతి
9-9-1990

—రఘునాథాచార్య

# శుభాశీస్సులు

శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణే నమః

కవితా భువి తావదేవ వంద్యా
భవితా యావదయం హి వర్ణ్యతే ।
తరసా సురసాల వద్వదాన్యః
సరసాలాపవిచక్షణో ముకుందః ॥ (శ్రీ శ్రీనివాస విలాస చంపూః)

ముం చ కుం చ దదాతీతి ముకుందః. ఇహపరసౌఖ్యముల నిచ్చు వాడు-అని తాత్పర్యము. అట్టి శ్రీకృష్ణుడు కవితాలతకాధారస్తంభము. అట్టి ముకుందుని వర్ణించిన కవిత్వమే శ్రేయోదాయకమని తలచి బాల్యమునుండి భక్తిజ్ఞాన వైరాగ్యములు గలిగినవాడు కులశేఖర మహీపాలుడు.

అతడు నామమునకు మాత్రమే కులశేఖరుడు కాడు; తన కులమునకే శేఖరుడయినాడు. అతడు భక్త కులశేఖరుడు, కవి కులశేఖరుడు. కేరళదేశస్థుడైన యీతడు మూడు పదులకు పైబడిన రుచ్యములైన శ్లోకములతో ముకుందమాలను రచించిన పుణ్యశ్లోకుడు.

అట్టి పవిత్రచరిత్రుని పావలతాలవిత్రమగుచరిత్రను సచ్చరిత్రుడు చిరంజీవి తట్టా లక్ష్మీనరసింహాచార్యులు తన పరిశోధనమునకు మూలముగా స్వీకరించుట పురాకృత సుకృతఫలమని చెప్పకతప్పదు విద్వత్కుటుంబమున జన్మించిన వాడీ లక్ష్మీనరసింహాచార్యులు చిట్టిగూడూరు శ్రీ నారసింహ సంస్కృత కళాశాలలో భాషాప్రవీణ పరీక్షలో నుత్తీర్ణుడై, ఆంధ్ర విశ్వవిద్యాలయమునుండి ఎం.ఏ., ప్రథమశ్రేణిలో పట్టభద్రుడగుటయేకాక సాహితీరంగమున గృతభూరివ్యాసంగుడుకూడ,

బాల్యమునుండి కమ్మని కవితలనల్లుటలో సిద్ధహస్తుడు. డిగ్రీ కళాశాలలో పదునారుసంవత్సరములుగా నుపన్యాసవృత్తిని నిర్వహించుచున్నాడు

ఇట్టి యీతడు తన యీగ్రంథమును నాకు చదివి వినిపించినాడు. చాలా బాగున్నది. సదయహృదయులు, సహృదయులునగు పాఠకులు చదివి మంచిచెడులను గుర్తింపవలసినదిగా కోరుచున్నాను.

చిరంజీవి తట్టా లక్ష్మీనరసింహాచార్యులు నాకు మనుమడగుటయు ప్రియశిష్యులలో నొకడగుటయు నాకు బరమ సంతోష కారణములు. రమణీయములగు పెక్కుకృతులను వెలయించి పాఠకుల నలరింపవలసినదిగా నాశీర్వదించుచున్నాను.

శ్రీ శ్రీనివాసః కరుణా నివాసః
కృతాద్రి వాసో జగతాం నివాసః ।
సదార పుత్రాయ నృసింహశర్మణే
చిరాయురారోగ్యశుభాని దేయాత్ ॥

ఇట్లు
సాహిత్యరత్న
తట్టా నరసింహాచార్యులు

గూడూరు
1-7-90

శ్రీ శివాయ గురవే నమః

డాక్టర్. వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి
రీడరు
తెలుగుశాఖ
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు
విశాఖపట్నం

శారదాపీఠం
46-15-35, మండావారిపేట
దొండపర్తి
విశాఖపట్నం - 16

# పరితోషము

మహాత్ముల చరిత్రము నిత్యస్మర్తవ్యము, మనోహరము శ్రేయస్సంపాదకమును అగును. "పుణ్యశ్లోకస్యచరితముదాహరణ మర్హతి" అని ఆలంకారికోక్తి.

భాగవతోత్తములలో కులశేఖరమహీపాలుడు అగ్రగణ్యుడు. "ఘుష్యతే యస్యనగరే రంగయాత్రా దినేదినే" అని ఆ రాజచూడామణి విశ్రుతిన్నవాడు. భక్తజనమందరము, మధురభావబంధురము నయిన ముకుందమాలాస్తోత్రము ఆ మహనీయునిచే రచింపబడినదని పెద్దల విశ్వాసము. అతడు సర్వాంగీణముగ భగవత్కైంకర్యము గావించిన ధన్యజీవి యని ముకుందమాలలోని—

" జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరం
పాణిద్వంద్వ సమర్చయాచ్యుతకథా శ్రోత్రద్వయత్వంశ్రుణు
కృష్ణం లోకయ లోచనద్వయహరేర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం
జిఘ్ర ఘ్రాణ ముకుందపాదతులసీం మూర్ధన్నమాధోక్షజమ్"

అను శ్లోకమునుండి భావింపవచ్చును.

అనన్యవిష్ణుభక్తిపారమ్యముచే కులశేఖరప్రభువు వైష్ణవాచార్యులచే పన్నిద్దరాళ్వారులలో అత్యంతవిశిష్టుడుగ బరిగణింపబడినాడు. ఈ రాజర్షి

జీవితోదంతమును "కులశేఖరమహీపాల చరిత్రము" అను పేర నాల్గాశ్వాసముల రసవత్ప్రబంధముగ శేషము రఘునాథాచార్యుడను కవి పుంగవుడు రచించినాడు. కావ్యము చిన్నదియే యైనను గుణబాహుళ్యముచే రాయలయుగానంతర ప్రబంధములలో ప్రముఖస్థానమలంకరింపదగినది

ఆ కులశేఖరమహీపాల చరిత్రమందలి గుణవిశేషములను నిరూపింపనుపక్రమించి శ్రీమాన్ తట్టా లక్ష్మీనరసింహాచార్యులు గారు రచించిన లఘుసిద్ధాంతగ్రంథము ఈనాడు ముద్రణభాగ్యమునందుట అస్మదాదులకు హర్షదాయకము. లక్ష్మీనరసింహాచార్యులు గారు విద్వత్కుటుంబమున జన్మించినవారు. సంస్కృతాంధ్రసాహిత్యములలో కృతభూరి పరిశ్రములు.

ఈ విమర్శగ్రంథమున కులశేఖరమహీపాల కృతికర్తయైన శేషము రఘునాథాచార్యుని కాలాదులు, కులశేఖరాళ్వారుల జీవితో-దంతము పేర్కొనబడినవి. కులశేఖరమహీపాల ప్రబంధరచనా విశేషములు ఇతివృత్తనిర్వహణ పాత్రచిత్రణరసపోషణాదులు సప్రమాణముగ నిరూపింపబడినవి.

విద్వదామోదముద్రనందిన ఈ "కులశేఖరమహీపాల చరిత్రము-సమగ్రపరిశీలనము" అను విమర్శగ్రంథమున ఏతద్రచయితయైన శ్రీమాన్ తట్టా లక్ష్మీనరసింహాచార్యుల వారి బహుగ్రంథావలోకనదక్షత సవిమర్శ విషయ నిరూపణసమర్థత, సలక్షణభాషాప్రయోగ నిపుణత ఎడనెడ ప్రస్ఫుటమగుచున్నది.

పరమప్రామాణికములు, విద్వజ్జన శ్లాఘాపాత్రములు అయిన విమర్శగ్రంథములను ఇంకను పెక్కింటిని శ్రీమాన్ తట్టా లక్ష్మీనరసింహాచార్యులుగారు రచింతురుగాక. "సమానానాముత్తమశ్లోకోఽస్తు."

26-5-90

వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి

# నా మాట

భగవన్ముఖ నిర్గతమైన యాగమ వాఙ్మయమునుండి యాదికవి వాల్మీకి లౌకికమార్గమునకు మరలించిన నాటినుండి నేటివరకు గపితా సరస్వతి సర్వసహృదయ హృదయరంగముల నధివసించి రసానంద సామ్రాజ్యపట్టభద్రురాలను గావించుచున్నది. ఈ యానందసామ్రాజ్యము ముందు లౌకికరాజ్యములేపాటివి? కావుననే విషవృక్షసదృక్షమైన సంసారమున సజ్జన సల్లాపముతోపాటు కావ్యామృతస్వాదముకూడ దివ్యఫలముగ బేర్కొనబడినది.

ఇట్లు మానవజన్మకు సార్థక్యమును గలిగించు తన కవిత్వమహత్త్వముచే గవీంద్రుడు బ్రహ్మదేవునితో నుపమింపదగియున్నాడు. అతడీ సర్వాచరాచరసృష్టిని యథేచ్ఛగా నియమింపజాలినవాడు. హ్లాదైకమయమగు నీతని సృష్టి విధాతసృష్టికంటె సర్వథా విశిష్టమైనది. కవి నిట్టి యనన్యసామాన్యమహిమాన్వితుని గావించిన కవితాశక్తి ప్రాక్తన జన్మపుణ్య పరిపాకభవ్య ఫలము.

ఇట్టి కవి మనీషానికషముపై కషణమునొందిన కథలు, చరిత్రలు నెన్నియో శాశ్వతత్వము నొందినవి. గీర్వాణవాణీ కమనీయ కవితా విన్యాసముల శిక్షణలో నాంధ్ర కవితామతల్లి సైతము పలురీతుల బలుపోకల బలుశాఖల విస్తరిల్లినది,

ప్రధానముగ బదునారవ శతాబ్ది యాంధ్రసాహిత్యమునకు స్వర్ణయుగము. సాహితీ సమరాంగణ సార్వభౌముని యేలుబడిలో నాంధ్ర సరస్వతి యాప్రభుని యాస్థానసీమనే గాక నాటి ప్రజల యాస్యము లందును లాస్యము చేసినది. మిసమిసలతోడి కైతలపస తెలుగు మాగాణముల బసిడిపంటలు పండించి సరసుల డెందాలకు విందులందించిన పండుగ దినములవి. ఆంధ్రభోజుడు పల్లవించిన యుల్లముతో

నాంధ్రకవితా పితామహుడెక్కిన వల్లకి నల్లన దన కేలబట్టి యెత్తిన యాకాలమున బంధుర వర్ణనాసుందరము సుందరశైలీ బంధురము నయి తెలగున వెలసిన ప్రముఖసాహిత్య ప్రక్రియ "ప్రబంధము."

నన్నయ నన్నెచోడ తిక్కనామాత్యా నాచన సోమనాథ శ్రీనాథ కవి సార్వభౌమ ప్రభృతుల ప్రాపున బ్రోపున బాలనలో లాలనలో ముద్దు ముద్దుగ బెరిగిన ప్రబంధకన్య పెద్దన యొద్ద నొద్దికలునేర్చి, ముక్కు తిమ్మనార్యునికడ ముద్దుపలుకులు తెలిసి, సూరనవలన గడుసుపోకడల నెఱిగి, తెనాలివారి నుండి తీరైన వడగుంపునముల నందికడకు రామ రాజభూషణుని పోషణలో సంగీతకళారహస్యనిధియై సకలాలంకార సంకలితయై, సువృత్తయై, శోభనగుణ సంశోభియై, శృంగారరసాధి దేవతయై సరసుల మనసులలో హర్షోత్కర్షమును బాదుకొల్పినది.

ఆ యాంధ్రసాహితీ స్వర్ణయుగమున బ్రబంధమునకు గల్గిన ప్రాచుర్యమును బరిశీలించిన "ప్రబంధాంతం హి సాహిత్యకు"అని నాటి సమాజము భావించినట్లు తోచును. ఆ దినములలో బ్రబంధము తక్క దక్కిన మఱియే యితర వాఙ్మయ ప్రక్రియయు గవుల యాదరము నకు బాత్రముగామి చూడ బ్రబంధ నిర్మాత కాని వాడు కవిశబ్దవాచ్యుడు కాడను నభిప్రాయము నాటిసమాజమున గాటముగా నాటుకొనియుండి నట్లుహింప వీలగుచున్నది.

కాని పదునారవశతాబ్దికి దరువాత వెలసిన ప్రబంధములలో నవ్యత వైవిధ్యమును, స్వాతంత్ర్యమును గొఱవడినవనునది విమర్శకలోక ప్రసిద్ధమైన అభిప్రాయము ఆ యుగమునందును దదనంతరమున నట్టి విమర్శలకెదురు నిలిచి తత్తద్గ్రంథకర్తల యఖండకీర్తికి సజీవనిదర్శ నములై కతిపయ ప్రబంధములు తమ యద్వితీయ వ్యక్తిత్వవైశిష్ట్య ముచే సాహితీజగత్తున విరాజిల్లుచున్నవి. అట్టివానిలో "శేషము రఘు నాథాచార్యు" నిచే రచింపబడిన "కులశేఖర మహీపాలచరిత్రము" ప్రథమగణ్యము.

గతానుగతికముగ సంకుచితమగునితివృత్తముతో నవ్యతాదూరము లగు కవిసమయాదులతో గేవల శృంగారసాగరమునబడి పెక్కురు కవులు మునకలు వేయుచున్న కాలమున నీ కులశేఖర మహీపాలచరిత్రము" అను ప్రబంధమును స్వీయప్రతిభా ప్రభావిభూషితముగావించి ఇతివృత్త స్వీకారమున దన్నిర్వహణమున, రసపోషణమున, వర్ణనాలంకార చమత్కృతితో, మృదుమధురమనోహర పదగుంఫనముతో వినూత్నశోభలతో దీపింపజేసినాడు మహాకవి రఘునాథాచార్యుడు.

అత్యంతవిశిష్టమైన యీ ప్రబంధముయొక్క గుణవైశిష్ట్యమునకు నా కృష్టుడనై రసాలంకార వర్ణనాదుల నిర్వహణమున, విశిష్టాద్వైత మతసంప్రదాయ పరిపాలనమున రఘునాథాచార్యకవి యీ కావ్యమున బ్రదర్శించిన వైదగ్ధ్యమును నిరూపించుటకు నే గావించిన ప్రయత్నమే యీ గ్రంథము.

ఈ గ్రంథమును రచించుటకు, ముద్రించుటకు బలువురి ప్రోత్సాహము కారణభూతమైనది. వారందరికి కృతజ్ఞతలు తెలుపుకొనుట నా ప్రథమ కర్తవ్యము.

కృతజ్ఞతా నివేదనము :

అస్మద్గురువర్యులు, తాతపాదులు, నీ గ్రంథప్రచురణ సందర్భముగ శుభాశీస్సులు కటాక్షించిన శ్రీమాన్ తట్టా నరసింహాచార్యులు గారికి........

నా అభిరుచినిగుర్తించి శేషము రఘునాథాచార్యుని గ్రంథమును బరిశోధించుటకు నిర్దేశించి యడుగడున దిక్ప్రదర్శకులుగా వ్యవహరించి ప్రోత్సాహించుటయే గాక గ్రంథముద్రణమునకు దమ "పరితోషము"ను దెలియజేసిన సహృదయులు బ్రహ్మశ్రీ డాక్టరు వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి, రీడరు తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వవిద్యాలయము వారికి........

తమ యమూల్యమగు "వభిప్రాయము" నొసంగి నన్నీ గ్రంథ

ముద్రణకు ప్రోత్సహించిన మిత్రమణి శ్రీమాన్ శ్రీమద్భాగవతం రఘునాథాచార్యులు, ప్రొఫెసర్, సంస్కృతశాఖాధిపతి, వెంకటేశ్వర శ్వవిద్యాలయము వారికి........

ద్రవ్యసహాయ మొనర్చి యీ గ్రంథప్రచురణకు ప్రధాన హేతుభూతులైన తిరుమల తిరుపతి దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు గారికి నా కృతజ్ఞతాభివందనములు.

గ్రంథప్రచురణ సందర్భమున చేదోడు వాదోడుగా నిలిచిన విశిష్టాద్వైతోసన్యాసకుడు, K.S.V. పీఠము, తిరుపతి సోదరుడు చిరంజీవి తట్టా విజయరాఘవాచార్యులుకు శుభాశీర్వాదములు.

గ్రంథమును చక్కగా ముద్రించి యిచ్చిన శ్రీ సత్యసాయి ప్రింటర్స్ అధినేత చిరంజీవి డి. రామకృష్ణకు నివియే శుభాశీస్సులు.

చివరగా నొక్కమాట :

పొరపాటున "ముద్రారాక్షసులు" పలువురు గ్రంథమున ప్రవేశించినారు. దీనిని మలిముద్రలో సరిచేసుకొనగలవాడను.

ఇట్లు భాగవతదాసుడు

తట్టా లక్ష్మీనరసింహాచార్యులు

గ్రంథకర్త



# కులశేఖర మహీపాల చరిత్రము సమగ్ర పరిశీలనము

## కవి కాలాదులు :

"కులశేఖరమహీపాల చరిత్రము" నకు గర్తయగు శేషము రఘునాధాచార్యులు విశిష్టాద్వైతమతస్థుఁ డగుటయేకాక తన్మత సిద్ధాంతవేత్తయును. ఈతఁడు పరమ భాగవతోత్తముఁడు. క్రమ కమనీయ కవిత్వాభిరాముఁడు. శ్రీరామ భక్తియుక్తుఁడు. పోతన వలె లౌకిక విషయాశక్తి విముఖుఁడు అతని వలెనే రాజుల నాశ్ర యింపక తన కావ్యమునిష్టదైవమగు శ్రీరామునకంకితమిచ్చిన ధన్యజీవి.

కృత్యవతారికలో నీకవి తననుగూర్చి కొలదిగఁజెప్పికొనియున్నాడు.[1] దానివలనఁ దెలియనగు విశేషములివి. ఈతఁడాపస్తంబసూత్రుడు.

1. శుభకరాపస్తంబసూత్రుండు కౌండిన్య
గోత్రపవిత్రుండు గుణవిశిష్టుఁ
డనుపమ శేషాన్వయాంభోధిచంద్రుండ
హోబలదేశికుం డానరం దనదు
సతి యందుఁ బుత్రపంచకము నాపాదించె
నం దగ్రజుండు రామానుజార్యుఁ
కులశేఖరమహీపాల చరిత్ర, 1_20

కౌండిన్యగోత్రుఁడు. ఈతని తండ్రి వేంకటాచార్యులు, తల్లి రాగమ్మ, తాత శ్రీభట్టరు. ఈతనికిరువురు సహోదరులు. రామానుజాచార్యులును జెన్నభట్టరును ఈతడు తాను "లక్ష్మణమునీంద్ర విమలపదాబ్జంబులు శరణంబని నమ్మితి" అని పేర్కొనియున్నాడు.[1] శ్రీవైష్ణవసంప్రదాయజ్ఞులు శ్రీమద్రామానుజుని లక్ష్మణమునిగా వ్యవహరించుట కలదు ఈతఁడాయర్థమునఁ బ్రయోగించునో లేక మఱియొక లక్ష్మణమునినిఁ దన గురువుఁగాఁ బేర్కొనినాడో యూహింప వీలుకాకున్నది.

కవి యింతకు మించి తన్నుఁ గూర్చి వివరము లెవ్వియుఁ బేర్కొనియుండలేదు. ఈతఁడు పేర్కొనినదానిని బట్టి యీతని వంశవృక్ష మిట్లున్నది.

డమ్మహాత్ముఁడు సీతమ యను నిజదేవి
వలన శ్రీభట్టరాహ్వయు కుమారుఁ
గనియె నా శాంతినిధికి రాగమయు సత్య
భామ యను భార్య లిరువురు భవ్యమతులు
పరవి రాగమదేవికి సంభవించె
సరసగుణశాలి వేంకటాచార్యమౌళి

అమ్మహాత్ముఁడు లక్ష్మమ యనెడి పత్ని
వలన ముమ్వురిఁ దనయుల నెలమిఁగాంచెఁ
జెలిమి రామానుజుండును జెన్నభట్ట
రును సహోదరు లిరువు రే నగ్రజుండ — 21 ప.

1. కు. మ. చ. 1-22




రఘునాథాచార్యుని పినతమ్ముఁడగు చెన్నభట్టరు 'అభిమన్యు కల్యాణము' అను ద్విపదకావ్యమును రచించినాడు. అందు రఘునాథాచార్యుని గూర్చి-

"అందగఁ్రజుఁడు సద్గుణాభిరాముండు
నంద నందన కథానందచిత్తుండు
శమ దమ వాత్సల్య సౌశీల్య ముఖ్య
కమనీయ గుణరత్నకలశవారాశి
యమల వైష్ణవ రహస్యార్థసంవేది
రమణీయ శుభకీర్తి రఘునాథగుర్వుఁడు"

అని స్తుతించియున్నాఁడు. ఈతని యీ ప్రశంస రఘునాథాచార్యుని గుణగణములను జక్కఁగాఁజాటుచున్నది. ఈ చెన్నభట్టరు కుమారుఁడగు రంగాచార్యులును సరసకవియై యుండి 'భావనారాయణ విలాసము' అను ప్రశస్త యక్షగానమును రచించెను. ఇందువలన వీరిది విద్వత్కవివంశమని స్పష్టపడుచున్నది.

రఘునాథాచార్యులు, చెన్నభట్టరు, రంగాచార్యులు నను వీరి ముగ్గురి కావ్యముల యందును వీరి కాలమును గాని, తదితరాంశములను గాని గ్రహించుటకు దగిన యాధారములు కానవచ్చుటలేదు.

కీ. శే. శ్రీ నిడదవోలు వెంకటరావు గారు రఘునాథాచార్యులు క్రీ.శ. 1650 తరువాత నన(గా( బదునేడవశతాబ్ది పరార్థమున జీవించి యుండునని నిర్ణయించియున్నారు.[1] ఇందుకు వీరు చూపిన యాధారమిది.

భద్రాచల రామదాసుగా బేరొందిన కంచర్ల గోపన్న తన దాశరథీ శతకమున 9వ పద్యమున 'రఘునాథభట్టరాచార్యుల కంజ లెత్తి' అని యీ రఘునాథాచార్యుని( దన గురువుగా( బేర్కొని స్తుతించియున్నాడు. ఈ గోపన్న గోల్కొండ నవాబగు అబ్దుల్ హుస్సేన్‌తానీషా / క్రీ. శ. 1658 - 1689 / సమకాలికుడు. కావున కావున నాతనిచే( బేర్కొబడిన రఘునాథుడు క్రీ. శ. 17వ శతాబ్దము యొక్క పరార్ధమందుండి యుండునని శ్రీ వెంకటరావుగారభిప్రాయ పడిరి.

కాని కులశేఖరమహీపాలచరిత్రము యొక్క పీఠికలో వీరి వాదము ఖండింపబడినది. ఇందుకు జూపబడిన హేతువు లివి.

కంచర్ల గోపన్న తన శతకమున దొమ్మిదవ పద్యమున రఘునాథుని స్మరించు సందర్భమున నాతని గృహగోత్రనామాదిక ము ను బేర్కొనలేదు. కావున నా పద్యమున బేర్కొనబడిన రఘునాథ భట్టరే కులశేఖరమహీపాల కర్తయగు శేషము రఘునాథాచార్యులని నిశ్చయముగా జెప్పుటకు వీలులేదు. మఱియు రఘునాథ నామకులు పలువురుండి యుండవచ్చును. అందే రఘునాథుడు గోపన్న గురువో నిర్ణయించుటకాధారము లేదు.

---

1. Kulasekhara in Telugu literature. Journal of University of Madras, Section - Humanities. Vol. XXIII Nos. 1-2 (July-December)

ఇట్లు నిడదవోలు వారి వాదమును ఖండించి కులశేఖరమహీపాల చరిత్రము పీఠికలో నీ ప్రబంధము క్రీ. శ. 17వ శతాబ్దమున కీవలిదే యని చెప్పకతప్పదని పేర్కొనబడినది. [1] అందుకు హేతువులు మాత్రము విశదకరింపబడలేదు. ఈ ప్రబంధమున బేర్కొనబడిన యంశములను బట్టి కూడ నింతకు మించి కవికాలమును నిర్ణయించుట కెట్టి యాధారమును లేదు. కాని సూక్ష్మముగా బరిశీలించినచో వసుచరిత్ర ప్రభావమీ ప్రబంధముపై మిక్కుటముగా గలదు. అనేక సందర్భములలో నీకవి వసుచరిత్ర నతి సన్నిహితముగా ననుకరించి యున్నాడు. ఈ సాక్ష్యము వలన నీతడు రామరాజభూషణుని కంటె తరువాతవాడని మాత్రమే చెప్పగలుగుదుము.

నందనందన కథానందచిత్తుడు, నమల వైష్ణవరహస్యార్థవేదియునగు రఘునాథాచార్యుడేదో నొకభక్తుని చరిత్ర కావ్యముగా వ్రాయుదలపోయుచుండగ శ్రీరామచంద్రుడాతనికి గలలో గాన్పించి కులశేఖరాళ్వారులచరిత్ర వ్రాసి తన కంకితమిమ్మని యాన తిచ్చెనట కవి యట్లే గావించి ధన్యుడైనాడు. శ్రీవైష్ణవ సంప్రదాయమునకు బరమాచార్యుడగు కులశేఖరాళ్వారు వంటి పరమభాగవతా శిఖామణి చరిత్రను బ్రబంధీకరించుటకు మన రఘునాథాచార్యులే యుత్తమాధికారి.

ఈతడాశ్వాసాంతగద్యలో దాను 'శ్రీరామచంద్రకరుణానిరీక్షణ సమాసాదిత కవితావిశేషుడ' నని చెప్పుకొనినాడు. కులశేఖరాళ్వారుల చరిత్రమును నాలుగాశ్వాసముల ప్రబంధముగ నిర్మించి శ్రీరామచంద్రునకే యంకితము గావించియున్నాడు. ఈతని దృష్టిలో భగవదర్పితమైన కావ్యమే కావ్యము. శ్రీరాముడు కావ్యమును దన కంకితముగా రచింపు మనగా నీతడు -

1. Kulasekhara Maheepalacharitramu - Edited by T. Chandra Sekharan (1955), Preface, p. VII

ఎక్కడిచోద్య మజ్జగదధీశ్వరు గూర్చి మహాతపమ్ముము
న్నెక్కడనుండి చేసితి నహేతుక మాతని సత్కటాక్ష మొ
క్కొక్కనిపైబొసంగు ననుచుండెదరార్యులు తథ్యమయ్యెలో
జిక్కిన భక్తి నర్పణము జేసెద మత్కృతి రామమూర్తికిన్ [1]

అని పొంగిపోయినాడు. ఈ పద్యము వలన నీతని వినయసంపద, భగవదైకాయత్తచిత్తత, నిరీహాోహయును వ్యక్తమగుచున్నవి. ఈ విషయమున నీతడాంధ్రసాహిత్యలోకమున పోతనకు సాటియగువాడు

ఈతడు కృత్యాదిని దన్ను గూర్చి చెప్పుకొనిన పద్యమును బట్టి [2] 'నిరంతర భాగవతార్చనా నివిష్టమతి యని తెలియుచున్నది. కావుననే సంతత భాగవతసేవా దీక్షాదక్షుడగు కులశేఖరాళ్వారు జీవితమును శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత సౌరభములు గుబాళించునట్లు సమీచీనముగా బ్రబంధీకరింపగలిగినాడు.

ఉభయ వేదాంతరహస్యార్థవేది యగుటయేకాక సత్కవి సంప్రదాయము నెఱిగిన విద్వత్కవిశిఖామణి.

పదునేడవ శతాబ్దమునకీవల వ్యాప్తిలో నున్నాంధ్రప్రబంధ రచనాపద్ధతుల నాకళించుకొని - రసోచితముగా - పాత్రోచితముగా - గథోచితముగా వర్ణనాదుల నిర్వహించి సుందరశైలీశోభితముగా దన కావ్యమునకు బింకమును బొంకమును సంతరించినాడు. భాగవత పరంపరాగతమైన కులశేఖరాళ్వారుల చరిత్రము స్వీయరచనా ప్రణాళికకు దగినట్లు నవ్యకల్పనలతో-రసవంతముగా దీర్చిదిద్దినాడు సంస్కృతాంధ్రభాషా సమ్మేళనము గావించి రమ్యమగు "మిశ్ర కవితానుబంధము"గా విన్యసించియున్నాడు.

1. కు. మ. చ. - 1-19
2. అదే, 1-22

భక్తిభావబంధురమైన కులశేఖరుల జీవితము రఘునాథాచార్యుని ప్రజ్ఞాసుధాసేచనముచే "కులశేఖరమహీపాల చరిత్రము"గా నాంధ్రసాహితీ జగత్తున నావిర్భవించి - యజరామరమై సహృదయ హృదయములకు పద్యఃపంనిర్వృతి నొసంగుచు విఖ్యాతమైనది.

రఘునాథాచార్యుడు కులశేఖరమహీపాలచరిత్రమును నాలుగాశ్వాసముల ప్రబంధముగా రచించినాడు. మొత్తము 910 గద్య పద్యము లిందు గలవు

ఆశ్వాసముల వరుసలో పద్య సంఖ్య యిది -

| | |
|---|---|
| ప్రథమాశ్వాసము | 168 |
| ద్వితీయాశ్వాసము | 262 |
| తృతీయాశ్వాసము | 251 |
| చతుర్థాశ్వాసము | 229 |
| | 910 |

/ఆశ్వాసాంతగద్యలు నాల్గింటిని కలిపిన సంఖ్య యిది,

# 2. కులశేఖరుల జీవితోదంతము

దక్షిణహిందూదేశమున నాయా ప్రదేశములలో నవతరించి విష్ణుభక్తి రసమగ్నులై తాము తరించి, తమ దివ్యప్రబంధములచే లోకమును దరింపజేసిన ధన్యజీవులు పుణ్యమూర్తులు నగు పన్నిద్ధరాళ్వారులలో నన్యతములు కులశేఖరులు. పన్నిద్ధరాళ్వారులు దైవాంశ సంభూతులై సకల వేదసారమునుదమ ద్రావిడ దివ్యప్రబంధములలో విస్తరించి - భక్తిజ్ఞాన వైరాగ్యములలో భక్తికగ్రతాంబూలము నొసంగి, స్వయముగ విష్ణుభక్తిసామ్రాజ్యపట్టభద్రులై, లోకులెల్లరు తదుత్తమపదవి నధిష్టించుటకు సమ్యగధికారులే యని వేవోళ్ళ జాటిన జీవన్ముక్తులు వీరు. వేదప్రామాణ్యము నంగీకరింపని జైనబౌద్ధాది మతముల వ్యాప్తిని నిరోధించి తమకాలమున లోకమున శ్రీహరిభక్తిమయమైన సంస్కృతిని వేలయించి సనాతన వైదికధర్మ పునరుజ్జీవనమును గావించినమహనీయులే భగవత్కైంకర్య పరిపూతములు.[1]

'ఆళ్వారు' అను పదము యొక్క యర్థమును గురించి వివిధములగు నభిప్రాయము లున్నవి.

1. "ఆళ్వారు శబ్దమునకు భగవద్భక్తి పరవశుడనియు భగవద్గుణములలో ఈడుపడినవాడనియు, రెండర్థములున్నవి." అని శ్రీమాన్ కందాడై శేషాచార్యులు గారు తమ "సంప్రదాయ అకారాది ద్రావిడాంధ్ర నిఘంటువు" / పు. 113/లో వ్రాసియున్నట్లు శ్రీమాన్ ధనకుదరం వరదాచార్యులు గారు పేర్కొనియున్నారు.[2]

---

1. శ్రీముఖసూక్తి / బచ్చు పాపయ్యశ్రేష్ఠి / ప్రథమ ముద్రణము 1948, ప్రథమభాగము
2. ఆళ్వారులు - దివ్యప్రబంధములు

2. "ఆళ్వారు" అను తమిళ శబ్దమునకు "జ్ఞానఖని" అని యర్థము. [1]

3. "ఆళ్వారు" అను తమిళ శబ్దమునకు జ్ఞానసముద్రమందు మునిగితేచినవాడని యర్థము. [2]

4 "'The word 'Alwar' has peculiar significance of its own. It means one who has sunk into the depths of his existence or one who is lost in repturons devotion to the Lord'' [3]

5. "అళ్వార్" అను శబ్దమునకు "మహాజ్ఞాని" అని యర్థము. 'Alwer means one who has taken a deep plunge into the ocean of divine consciousness [4]

పై యభిప్రాయమును నన్నింటి నొక్కచోజేర్చి పరిశీలించినచో "జ్ఞానసంపన్నులై భగవద్భక్తిరసమగ్నులైనవారు" అని "ఆళ్వారు శబ్దమున కర్థమైనట్లు భావింపవచ్చును.

పన్నిద్దరాళ్వారులలో నెవ్వరును దమ కాలమున నీ యాళ్వారు శబ్దముతో వ్యవహరింపబడలేదు. వారి యనంతరకాలమున శ్రీరామానుజ యుగమున/క్రీ. శ. 1017-1137/ 'తిరుక్కురుగై ప్పిరాన్‌పిళ్ళాన్' అను వారిచే నాలాయిర దివ్యప్రబంధమునకు వ్రాయబడిన టీకలో నీ పన్నిద్దరు భక్తాగ్రేసరులనుద్దేశించి "అళ్వారు" శబ్దము తొలిసారిగ బ్రయోగింపబడినది. నాలాయిర దివ్యప్రబంధమున నొక తావున మాత్రమే 'అళ్వారు' శబ్దము ప్రయుక్తమైనది. కాని యది వైష్ణవ భక్తియుక్తులగు ద్వాదశసూరుల నుద్దేశించినది కాదు. [5]

---

1. శ్రీకోరాడ రామకృష్ణయ్య గారి వ్యాసము
   తమిళవాఙ్మయమండలి సాహిత్యము - భారతి, ఆగస్టు 1949
2. విజ్ఞానసర్వస్వము / తెలుగుభాషాసమితి / సంపుటము 7, పు 138
3. Grains of Gold (R S Desikan), p. 6
4. 'Alwar Saints' - Written by Sri Suddhanandswamy, p. 3
5. ఆళ్వారులు - దివ్యప్రబంధములు

ఆళ్వారులు శ్రీవిశిష్టాద్వైతమతమునకు మూలస్తంభములు. శ్రీవైష్ణవసిద్ధాంతమునకు ముఖ్యములగు భక్తిప్రపత్తులు వీరి ప్రధాన లక్షణములు. శ్రీమన్నారాయణుడే పరతత్త్వమనియు భగవద్భాగవత సేవయే. యాత్మోజ్జీవన హేతు వనియు నమ్మి మహా వైరాగ్య జీవితమును గడిపిన మహానుభావులు. వీరి సర్వస్వము శ్రీమన్నారాయణుడే.

ఇట్టి నిర్నిద్రభక్తిప్రపూర్ణులగు ద్వాదశసూరులలో శ్రీకులశేఖరునది విశిష్టవ్యక్తిత్వము. వీరి భగవద్భక్తి. భాగవతానురక్తియు ననన్యములు. సమస్త భోగభాగ్యములకు నెలవైన ప్రాజ్యమగు రాజ్యమునకు శాసకులయ్యును నిష్కళంక వైరాగ్యభద్రసింహాసనాధిష్ఠితులై జనకాదులగు తొల్లిటి రాజర్షుల కోవలో నెన్నదగినవారు కులశేఖరులు.

సర్వేంద్రియములు భగవత్సేవలో నిమగ్నములు కాగా సర్వము నా దేవదేవునిదే యను నిర్భరాధ్యవసాయము గల పూర్ణయోగులు. ఈ విషయము వీరి ముకుందమాలలోని యీ క్రింది శ్లోకము వలన సువ్యక్తమగుచున్నది.

జిహ్వే! కీర్తయ కేశవం మురరిపుం చేతో! భజ శ్రీధరం
పాణిద్వంద్వ! సమర్చయాచ్యుత కథాః శ్రోత్రద్వయ! త్వం శ్రుణు
కృష్ణం లోచనద్వయ! హరేర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం
జిఘ్ర! ఘ్రాణ ముకుందపాదతులసీం మూర్ధన్నమాధోక్షజమ్[1]

ఓ నాలుకా! కేశవుని కీర్తింపుము. మానసమా! మురరిపుని భజింపుము. హస్తద్వయమా! శ్రీధరు నర్చింపుము. చెవులారా! అచ్యుత కథలను వినుడు. నేత్రద్వయమా! కృష్ణుని దర్శింపుము.

---

1. ముకుందమాల, శ్లో. 16

చరణయుగళమా! విష్ణ్వాలయమునకు వెడలుము. నాసికా! ముకుందుని పాదములకడ సమర్పింపబడిన తులసినాఘ్రాణింపుము. శిరమా! అథోభజునకు నమస్కరింపుము.

ఇందు సర్వేంద్రియములను విష్ణుసేవాకార్యక్రమమునందే నియమించినారు కులశేఖరులు. వీరు శ్రీమహావిష్ణువు యొక్క వక్షస్థలాలంకారమగు కౌస్తుభమణి యొక్క యంశమున జన్మించినట్లు శ్రీవైష్ణవగ్రంథములందు పేర్కొనబడినది.

వీరి చరిత్ర మొట్టమొదటిసారిగ సంస్కృతమున "దివ్యసూరి చరిత్రము" అను గ్రంథమునందు గాన్పించుచున్నది. దీని కర్త గరుడవాహన పండితుడు. ఈతడు శ్రీమద్రామానుజాచార్యుల కాలము వాడుగా పేర్కొనబడుచున్నాడు.[1] తరువాత వెలసిన శ్రీ అనంతాచార్యుని "ప్రపన్నామృతము" అను నూటయిరువదియైదు సర్గల మహాకావ్యమును, దమిళభాషలో వ్రాయబడిన "గురుపరంపరా ప్రభావము" అనునవి శ్రీవైష్ణవసంప్రదాయజ్ఞులచే ప్రామాణికములుగా నంగీకరింపబడుచున్నవి. తెలుగున క్రీ. శ. 1560 ప్రాంతమువాడగు తాళ్ళపాక తిరువెంగళనాథుడు రచించిన "పరమయోగి విలాసము" అను ద్విపద కావ్య మాళ్వారుల జీవితోదంతములను విశదీకరించు గ్రంథములలో ప్రాచీనమైనది. దాని తరువాత శ్రీ నంబూరు కేశవాచార్యులచే రచింపంబడిన "ఆచార్యసూక్తి ముక్తావళి" అను పద్యకృతి శ్రీవైష్ణవ సంప్రదాయ సంబంధములగు పలు విషయములతో వ్రాయబడిన గ్రంథము. కొలది మార్పులతో వీనియందన్నింటను కులశేఖరాళ్వారుల చరిత్ర ప్రపంచింపబడినది.

## 1. కులశేఖరుల కాలము :

ఆళ్వారు లందరి కాలము వలెనే కులశేఖరుల కాలము కూడ వివాదగ్రస్తమైయున్నది. శ్రీవైష్ణవసంప్రదాయ గ్రంథములందును

---

1. ముకుందమాల వ్యాఖ్యానము – సద్గ్రంథ ప్రకాశనసభ 1954

తిరునక్షత్ర తనియుల / జాతక శ్లోకముల / యందును గుణశేఖరులు కలియుగ ప్రారంభమున జీవించియున్నట్లు పేర్కొనబడియున్నది.

దివ్యసూరి చరితమున వీరు మాఘమాసమున పునర్వసు నక్షత్రమున జనన మందినట్లు చెప్పబడినది.[1] ఆచార్య సూక్తి ముక్తావళి యందు గులశేఖరాళ్వారుల తనియగా / జాతక శ్లోకముగా బేర్కొనబడిన శ్లోకమున వీరి జననము కుంభలగ్నమున నైనట్లు పేర్కొనబడినది.[2] శ్రీ పిన్పకరాన్ పెరుమాళ్‌జియ్యర్ రచించిన "గురుపరంపర ప్రభావమున" న సుఖసంఖ్య గల కల్యబ్దములు కడచిన తరువాత ప్రభవ నామ సంవత్సరము - మాఘమాసము - కృష్ణపక్షము - పునర్వసు నక్షత్రము - ద్వాదశితిథి - గురువారమున గులశేఖరులు జన్మించినట్లు చెప్పబడినది.[3] దీనినిబట్టి క్రీ. పూ. 3075 సంవత్సరమున ననగా నిప్పటికి దాదాపుగా నయిదువేల సంవత్సరములనాడు కులశేఖరులు జన్మించినట్లు సంప్రదాయజ్ఞులు నిశ్చయించియున్నారు.[4]

---

1. తస్యా మభూచ్చేర కుల ప్రదీప
 శ్రీకౌస్తుభాత్మా కులశేఖరాఖ్యః ।
 మహీపతిర్మాఖ పునర్వసూద్య
 ద్దినే హరేః పూర్ణకజాక్షలక్ష్యః ॥
 — దివ్యసూరి చరితము, 5 స., 6 శ్లో

2. కుంభే పునర్వసుజాతం కేరళే చోళపట్టణే ।
 కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖరమాశ్రయే॥
 — ఆచార్య సూక్తిముక్తావళి

3. కల్యబ్దేసుఖసంఖ్యయా వ్యపగతే మాసేచ మాఘాభిదే
 వర్షేచాపి పరాభవే సురగురోర్వారేచ పక్షేఽసితే ।
 ద్వాదశ్యాఖ్యతిథౌ పునర్వసు దినే ప్రీత్యాఖ్యయోగాన్వితే
 త్రాతుం నఃకులశేఖరః క్షితిపతి శ్రీకౌస్తుభాత్మాభవత్॥

4. కీ. శే. చెలమచర్ల రంగాచార్యులు గారు ముకుందమాల
 [illegible] పబ్లికేషన్స్, హైదరాబాదు, 1973.

కాని పలువురాధునిక చారిత్రకు లాళ్ళాయ అందరును క్రీ. శ. 2వ శతాబ్దము నుండి క్రీ. శ. 9వ శతాబ్దము వరకు గల కాలమున జీవించియున్నట్లు భావించుచున్నారు. అందు గొందరి యభిప్రాయములు లివి.

1. "The Alwars seem to have flourished between the 2nd Century A.D and 8th Century A.D. Traditional accounts place them at the beginning of the Kaliyuga, that is about the second millennium B.C. Professor S. Vaiyapuri Pillai has come to the conclusion that the Alwar period falls between the 7th and 9th centuries A.D. In any case the Alwars lived before 900 A.D."1

2. "The Vaishnava Alwars or devotees had an early origin, the 'Mudal Alwars' as they called, are assignable to the 5th Century A.D. and they were followed by a number of Vaishnava devotees till about the 9th Century A.D."2

3. "వీరు కలియుగాది యందు ఆవిర్భవించిరని వైష్ణవ సంప్రదాయము కాని ఆధునిక చరిత్రాన్వేషణము వీరలు క్రీస్తు తరువాత రెండు, ఎనిమిది శతాబ్దముల మధ్య వెలసిరి అని చెప్పును". 3

ఇట్లుసంప్రదాయజ్ఞుల లెక్కకు-నాధునిక చారిత్రికుల లెక్కకు నంతరము మిక్కుటముగా నుండి శ్రీ కులశేఖరుల కాల మిదమిద్ధముగం బేర్కొనఁబడక వివాదగ్రస్తమైయున్నది

1. Alwars of South India (K.C. Varad achari) Bharatiya Vidya Bhavan, Bombay, Published in 1966.
2. Studies in Indian History (K.K. Pillay) published in 1979
3. విజ్ఞాన సర్వస్వము/తెలుగుభాషాసమితి/, సంపుటము 7, పు.298

## 2. కులశేఖరుల జన్మస్థలము :

కులశేఖరులు కేరళదేశమున "కుక్కుటకూట నగరము"న జన్మించినట్లు దివ్యసూరి చరితమునఁ బేర్కొనఁబడినది. చోళ పట్టణమని సంప్రదాయ సిద్ధములగు నక్షత్ర తనియ యందుఁ బేర్కొనఁబడినది. ఈ పట్టణమునకు 1. కోళిపట్టణ మనియు, 2. కొల్లినగర మనియు, 3. కుక్కుటకూట మనియు, 4. కుక్కుటపుర మనియు, 5. కోళికూరు అనియుఁ బేరులుండినట్లును, గులశేఖరుల కందు వలననే 1. కొల్లి కావలన్, 2. కుక్కుటపురాధీశర్, 3. కాళియర్ కోన్ అనియుఁబేర్లు కలిగినట్లును, దివ్యసూరిచరిత కర్తయగు గరుడవాహన పండితుఁడు "కోళి" అను తమిళ పదమునే సంస్కృతీకరించి కుక్కుటకూట నగర మని పేర్కొని యుండెననియు, నేడిది క్విలన్ (Quilon) అని వ్యవహరింపఁబడుచున్న దనియు శ్రీ చెలమచర్ల రంగాచార్యులు గారు పేర్కొని యున్నారు[1] ఆసందర్భము సందే వారు —

"శ్రీ వేదాంతదేశికుల వారు తమ ప్రబంధసార మను గ్రంథమున నెనిమిదవ పాశురమున స్పష్టముగఁ గులశేఖరుల "వంజికులం" అనుచోట జన్మించిరని చెప్పిరి. మఱి యిపుడు కులశేఖరులుదయించినదికోళిపట్టణమా? వంజికులమా? అను సందియము కల్గినది. దీనిని ఎన్. కృష్ణస్వామి అయ్యంగారు కులశేఖరులు వంజికుళములో/ఇప్పటి కొచ్చిన్ సంస్థానములో నొక పట్టణము ననాదిర్భవించిరి. "కొల్లి" వీరి నివాసమై యుండెను అని సమన్వయ పరచిరి" అని వ్రాసి యున్నారు.

1. ముకుందమాల

## శ్రీ కులశేఖరుల గ్రంథములు :

కులశేఖరాళ్వారు తమిళభాషలోఁ దనగ్రహించిన దివ్యప్రబంధము[1] నకు 'పెరుమాళ్ తిరుమొ' అని ప్రసిద్ధికలదు ఇది "నాలాయిర" మందుఁ బ్రథమ సహస్రమునఁ బంచమ ప్రబంధముగఁ బరిగణింపఁబడుచు న్నది. "పెరుమాళ్ తిరుమొ, అనగా "కులశేఖర సూక్తి" అని యర్థము. భగవంతుని, శ్రీరాముని సంప్రదాయజ్ఞులగు పెద్దలు ద్రావిడభాషలో "పెరుమాళ్" అని వ్యపదేశింతురు. శ్రీరామచంద్రుని దివ్యావతార నక్షత్రమగు పునర్వసు నందే యవతరించి యుండుట చేతను, ఆ రామచంద్రునే తన కారాధ్యదేవునిగా స్వీకరించియుండుట చేతను, గులశేఖరాళ్వారులను గూడ "పెరుమాళ్" అని వ్యవహరిం చుట యేర్పడెను. శ్రీరామచంద్రునివలె వీరును బ్రజానురంజనముగాఁ బరిపాలన సాగించిన ప్రభువు లగుట కూడ నిందులకుఁ గారణము కావచ్చును. ఆకారణమున వారనుగ్రహించిన దివ్యప్రబంధమునకు "పెరుమాళ్ తిరుమొ" అను ప్రసిద్ధియేర్పడినది.[2] ఈ పెరుమాళ్ తిరుమొ యందు మొత్తము పాశురముల[3] సంఖ్య నూటైదు. ఇవి పదిదశకము లుగా విభజింపఁబడినవి. పాశురము లన్నియు రసనిర్భరములు.

1. ఆళ్వారులు ద్రావిడభాషలోఁ జెప్పిన గ్రంథములకు "దివ్యప్రబం ధములు" అని వ్యవహారము కలదు.

2. శ్రీ కాంచి ప్రతివాదిభయంకర అణ్ణంగరాచార్యులు గారు—పెరు మాళ్ తిరుమొ/శ్రీరామానుజ పత్రిక, ప్రచురణ 1962/

3. పాశుర మనగా పద్య మని యర్థము.

ప్రథమదశకము : కులశేఖరు లిందు శ్రీరంగనాథుని సేవించుట యందలి తమయభిలాషను భక్తితో వ్యక్తీకరించియున్నారు.

రెండవ దశకము : శ్రీరంగనాథ భగవద్భక్తుల వాచామగోచర వైభవము వర్ణింపఁబడినది.

మూడవ దశకము: శ్రీ రంగనాథు నందలి యున్మాదాతిశయమును ప్రాకృతజన సహవాసవిముఖతయును వర్ణింపఁబడినది.

నాల్గవ దశకము : శ్రీ వేంకటాద్రి యందు నిత్యనివాసాభిలాష వ్యక్తము చేయబడినది.

ఐదవ దశకము : కేరళ మండలమున నున్న "తిరువిత్తువక్కోడు" అను దివ్యదేశమున నున్న స్వామి సన్నిధిలో దను యనన్య గతికత్వము పేర్కొనఁబడినది.

ఆరవ దశకము : ప్రణయరోష వివశ యగు గోపిక పలుకులు వర్ణింపఁ బడినవి.

ఏడవ దశకము : కృష్ణచేష్టితాద్యనుభవ భాగ్యవిహీన యగు దేవకి వ్యామోహములు వివరింపఁబడినవి.

ఎనిమిదవ దశకము : కౌసల్య పాడిన పాటల రూపమున దాశరథి దివ్యగుణములు వర్ణింపఁబడినవి.

తొమ్మిదవ దశకము : కైకేయి మాటల వలలోఁ దగుల్కొని శ్రీరామచంద్రు నడవికిఁ బంపిన దశరథుని శోకపరీవాహ భూత ప్రలాపములు వర్ణింపఁబడినవి.

పదియవ దశకము : చిత్రకూట మను దివ్యదేశమున వెలసిన భగవంతుని యనుభవము రామాయణ కథా రూపమున వర్ణింపబడినది.

ఇట్లు దశవిధములగు వివిన్న భావములను ప్రపత్తి పూర్వకముగ భక్తి యుక్తముగ సకలజన హృదయావర్జకముగ సుందర గంభీర సంవిధాన వైదగ్ధ్యమున గులశేఖరులీ దివ్యప్రబంధమున ననన్యసామాన్యముగా విన్యసించియున్నారు.

ఆశ్వాశ్రయ కవిత్వము, భావకవిత్వము, నను నాధునిక కవి శారీతులనుబోలి యతి ప్రాచీనకాలమున దమిళవాఙ్మయమునకలంకార భూతముగ జెప్పబడిన " పెరుమాళ్ తిరుమొళి " దివ్యప్రబంధమునకు శ్రీవైష్ణవ సంప్రదాయమున నత్యున్నతస్థానము గలదు. భగవంతుని దివ్యమహిమాదివైభవమును, దివ్యావతార వైభవమును, దివ్యక్షేత్ర వైభవమును వర్ణించు నీ గ్రంథము తక్కిన దివ్యప్రబంధములవలె శ్రీమద్రామానుజులు విశిష్టాద్వైత మతమును బ్రవర్తింపజేయుటలో మార్గదర్శకత్వము వహించుచున్నది. ప్రతిపాదము నందును గులశేఖర పెరుమాళ్‌యొక్క దివ్యవైరాగ్యసంపద, భక్తిభావ శబలతయును సుస్పష్టమగుచున్నది.

ముకుందమాల :

కులశేఖరాళ్వారుల రెండవకృతి "ముకుందమాల" యను స్తోత్ర రత్నము. సంస్కృతభాషలో వ్రాయబడిన ముకుందమాల యను నీ స్తోత్రనామము కలిగిన విధమున వివరించుచు కీ. శే. చెలమచర్ల రంగాచార్యులు గారు—

" మొదటి శ్లోకమున "ముకుంద" అని సంబోధించి చేసిన స్తోత్ర

మాల కావున దీనికి "ముకుందమాల" అను వ్యవహారము కలిగి యుండును " అని వ్రాసియున్నారు.[1]

శ్రీ కాంచీ ప్రతివాదిభయంకర అణ్ణంగరాచార్యులు గారు—

నిత్యవిభూతి యను పరమపదమును లీలావిభూతి యను నీ భూలోకమును వారి వారికి కర్మఫలముగననుగ్రహించుచున్న శ్రీయఃపతియే ముకుందుడని చెప్పబడుచున్నాడు/ము-ముక్తి, కు-భూమి, ద-ఇచ్చువాడు. ఆ స్వామికి పుష్పమాలవలె బరమభోగ్యముగ బ్రకాశించుచున్న యీ స్తోత్రమునకు "ముకుందమాల" నామమాయెను. "ముకుందుడు" అను దానికి ముకుందుని నామములు - అనునది యర్థమయి పూలమాలలో బూలనంముగ గూర్చునటుల భగవన్నామముల నీ స్తోత్రము నందధికముగ నమర్చియుండుటచే ముకుందమాలయనినామమాయెననియుమంగూడజెప్పువారుగలరు అని వివరించియున్నారు.[2]

తాపత్రయపీడితులగు మానవులకు జిత్తశాంతిని బ్రసాదించునది స్తోత్రరాజము. భక్తిప్రపత్తుల ప్రాముఖ్యమును భగవత్కృపావైశిష్ట్యమును ముకుందమాల సమీచీనముగా విశదీకరించుచున్నది.[3] అందలి భగవచ్చరణారవింద లగ్నమైన హృదయానికి మహోన్నతస్థాయి సంసారబాధామగ్నులకు మనశ్శాంతినిచేకూర్చగల వైరాగ్యసంపన్నత మృదుమధుర కవిత్వవిలాసము జగత్ప్రసిద్ధములు.

ముకుందమాల కర్తృత్వవివాదము : ముకుందమాల కులశేఖరాళ్వారుల

---

1. ముకుందమాల
2. ముకుందమాలవ్యాఖ్యానము
3. "The importance of Bhakti or devotion and the mercy of god clearly brought out in this hymn" - A hand book of Hindu religion, p. 63 - Published by T.T.D.,

కృతికాదనియు, గేరళదేశమున గులశేఖరాళ్వారుల వంశమున జన్మిం చిన కులశేఖరుడను నామముకలయొక యర్వాచీన ప్రభువుచే వ్రాయ బడినదని యొకవాదము కలదు. ఇట్లూహించుటకు హేతులివి.[1]

1. ఇది శ్రీ కులశేఖరుల శ్రీసూక్తియై యుండెనేని నాలాయిర వ్యాఖ్యానాదులలో, స్తోత్రరత్నము, పంచస్తవములు, శ్రీ రంగరాజస్తవము మొదలగు స్తోత్రములవలె దవ్వకుండ నుదాహరింపబడియే యుండును.
2. తదితర స్తోత్రములకవలె దీనికికూడ బూర్వాచార్యులచే వ్యాఖ్యానము చేయబడియే యుండును.
3. దైవసన్నిధిలోబలు ప్రకరణములలో నీ స్తోత్రమనుసంధించు నటుల బెద్దలచే నియమింపబడియుండును.
4. వేదారంభము, మంత్రపుష్పార్చనము మున్నగు ప్రకరణ ములయందు నాద్యంత శ్లోకానుసంధానము సంప్రదాయ ముగ వచ్చియుండును.
5. భగవద్రామానుజులకాలమునందవతరించినదియు, శ్రీవైష్ణవ సమాచారములకు బరమప్రామాణికమైనదియునగు శ్రీగరుడ వాహనపండిత కృత దివ్యసూరిచరితమున నైదవసర్గలో గులశేఖరాళ్వారుల దివ్యవైభవమును జెప్పి ముగించునపుడు

"అథావత ద్రావిడభాషయా సౌ
గాథాశతే నాస్య మహాప్రబంధమ్"[2]

అని పెరుమాళ్ తిరుమొళి మాత్రమే పేర్కొనబడినది. కాని ముకుంద మాల పేర్కొనబడలేదు.

6. ముకుందమాలలోని కట్టకడపటి శ్లోకమున గులశేఖరులకు

---

1. ముకుందమాలవ్యాఖ్యానము
2. దివ్యసూరిచరితము 5 స. 13 శ్లో.

"ద్విజన్మవరుడు", "పద్మశంకరుడు" అను యిరువురు స్నేహితు లున్నట్లు చెప్పబడినది.[1] కులశేఖరాళ్వారులకా యిరువురు స్నేహితులై యుండినటుల దివ్యసూరిచరిత్రమందు గాని, యితర సంప్రదాయ గ్రంథములందు గాని యెచ్చటను వ్రాయబడియుండలేదు.

7. కులశేఖరుడను వేతొక కేరళచక్రవర్తిచే రచింపబడిన కొన్ని సంస్కృత నాటకములు కలవు. ఆ నాటకములలో నా కులశేఖర ప్రభువునకు ద్విజన్మవరుడు, పద్మశంకరుడు నను నిరువురు మిత్రు లున్నట్లు పేర్కొనబడినది.

శ్రీకులశేఖరాళ్వారుల వంశమందు జన్మించిన తదనంతర ప్రభువు లకు గులశేఖరుడను గౌరవనామమున్నట్లు కానబడుచున్నది. ఉదా హరణకు క్రీ.శ. 1813వ సంవత్సరమున జన్మించి 1829-47 సంవత్సర ముల నడుమ తిరువాన్కూరు రాజ్యమేలి గొప్ప వాగ్గేయకారుడుగా ప్రఖ్యాతి హొందిన "స్వాతితిరునాళ్" అను ప్రభువునకు "కులశేఖర మహా రాజు" అను వ్యవహరనామమున్నట్లు "గానకళాబోధిని" అను సంగీత గ్రంథమున బేర్కొనబడినది.[2]

పై కారణములవలన ముకుందమాల కులశేఖరుడను పేరుగల వేతొకరాజుచే రచింపబడినదని పేర్కొనబడుచున్నది. అయినను చాల కాలమునుండియు సకల శ్రీవైష్ణవులచేతను శ్రీ కులశేఖరాళ్వారులే ముకుందమాలా స్తోత్రకర్త యని భావింపబడుచున్నది.

---

1 యస్యప్రియౌ శ్రుతిధరౌ కవిలోకవీరౌ
మిత్రే దిజన్మవర పద్మశరావభూతామ్ ।
తేనాంబుజాక్ష చరణాంబుజ షట్పదేన
రాజ్ఞాకృతా కృతిరియం కులశేఖరేణ॥ - ముకుందమాల, 40

2 కర్త శ్రీఎస్.పి.పార్థసారథి. బాలసరస్వతిబుక్‌డిపో 1984 పు385

ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే
తమహం శిరసావందే రాజానం కులశేఖరమ్॥

అను తనియతో జేర్చి ముకుందమాల పరంపరాగతముగా గులశేఖ రాళ్వారుల పేరుమీదనే ప్రసిద్ధమైయున్నది.

ముకుందమాలలో మొత్తం నలుబది శ్లోకాలున్నవి. శ్రీకృష్ణస్తుతిః శ్రీకృష్ణావతార వైభవం, నీ స్తోత్రమునం దెల్లెడల గోచరించును. ౩౦వ శ్లోకమున మాత్రము "శ్రీరామ" అను సంబోధన కానవచ్చు చున్నది తక్కిన తావులందెల్ల శ్రీమన్నారాయణపరముగనో, శ్రీకృష్ణ పరముగనో యున్నది.

౪. కులశేఖరప్పడి - కులశేఖరులను గూర్చిన యొక యైతిహ్యము :

తిరుమల వేంకటేశ్వరస్వామివారి దేవాలయమున గర్భాలయము లోని గడపకు "కులశేఖరప్పడి" అను వ్యవహారము కలదు. నేటికిని భక్తులా గడపను గులశేఖరాళ్వారుల ప్రతిరూపముగా భావించుటకలదు. తిరుమలేశుని దర్శించిన శ్రీ కులశేఖరులు భక్త్యావేశపారవశ్యమున నీగడపపై వివశులై పడిపోయిరట. అందువలన నాగడపకు "కులశేఖర ప్పడి" అను వ్యవహారమేర్పడినదట. ఈ వ్యవహారమేర్పడుటకు మరి యొకటికూడకారణముకానవచ్చును, శ్రీకులశేఖరాళ్వారుతమదివ్యప్రబంధ ముగా పెరుమాళ్ తిరుమొళి యందు జతుర్థదశకమున శ్రీవేంకటాద్రి యందు దమకు గల యాదరాతిశయమును దెల్పి, స్థావరజంగమాద్య నేక జన్మల గోరుకొని, కట్టకడపట శ్రీవేంకటాద్రితో నిత్యసంబంధ

1. ఎవ్వని నగరమున ప్రతిదినమును రంగయాత్ర యని చాట బడుచుండునో యట్టి రాజగు కులశేఖరునకు నేను దలవంచి నమస్కరింతును.

ముండునట్లు తిరుమలేశుని యెదుట భాగవతులును, దేవతలును, అప్స రసలును నెడతెంపులేక సంచరించుమెట్టుగనుండుటకు బ్రగాఢముగా గోరుకొనియున్నారు. ఈకట్టకడపటి యభీష్టము ననుసరించి శ్రీస్వామి వారి యెదుటనున్న గడపకు "కులశేఖరప్పడి" అను వ్యవహారమేర్పడి యుండవచ్చును.

## 1. ఇతివృత్తము :

కావ్యమునకితివృత్తము శరీరము. ధర్మమునకు శరీరమెట్లాద్య సాధనమో యట్లే బ్రహ్మానందసబ్రహ్మచారియగు కావ్యానందమున కితివృత్తము ప్రథమసాధనము. పాత్రపోషణమునకు, రసపోషణము నకు, బ్రధానాలంబనము - ఇతివృత్తము. బలీయమగు నితివృత్తమే కావ్యమునకు బరమ ప్రయోజనములగు సదుపదేశ సద్యః పరనిర్వృతు లకు మూలము

కృశీభూతదేహము కృశీభూతభావముల నుత్పాదించునట్లు దుర్బ లేతి వృత్తము గల కావ్యమున వర్ణనలు - గుణాలంకారాదులు నైశ్య లక్షణ విరహితములై, విరసములై, విరుద్ధప్రయోజనప్రదములై వ్యర్థములగును.

ఇతివృత్తమువలన గవికి గవివలన నీతివృతమునకు ఖ్యాతి సంభవించును. వాల్మీకి మహాకవి కీర్తికి రామకథ మూలకందమనియు రామాయణప్రాశస్త్యమునకు వాల్మీకి కవితావిశేషమే మూలకారణ మనియు నార్యులందురు.

దుర్బలేతివృత్తముతో కథాప్రస్థానము సాగింపనెంచు కవి దుర్బల తురంగముపై "స్వారి" చేయు రౌతువలె నవ్యముగ గమ్యమును జేర జాలడు. ఆంధ్రభాషలో గ్రంథరూపము వొందిన కవిత్వము నన్నయ చేతిమీదుగా బ్రఖ్యాతేతివృత్తానువాదముతో నారంభమైనది. తదనంతర

కాలమున నాంధ్రకవిత్వ మాబాటనే సాగిసాగి శ్రీనాథుని నాయకత్వ మున గావ్యానువాదములోనికి మారినది. పురాణాంధ్రీకరణయుగ ములో నితివృత్తమునకు బ్రాధాన్యమధికము. కావ్యయుగమున నీతి వృత్తమునకు రచనా ప్రావీణ్యమునకు సమ ప్రాధాన్యము. తదుపరి వచ్చిన ప్రబంధయుగమున నితివృత్తప్రాముఖ్యము మరుగునబడి రచనాచమత్కృతికి బట్టము కట్టబడినది.

ఇతివృత్త స్వీకరణము - తన్నిర్వహణము :

కేవల కల్పనాకథలు కృత్రిమరత్నములు - అద్యసత్కథలు-పుట్టురత్న ములుఅవారి తసత్కవికల్పనావిశేషావహ పూర్వవృత్తములు సానలు దీరిన జాతిరత్నములు - అనునది ప్రబంధయుగమున దదనంతర యుగములలోను నితివృత్తస్వీకరణమునకు సర్వసామాన్య మార్గదర్శక సూత్రమైనట్లు కాన్పించుచున్నది. అదే సూత్రము నవ్యయుగప్రాదు ర్భావమువరకు బ్రాయశః సాగివచ్చుచునేయున్నది.

రఘునాథాచార్యుడీ మార్గముననే తన ప్రబంధమున కితివృత్త ముగ బూర్వవృత్తమునే యెన్నుకొనినాడు. కాని యిది రామాయణ మహాభారతాది ప్రాచీన కావ్యేతిహాసపురాణాదు లందలిదికాక శ్రీవైష్ణవ సంప్రదాయపరంపరాగతమైనది. ఆంధ్రభోజుడగు శ్రీకృష్ణదేవరాయలు తన యాముక్తమాల్యదా ప్రబంధమునకు జన్నిద్దరాళ్వారులలో నొక డగు విష్ణుచిత్తునియొక్కయు నాతని పుత్రి యగు నాళ్వారుకోటిలో బరిగణింపబడుచున్నదియు నగు శ్రీగోదాదేవియొక్కయు గాథను బ్రధానేతివృత్తముగ గైకొనియున్నాడు. రఘునాథాచార్యుడు నట్లే పన్నిద్ధరాళ్వారులలో గడు ప్రసిద్ధుడగు కులశేఖరాళ్వారు జీవితమును నితివృత్తముగ స్వీకరించియున్నాడు.

తానీ యితివృత్తమును గైకొనుటకు గారణమును స్వయముగా గవియే వివరించియున్నాడు.

"ఎద్దియేనియు నొక్క చిరంతన ప్రపన్నచరితంబును మిశ్ర కవితా విశేషానుబంధంబు గాంచి భగవత్సమర్పితంబుసేయు భాగ్యంబు దొరకొనునొకో"[1] యని యోచించుచు రఘునాథాచార్యులు నిద్రించిరట.

అంతక్షపావసానయామంబున శ్రీరాముడు కలలోకి వచ్చి—

ఏను రఘువల్లభుడ నీదు హృదయమెఱిగి
వచ్చితిని గులశేఖరాళ్వార్ల చరిత
మాంధ్రగీర్వాణమిశ్ర పద్యాంతరముల
గృతి వినిర్మింపు మాకు నంకితముగాంగ[2]

అనియానతిచ్చినాడు. ఇట్లు కవి యోచనయు, రఘువల్లభుని యానతియునేకమైన కులశేఖరమహీపాలచరిత్ర రూపొందినది. ఈకృత్యా విర్భావ, సన్నివేశమున శ్రీరాముడు రఘునాథునితోబలికిన పలుకు లాంధ్రభోజుడు శ్రీకృష్ణదేవరాయలతో నాంధ్రమహావిష్ణుడు పలికి పలుకులను బోలియున్నవి.

ఆంధ్రమహావిష్ణువు రాయలుతో – నీవనేక సంస్కృతకావ్యముల రచించితివి. యాంధ్రభాషలో వ్రాయుట యసాధ్యము కాదు. కావున "కృతి వినిర్మింపు మింక మాకు బ్రియముగాగ"[3] అనినాడు. ఈ పద్య పాద మచ్చముగా శ్రీరాముడు రఘునాథాచార్యునితో పలికిన పలుకు లను వివరించిన పద్యములోని నాల్గవపాదము "కృతివినిర్మింపు మాకు నంకితముగాగ"[4] అనుదానికి నాదర్శమైనట్లున్నది. " ఏను తెలుగు

1. కులశేఖరమహీపాలచరిత్రము 1-14
2. కు. మ. చ 1–17
3. ఆముక్తమాల్యద, 1–13
4. కు. మ. చ 1–17

వల్లభుండ [1] అను మహావిష్ణుని వాక్యము విను రఘువల్లభుండ [2] అను వాక్యమున కాదర్శమైనట్లున్నది. ఒక యాళ్వారు జీవితగాథ నితివృత్తముగా గైకొను విషయమున రఘునాథాచార్యునకు శ్రీకృష్ణదేవరాయలాదర్శమైనట్లు తోచుచున్నది పంచాయుధస్తోత్ర-నిత్యసూరి స్తోత్రాది విశిష్టాద్వైతమత సంప్రదాయస్ఫురణమును గూడ రఘునాథాచార్యుడు కృష్ణదేవరాయలు నుండియే సేకరించుకొనినట్లున్నది.

రఘునాథాచార్యుడు గ్రంథరచనమును గూర్చిచేసిన యోచనలో మూడంశములున్నవి. చిరంతన ప్రపన్నచరితమును వ్రాయుట మొదటిది. మిశ్రకవితా విశేషానుబంధముగావించుట రెండవది. భగవత్సమర్పితము చేయుట మూడవది. భక్తుడగు రఘునాథాచార్యుని మనస్సులోని విషయములే హృదయము మెఱిగి వచ్చిన సీతాపతి పలుకులలో బ్రతిధ్వనించినవి. కవి చిరంతన ప్రపన్న చరితమును వ్రాయుదలపెట్టగా ప్రపన్న శేఖరుఁడగు కులశేఖరాళ్వారుల చరిత్రమును వ్రాయుమని రాముని నిర్దేశము. రఘునాథాచార్యుడు తను కావించినకృతిని భగవత్సమర్పితము జేయవలెయు ననుకొనగా నా కృతిని తనకి యంకితము చేయుమని రాఘవు నానతి. కవి మిశ్రకవితా విశేషానుబంధము[3]గా వింపదలపోయగా ఆంధ్రగీర్వాణమిశ్రపద్యాంతరముల[4] గృతిని నిర్మింప రఘుపతిసమ్మతి ఇట్లు కవిసంకల్పమునకు భగవత్ప్రేరణముతో డై కులశేఖరమహీపాలచరిత్రము ప్రబంధరూపముగా నాంధ్రసంస్కృతీ గ్రైవేయకమైనది. ఈ యితివృత్త స్వీకరణము వలన శ్రీవైష్ణవమతస్థుడగు

---

1. ఆముక్తమాల్యద 1-15
2. కు.మ.చ 1 17
3. కు.మ.చ 1-14
4. అదే, 1-17

రఘునాథాచార్యుని భగవద్భాగవత సేవాప్రవణత వ్యక్తమగుచున్నది

శ్రీరామచంద్రడే స్వయముగ శ్రీ కులశేఖరాళ్వారుల చరిత్ర మును గృతిగా నిర్మించుటలోని యౌచిత్యమును విశదీకరించును.

'పరమపురుషార్థవేత్త అగు భాగవతోత్తములంగీర్తించుట కీర్తి కరంబును, మదీయ కైంకర్యవిశేషంబునగుంగావున నిత్తెఱంగునం గావించి కృతార్థుండవుగమ్ము1-18 అనివల్కినాడు ఈ శ్రీరామంచద్రోక్తి యందు కావ్యప్రకాశకారుడు ఆచార్య మమ్మటుడు పేర్కొనిన—

కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే।
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మిత తయోపదేశయుజే॥[1]

అనుదానిలో యశస్సునకు, శివేతరక్షతికి ప్రాముఖ్యము నొసంగినట్లు గాన్పించుచున్నది. రఘునాథాచార్యుని దృష్టిలో కావ్యము భగవత్స మర్పితమైననే యదివిశిష్టమైనది, కుకవినింద గావించువట్టున నాతడు అనయము సత్కవుల్ భగవదర్పిత కావ్యరసంబు మెత్తురు[2] అనిపేర్కొని యుండుట వలన నిట్లూహింప వీలగుచున్నది. మఱియు నీకని తన్ను గూర్చి పేర్కొనుచు—

ఇల రఘునాథార్యుండన
వెలసితి లక్ష్మణమునీంద్ర విమలపదాబ్జం
బులు శరణంబని నమ్మితి
అలి భాగవతార్చనాభిలాషం బెసగన్

1. కావ్యప్రకాశము 1-2
2. కు.మ.చ 1-13
3. అదే, 1-22

అను పద్యమున తన ప్రగాఢ భాగవతాచ్చరనాభిరతిని వెల్లడించి యున్నాడు. అందులకు దగినట్లు పరమభాగవత కులశేఖరుడగు శ్రీ కులశేఖరాళ్వారుల చరిత్రమును బ్రబంధముగా నిబంధించి తన యభిలాషను ఫలవంతము కావించియున్నాడు.

కులశేఖరాళ్వారుల చరిత్రమును గురించియు దన్మూలమును గుఱించియు వివరించుచు రఘునాథాచార్యుడు పురాతన భాగవత పరంపరాముఖోదీరితంబై వచ్చుచున్నయది. పరమపవిత్రంబగు తచ్చరిత్రంబు మీకు దెలియునట్లు వివరించెద[1] పేర్కొనాడు.

దీనినిబట్టి ప్రతేకముగా నేయొక్క గ్రంథమునాధారముగా గాని యాతడీ గ్రంథరచన సాగింపలేదనియు, లోకమున వ్యాప్తిలోనున్న కథ నాధారముగా గాని తనయిష్టానుసారము ప్రబంధ నిర్మాణమున కనువుగా మార్పులు గావించి కులశేఖరమహీపాలచరిత్రమును నిర్మించి నట్లును జెప్ప వలసియున్నది.

కాని పన్నిద్ధరాళ్వారుల చరిత్రలు కేవలము మౌఖిక ప్రచారము నందున్ననే కావు. పలు గ్రంథములందు ప్రామాణికముగా నాయా యాళ్వారుల చరిత్రలు వ్రాయబడి యున్నవి. అయా గ్రంథములు శ్రీవైష్ణవమతస్థుల నిత్య పఠనపాఠనములలో విరివిగ నున్నవి. కావున బురాతన భాగవత పరంపరాముఖోదీరితమై వచ్చుచున్నవని రఘునాథాచార్యుడు పేర్కొని యాళ్వారుల జీవితగాథలకీ గ్రంథములే పరమ ప్రమాణములు, ఇవి శ్రీవిశిష్టాద్వైతమత ప్రస్థాన ప్రసిద్ధములు, తన్మత సంప్రదాయబద్ధములును. వానిలో బ్రథమము శ్రీ గురుడవాహన పండితుడు వ్రాసినదివ్యసూరి చరిత్రము, చరిత్ర కందినంతవరకిదియే యాళ్వారుల చరిత్రల వర్ణించిన తొలి గ్రంథము. ఈతని తరువాత

---

1. కు.మ.చ.-137

వెలసినయనంతాచార్యుడు సంస్కృతభాషలో వెలయించిన ప్రపన్నామృతము, శ్రీ పిన్‌పళి కరాసె పెరుమాళ్ జియ్యర్ రచించిన గురుపరంపరాప్రభావము, నను నీరెండును దివ్యసూరి చరిత్రమును ప్రామాణికమూలముగా గొని యాళ్వారుల చరిత్రలను విస్తరించినవి. తెలుగున క్రీ.శ.1560 ప్రాంతమున తాళ్లపాక తిరువేంగళ నాథుడు రచించిన పరమయోగివిలాసమను ద్విపదకావ్యము నాటికి వ్యాప్తిలో నున్న సమస్త విషయములను జేర్చి వ్రాయబడిన యాళ్వారుల చరిత్రలను వివరించు గ్రంథము.తదనంతర కాలమున శ్రీనంబూరి కేశవాచార్యులుచే రచింపబడిన ఆచార్య సూక్తి ముక్తావళి అను పద్యకావ్యము దివ్యసూరి చరితమును, బరమయోగి విలాసమును బ్రమాణములుగాగొనినట్లున్నది

కావున రఘునాథాచార్యులు తన గ్రంథమున స్వీకరించిన యోగి వృత్తమును గుఱించి పరిశీలించునపుడీ యుపర్యుక్త గ్రంథములతో బోల్చిచూచుట తప్పనిసరి. అట్లు పరిశీలించినప్పుడు మాత్రమే రఘునాథాచార్యుని ప్రబంధ నిర్మాణదక్షతయును, నవకల్ప సన్నివేశ కల్పనా శిల్పప్రాగల్భ్యమును, నవ్యతిమాన రసపోషణవైదగ్ధ్యమును వెల్లడి కాగలవు. పైన పేర్కొనిన యైదు గ్రంథము లందు నాచార్యసూక్తిముక్తావళి రఘునాథుని కంటె నర్వాచీనము. కావున దాని ప్రసక్తి విడుచుట యుక్తము. ఇంక తెలుగున ద్విపదగా వెలసిన పరమయోగి విలాసము రఘునాథుని కంటె బూర్వమందు వెలసినదియును,దనకాలంనకు వ్యాప్తిలోనున్న సమస్తవిషయములతో నాళ్వారుల చరిత్రలను ప్రామాణికముగా వివరించిన గ్రంథము కావున నందలి యితివృత్తముతో గులశేఖరమహీపాలచరితము నందలి యతి వృత్తమును బోల్చి చూచిన రఘునాథాచార్యుడు స్వయముగ గావించిన కల్పనలు నిర్ణయించుటకు వీలు కలుగును.

పరమయోగి విలాసమునన్న కులశేఖరుని వృత్తాంతము :

తాళ్లపాక తిరువెంగళనాథుడు రచించిన పరమయోగివిలాసమున మూడవ యాశ్వాసమున 179వ పుట నుండి 232వ పుట వరకు గల కులశేఖరునిగూర్చిన విషయములు వివరింపబడినవి.[1] అందు పేర్కొనబడిన యంశములు ఇవి :

కేరళదేశమున గుక్కుటకూట నగరమును చేరవంశపు రాజు పాలించుచుండెను. అతనికొక పుత్రుడు మాఘపునర్వసు తారను జలజాక్షుని కౌస్తుభాంశమున జన్మించి కులశేఖరాఖ్యగైకొని దివ్యయోగి కులశేఖరుడు అని కీర్తిపొంది శ్రీరామ పదభక్తియుక్తుడై యుండెను. వైష్ణవులవట్ల భక్తి గలిగియుండెను. ఒకప్పుడు భాగవతులను ద్వార పాలకులడ్డుకొనగా నది తెలిసి ద్వారపాలకులను మందలించినాడు వైష్ణవులతో మీరు నిరంతరముండుటయేల ? అని ప్రశ్నించినారు మంత్రులు. మీరు నాతో నుండుట లేదా యని వీరి సమాధానము. ఒకనాడు కొందఱు భాగవతులు కులశేఖరుని దర్శింపవచ్చిరి. మంత్రులా యదనున నాభరణముల దాచి యా నిందను వైష్ణవులపై మోపినారు. కులశేఖరులు పామునుముట్టి శ్రీవైష్ణవుల నిర్దోషిత్వమును నిరూపించగా రాముడు ప్రత్యక్షమై నీ కుమార్తె నీళను నాకు నిమ్మని యడుగ కుల శేఖరుడు సంతోషముతో నట్లు గావించినాడు. మంత్రులు పశ్చాత్తప్తులైరి. కుమారునకు బట్టము కట్టి రామాయణమును వినుచుండెను, సీతాపహరణ వృత్తాంతమున రావణునిపై దండెత్తిపోవుచుండగా విష్ణు నాతని వైకుంఠమునకు దీసికొనిపోయినాడు. ద్రావిడ ప్రబంధము నంతకుముందు గులశేఖరుడు రచించియుండెను. ఇది సంగ్రహముగా నందు గులశేఖరుని గూర్చిన వృత్తాంతము.

---

1. శ్రీపిఠాపురంసంస్థానాధీశులచే కాకినాడ ముద్రాక్షరశాలలో 1928లో ముద్రింపబడిన ప్రతి.

రఘునాథాచార్యుడు గావించినమార్పులు-వినూత్న కల్పనలు :

ఈ కథాంశమును గైకొని రఘునాథుడు తన ప్రబంధప్రణాళికకు దగినట్లు పెక్కులు మార్పులు - కల్పనలు గావించియున్నాడు.

1. దృఢవ్రతుడు వేటకేగి - హరిణివాక్యములచే ననపత్యత విషయమున జింతయేర్పడ శ్రీవైష్ణవుల యానతిపై వ్రతదీక్షితుడగుట యను సన్నివేశము రఘునాథుని కల్పనయే.

2. పుత్రార్థియై వ్రతదీక్షితుడైన రాజునకు శ్రీహరి ప్రత్యక్షమై పుత్రుడు కలుగునట్లు వరమనుగ్రహించెనని రఘునాథుని కల్పనము. ఈవిషయమున మూలగ్రంథములందు కేరళప్రభువునకు కులశేఖరులు జన్మించిరని మాత్రమే కలదు.

3. దృఢవ్రతపత్నికి దౌహృదలక్షణములు - కుమారోదయము కులశేఖరుని బాల్యవర్ణనము - దిగ్విజయవర్ణనము నివి యన్నియు రఘునాథాచార్యుని కల్పనలే. కులశేఖరుడను నామకరణమునకు —

చంద్రవంశావతంసమై సంభవించు
సుతున కన్వర్థముగనై యశోధనుండు
ప్రేమ గులశెఖరుండను నామ మిడియె
సకల శిష్టసభాజన సమ్మతముగ[1]

అను వివరణము రఘునాథాచార్యునిదే.

4. శ్రీవైష్ణవ యతి వచ్చి విశిష్టాద్వైతమత విషయముల వివరించుట - రామాయణ ప్రసంగము రఘునాథాచార్యుని కల్పనలే. సందర్భమును గల్పించుకొని శ్రీమద్రామాయణమును 133 గద్య

---

1. కు.మ.చ. 2-73

పద్యములతో గవియే స్వయముగా వివరించియున్నాడు. ఇది కవి యాశ్వాసాంతగద్యలో దన్నుగూర్చి శ్రీరామచంద్ర కరుణానిరీక్షణ సమాపాదిత కవితావిశేషుడ" నని చెప్పుకొనిన దానికిసరిపడియున్నది. కాని మూలగ్రంథములందు నీళను రాముడు గైకొన్నట్లున్నది. రాము డేకపత్నీవ్రతుడగుటచేతనో యేమో రఘునాథాచార్యుడు రంగనాథుడు కైకొనినట్లు పేర్కొనినాడు.

5. నీళాదేవి బాల్యయౌవనముల వర్ణన - విరహతాపాదులు — నీలవేణి దౌత్యము — రంగనాథుని విరహము - రంగనాథుడు శ్రీముఖ పత్రిక వ్రాసి యిచ్చుట యనునవి యీకవి కల్పనలే.

6. నీళారంగనాథుల వివాహపు వేడుకలు—కులశేఖరులు రంగనితో శ్రీరంగమునకేగి పుత్రిక నిందిర కప్పగించుట — ఆమె యాదరించుట యనునవీతని కల్పనలే.

7. రంగనాథుడిందిరా సఖులతో నీళనిందిరా సమీపమునకంపుట ఇందిరారంగనాథుల మేలములు రఘునాథాచార్యోపజ్ఞకములే.

8. కులశేఖరుని తండ్రిపేరు దృఢవ్రతుడను విషయము దివ్య సూరిచరితాదులందుగాని- పరమయోగి విలాసమునందుగాని-ఆచార్య సూక్తిముక్తావళియందు గాని పేర్కొనబడలేదు. అధునిక కాలమున వెలసిన "ఆళ్వారుల ఆచార్యుల చరిత్రము"[1] నందును "ద్వాదశసూరి చరిత్ర"[2] యందును గులశేఖరుల తండ్రి పేరు దృఢవ్రతుడని పేర్కొనబడినది.

---

1. చెన్నపురి శశిరేఖా ముద్రాక్షరశాలలో ముద్రింపబడినది, 1927
2. శ్రీ కె.టి.ఎల్. నరసింహాచార్యులు గారు- గోదాగ్రంథమాల 1973

పరమయోగి విలాసమున—

.... .... ఆర్ధి
పన చైత్రుడును దృఢవ్రతుడును నగుచు
పంచి పక్మాంగదుడని త్రిలోకముల
నుపమింపదగు శ్రీవైష్ణవోర్వీశ్వరునకు[1]

అని పేర్కొనబడియున్నది. దీనినిబట్టి కులశేఖరాళ్వారు తండ్రి పేరు దృఢవ్రతుడమట వీలుకాదు.

సంతానార్థియై యొక వత్సరము మాధవారాధన వ్రతమును సుదృఢముగా నిర్వహించి యభీష్టసిద్ధి నొందియుండుటచే గులశేఖరుని పతండ్రిని యన్వర్థమగునట్లు రఘునాదుడే దృఢవ్రతుడని పేర్కొ యుండవచ్చును. అంతియుగాక యెవ్వరును బేర్కొనని కులశేఖరుని కుమారుని పేరును గూడ దృఢవ్రతునియే రఘునాథాచార్యుడు పేర్కొనినాడు. తాత గారి పేరు మనుమని కుంచెడు లోకాచారమును బట్టి యీతడిట్లు గావించియుండును.

9. కులశేఖరాళ్వారుల భార్యను గురించి పూర్వగ్రంథముల యందెచ్చటను బ్రస్తావింపబడలేదు. రఘునాథాచార్యుడు మాత్రము కలశేఖరుల భార్యామణి "అనన్యకన్యాసాధారణమ్ములగు గుణసౌందర్య విశేషమ్ములం బొలుపు దీపించు రాజపుత్రిక"[2] అని పేర్కొనినాడు. పుత్రికసత్తవారింటికి బంపనప్పుడీమె కుమార్తైను—

.... .... వగవకే సరసిజాక్షి!
కోరుకున్నంత మేలు చేకూరె నీకు[3]
నతహితుండగు శ్రీరంగనాయకుండు
ప్రేమ నేతెంచి నిన్ను వరించినాడు

---

1. పరమయోగివిలాసము, తృతీయాశ్వాసము, పు. 184
2. కు.మ.చ, 2-88
3. అదే, 4-185

నేగుచు బదవమ్మ యింకేల వగవ నీకు
జగములకు నెల్ల నేలికసాని వగుచు ।

అని లోకములో నందరు తల్లులవలె నోదార్చినట్లు వర్ణించి యున్నాడు. కులశేఖరాళ్వారు సంపూర్ణ గృహస్థ జీవితము ననుభవించిన రాజర్షిగా జిత్రించుటకై యాతని భార్యయొక్క ప్రసంగమును రఘునాథాచార్యుడిట్లు చేసియుండునని యూహింపవచ్చును.

10. నిత్యసూరులలో నొకడును శ్రీ వైష్ణవులచే గరుడాళ్వారుగా మన్నన అందువాడునగు గరుత్మంతుడు నీళావిరహవ్యథితుడగు రంగనాథునకు నర్మసచివుడై యోదార్చినట్లొక సూత్నకల్పన గావించినాడు రఘునాథాచార్యుడు.

11. దివ్యసూరిచరితముననుు, బరమయోగి విలాసము నందును ముకుందమాల స్తోత్రమును గులశేఖరాళ్వారులు రచించినట్లు పేర్కొనబడి యుండలేదు. లోకమున గల ప్రసిద్ధినిబట్టి రఘునాథాచార్యుడు మాత్రము పేర్కొని యున్నాడు,

ఇట్లు శ్రీ వైష్ణవ సమాజమున రేఖామాత్రముగ బ్రసిద్ధమై యున్న కులశేఖరాళ్వారుల జీవితగాథను ప్రబంధోచిత కల్పనలతో బెంపు గావించి సర్వాంగ సౌందర్యసముపేతముగా భక్తి భరితముగా సహృదయ హృదయాహ్లాద సంధాయకముగా కులశేఖరమహీపాల చరిత్రమునుమహాప్రబంధముగా దీర్చిదిద్ది యున్నాడు.

## 2 పాత్ర చిత్రణము :

రసపోషణమునకు బాత్రలాధారములు. కావుననే పాత్ర యను నామము సార్థకము. సజీవములగు పాత్రల సృజించి వానిమూలమున బఠితల హృదయములలో రసానందములు గలిగించుటయే కవి

1. కు. మ.చ, 4-186

కృత్యము. ఇందే కవి చాతుర్యమును గృతకృత్యతయు నిమిడి యుండును. కథ యెంతటి బలవత్తరమైనను బాత్రపోషణ విధానము సమర్థవంతముగ సాగనిచో కావ్యము నీరసమై తోచును. అపూర్వ పాత్రసృష్టియు దత్పోషణమును గవి ప్రఖ్యాతికి బ్రధాన సహేతువులు వాల్మీకి వ్యాస కాళిదాసాదులు సజీవపాత్రస్రష్టలై విశ్వవిఖ్యాతులైనారు

కావ్యగత పాత్రలు మన కనుల యెదుట గదలుచున్నట్లు వాని హావభావ చేష్టాసంభాషణాదికమును బ్రత్యక్షముగా గనుచున్నట్లు వినుచున్నట్లు భ్రమింప జేయుటయే పాత్రపోషణ సామర్థ్యమునకు దుది మెట్టు

ఇట్టి పాత్రపోషణ కౌశలమున గవిబహ్మ యాంధ్ర సాహిత్యమున బ్రథమగణ్యుడు. పెద్దనగారు వరూధినిని, దిమ్మన గారు సత్యభామను ఇట్లొక్కొక్క కవి యొక్కొక్క పాత్రనపూర్వ శోభాయుక్తముగ దీర్చి దిద్ది యున్నారు. తిక్కన తరువాత పాత్రపోషణ కళలో నదీష్ణుడు పింగళి సూరన. ఈతని పాత్రలన్నియు ననితర సామాన్యములు సజీవములు, నపూర్వ శోభాసంపన్నములు. పెద్దనాదులాద్య సత్కథలనే తమ కావ్యముల కితివృత్తములుగా గైకొన్నవారగుటచే మూలమున నున్న పాత్రలకే మఱింత మెఱుగులు దిద్ది రంజిల్లజేసి యున్నారు. మూలగ్రంథములందే యాపాత్రలు ప్రఖ్యాతములగుటచే వీరి పని సుంత సుకరమైనది. కాని సూరయట్లు కాక తన కళాపూర్ణోదయమున గేవలము తాను గల్పించిన కథ నితివృత్తముగా నొనరించి యుండుటచే దత్తత్పాత్రల గుణరూపశీలాదు లన్నియు నాతని కల్పనలే యిట్టి యద్భుతమైన సృజనశక్తి యాంధ్రకవితా రంగమున నాటి కపూర్వము.

కులశేఖరమహీపాల చరిత్ర కర్తయగు రఘునాథాచార్యుడు

సూరిన మార్గమున స్వయముగ గొన్ని పాత్రలసృజించి యద్వితీయ ముగా బోషించిన కవితల్లజుడు ప్రబంధనాయకుడగు కులశేఖరాళ్వారును, నాతని మంత్రులును దప్ప తక్కిన పాత్ర లన్నియు రఘునాథాచార్యోపజ్ఞకములే. తత్ప్రతిభాభృతములే. దృఢవ్రతుడు నీళాదేవి నీలవేణి ముఖ్యముగా నీ మువ్వురును రఘునాథాచార్యుడు మూల సంప్రదాయ గ్రంథముల యందే యాధారము లేకుండ దీర్చిదిద్దిన పాత్రలే. శ్రీ రంగనాథుడు, లక్ష్మీదేవి పాత్రలను బ్రబంధోచితముగా భక్తియుక్తముగ నుదాత్తరమణీయముగ బోషించియున్నాడు.

ఇంక హరిణి పాత్ర యాంధ్రసాహితీలోకమున నత్యుదాత్తసృష్టి అనన్యములగు ప్రబంధపాత్రలలో నగ్రగణ్యము. సమగ్ర సముదగ్ర శోభాలాలిత్యహేలా విలాసములచే వరూధిని సత్యభామ, కలభాషిణి మున్నగు నత్యుత్తమ పాత్రల సరసన బేర్కొనదగినదీ హరిణి పాత్ర.

ప్రబంధనాయకుడగు కులశేఖరుడు సంప్రదాయ గ్రంథము లందు బరమ భాగవతోత్తముడుగా గీర్తింపబడినవాడు. అతని జీవిత మునకు సంబంధించిన యాయా ఘట్టములను గైకొనిప్రాబంధికములగు మార్పులు గావించి రసోచితముగా మలచి పాత్రపోషణకళాకౌశలమును బ్రదర్శించి విశిష్టాద్వైత సంప్రదాయ ప్రబోధకముగా గణనీయ గుణ గణగరిష్ఠముగనాదర్శప్రాయమగు పాత్రగావిరూపొందించియున్నాడు.

రఘునాథాచార్యుడా యా పాత్రల జిత్రించి పోషించిన విధమును బరిశీలింతము.

1 కులశేఖరుడు : కులశేఖర మహీపాలచరిత్రమున నాయకుడు కులశేఖరుడు. భక్తిభరితమునగు నీతని సంపూర్ణజీవితమీప్రబంధమున

వర్ణించబడినది.

శ్రీమన్నారాయణుని వరప్రభావమున మాధవారాధన మహిత ఫలముగ దృఢవ్రత మహారాజునకు శ్రీమహావిష్ణుని వక్షస్థలమున నుండు దివ్యమణి యగు కౌస్తుభము యొక్క యంశమున జన్మించిన ప్రసన్న పురుషవరేణ్యుడు కులశేఖరుడు. ద్వాదశసూరులలో నొకడుగా ఖ్యాతి నొందిన వాడీతడు.

వరప్రదాన సమయమున దృఢవ్రత దంపతులతో శ్రీమన్నారా
యణుడు .... .... మీ యం
దనుపమ మదీయ కౌస్తుభాంశంబున నం
దనుడు జనించు దిజో
వినయోజ్జ్వలశౌర్య ధైర్యవిశ్రుతు లెసగన్ 2-59

అని యానతిచ్చెను. దీనివలన నారాయణుడే స్వయముగ కులశేఖరుడు తేజస్సు, వినయము, శౌర్యము, ధైర్యములను గుణములచే సాటిలేనివాడని చెప్పినట్లయినది.

జననీగర్భమున నున్న యీతనిని గూర్చి రఘునాథాచార్యుడు 'పనధి మేఖలనాడుచు నర్భకుడని' 2-63 పేర్కొనినాడు. ఈతని జననవేళ జనకుడగు దృఢవ్రతునకు పితృలోక తమోనివృత్తియే గాక సర్వలోక తమోనివృత్తియు గాన బడినదట 2-70

'పూవు పుట్టగనే పరిమళించు' నన్నట్లు భాగవతజన శ్రేష్ఠుడగు కులశేఖరుని బాల్యము సామాన్యజనోపమము కాదు.తదనంతరకాలమున ఆళ్వారు గా ప్రఖ్యాతి గాంచిన బాలకులశేఖరుని వర్ణన యాతని భావి కాల వర్తనమునకు బీజప్రాయముగని ర్వహించినాడు రఘూనాథాచార్యుడు రామాయణశ్రవణ సందర్భమున దేశకాలపాత్రములవిస్మరించి

ఖరదూషణాదులపై రావణునిపై రామసహాయార్థము దండెత్తదలచిన కులశేఖరుని యా భక్త్యావేశము - నా పారవశ్యము బాలకులశేఖరుని బాల్యచేష్టలయందే కవి నిక్షేపించియున్నాడు.

చంద్రవంశావతంసమై యన్వర్థనాముడగు కులశేఖరునిబాల్యము పరమభాగవతరేణ్యుడగు ప్రహ్లాదుని బాల్యమును దలపించును.

అక్క, అత్త, యవ్వ యనియెడ పలుకులు పలుకువేళ రామ, రామభద్ర, రఘురామ యను పేరులుచ్చరింప సాగినాడ, నవ్వుటాల కతిపలీబాలకునితో రాముడడవికి పోయినాడనగా దుఃఖించుచుండెడివాడు. సీతాలక్ష్మణులతో దిరిగి వచ్చెననగా సంతోషించెడివాడు. శ్రీరామ కోమలవిగ్రహమును ధ్యానించుచు నిష్టమైన ఫలములను గూడ దిన నిష్టపడడు. ఆతడేవేళనైన మంకుపట్టు పట్టినచో రేపురఘుపతి మన యింటికి వచ్చుననినచో వెంటనే యలుక మానెడివాడు. బాలకుల శేఖరుని సర్వేంద్రియములు విష్ణుసేవోన్ముఖములు.

కులశేఖరాళ్వారు తన "పెరుమాళ్ తిరుమొళి"లో "అనన్యప్రయోజ నత్వమున నన్నుబోలని వారితో నేను చేరను. స్వర్గాదిభోగములు సైతము నాకు తృణప్రాయములు. నిత్యసూరినాథుడగు శ్రీరంగ నాథునందే తీరని పిచ్చిపట్టినవాడనుగా నున్నాను" అని పేర్కొని నాడు.[1] అంతటి భక్తున్మత్తత చిన్నతనముననే భాసించినట్లు రఘు నాథాచార్యుడు పేర్కొనెను.

బాల్యమున సీతని నైసర్గికశ్రీరామచరణకమలభక్తిభావదురీణతను—

శ్రీరామమూర్తి వర్ణించువారల పొందు
వీడకాకొనియున్నవేళనైన
రఘునాథ నామకీర్తనము సల్పెడుపట్టు
వెడలడు నిద్రింయువేళనైన

---

1. పెరుమాళ్ తిరుమొళి 3వ దశకము, 6వ పాశురము.

కాకుత్స్థ వరగుణోత్కర మెన్ని నెడబాయు
జాలడు క్రీడించువేళనైన
జానకీపతి కథాశ్రవణ మబ్బినఁ నొండు
వినడంట పిలిచినవేళనైన
దశరథాత్మజ పాదపద్మ ప్రసక్త
చిత్తవృత్తికి బరదైవ వృత్తరక్తి
సొరగనీదయ్యె మహనీయ సుగుణగణ వి
రాజితుం డైన కేరళరాజసుతుడు[1]

అను పద్యము స్పష్టము చేయుచున్నది.

గురుసన్నిధిలో "అంచితవేదశాస్త్రముఖోర్జిత విద్యానిచయమును" అతులిత సూక్ష్మబుద్ధికౌశలమున నభ్యసించినాడు. "శారీరకశాస్త్రసూత్ర కబరీవరివేష్టిత విష్ణుతత్త్వమందారసుమమ్ము" గైకొన్న "ధన్య విచారుడు" దృఢవ్రతునితో గురువర్యులు కులశేఖరుని గురించి పల్కిన పల్కులలో గులశేఖరుని యోగ్యత—

అనఘ! పురాణ వాగార్థ బోధాయనుం
డాగత వివిధభాషాగురుండు
ప్రకట న్యాయశాస్త్రిక దృక్ప్రరణుండు
చతురాత్మ పౌరుష శబ్దభోగి
విపులాహితైశ్వర్య విక్రమబలభేది
రమ్య ధర్మకళాప్తి రాజమౌళి
ప్రమదామనఃప్రీతి ప్రసవసాయకపాణి
ధృతిసార విహసిత క్షితిధరుండు

---

1. కు.మ.చ, 2-77

చతురగాంభీర్యవాహినీస్వామి వద్మ
వేష్టిత వదర్థుదనుభవ వితరణ స్వ
భావ ఘనుడింక నిన్ని చెప్పంగనేల?
సుజనమాన్యుండు నీ తనూజుండు రాజ![1]

పై ప్రశంసలోని "ప్రమదామనశ్చ్యుతి ప్రసవసాయకసాణి" అను విశేష ణమునకు మాత్రమీతని తదుపరి జీవితమున కాన్పింపదు. "ప్రజాయై గృహమేధినామ్" అను రఘువంశమునందలి కాళిదాసోక్తి కీతనికుటుంబ జీవనము నిదర్శనముగా సాగినది. ఈతని జీవితము భగవద్భాగవత సేవాతత్పరత్వ సంభరితముగా వర్ణింపబడినదే కాని శృంగారప్రసక్తి యెచ్చటను గాన్పింపదు. రఘునాథాచార్య సుకవి యౌచిత్యమును బాలించి కులశేఖరుని పారలౌకిక విషయానురక్తిని వివరించనేకాని యైహిక విషయాసక్తిని మాత్రము వర్ణింపలేదు.

సర్వసంపత్సముపేతమైన సామ్రాజ్యమునకు వల్లభుడయ్యు భోగభాగ్యానుభవమునకు లోటులేకున్నను, ఆ పొంతకుబోక "గౌతమ జైమిని ద్వైపాయన ప్రభృతి ప్రణీత వివిధ తంత్రాంతరాశయారుం తుద మేథాశాలియై"/2-102/ భగవద్భాగవతసేవాభాగ్యానుభవమునే సదా యాశించిన నిరీహుడు కులశేఖరుడు.

"సంతత సత్యదాన గుణశాలి" యగు నీతని యేలుబడిలో రాజ్యము సుభిక్షమై ప్రజలు సుఖశాంతులతో విలసిల్లినారు. రాజైన వెంటనే దిగ్విజయము చేసి సమస్తదేశప్రభువులను నిర్జించి తన కీర్తిని దశదిశల వ్యాపింపజేసిన "భుజబలశాలి".

---

1. కు.మ.చ. 2-88

శ్రీభక్తిసారులను నొక యోగిశేఖరుడు పరతత్త్వవిచారపరుడగు కులశేఖరుని బ్రశంసించుచు బలికిన పలుకులు—

నిను వ్రబాప్రియమున జెన్నొసగు నారాయణ
ద్వయ మంత్రవర్ణసంతతులు గాంచె
చుంచు బెంచిననాడె మంచు ద్రుంచిన వేల్పు
కాలము సామి భజించు నేల వెఱింగె
గరిడి ద్రొక్కినవాడె గర్వాంధపరిపంథి
కంధికి మంథాద్రికరణిదోచె
నటుత జన్మిదమూదినపుడె తొలుపల్కు
కొనలందోచిన తత్త్వమున బెనంగె

గర్జరసనాగ్ర భుజబుద్ధికౌశలములు
వర్ణనీయమ్ములయ్యె నవ్వాలను గాంచి
గాంచుగాకేమి సిరినెదగాంచు విభుని
కంఠరత్నంబు పుట్టువు గాంచు కతన[1]

శ్రీభక్తిసారుల యుపదేశము ననుసరించి శ్రీమద్రామాయణశ్రవణ ప్రవణుడై యుండి పదునాలుగవేల రక్కసులు ఖరదూషణాది పుర స్సరులై శ్రీరామునొక్కనిజేసి యెదిరించిరని విని శ్రీరామునకు దోడు పడుటకై పోవనెంచిన యాతని భవ్యభక్తిపారవశ్య మనన్యశక్యము శ్రీరామాయణ శ్రవణవేళ నీతని పారవశ్యమును—

కౌశికున్ వెంట రాఘవుడు కాల్నడ నేగె
ననుచోట రథిజేతునని తలంచు
భార్గవుం డాగి రాముపై గిన్కనేతెంచె
ననుచోట దానెదుర్కొనదలంచు

1. కు.మ.చ. 2-110

కై కేయి జానకీకాంతు గానలద్రోచె
నను చోట మరలింతు నని తలంచు
దశరథాత్మజుం డద్రితటుల నెక్కదొడంగె
నను చోట దానెత్తికొనదలంచు
నితత కాకుత్థ్సగుకణథామృత రసైక
పానకౌతుక విభ్రాంత భావుడగుట
నమ్మహారాజు తలపు లిట్లగ్గలించు
గాలభేదమ్ము దెలియని కారణమున 1

శ్రీరామాయణ శ్రవణముతోపాటు శ్రీవైష్ణవ సంభాషణాభిలాషియై నిరంతరము వారి సాన్నిధ్యముననే కాలక్షేపము చేయదొడంగినాడు అట్టి శ్రీవైష్ణవులకు మంత్రుల దుర్మంత్రముచే ద్వారపాలకులడ్డగింపగా నీతడత్యంతము క్రుద్ధుడైనాడు. దౌవారికరుద్ధులై ద్వారగతులగు భవ్య మూర్తులగు భాగవతులను జూచి యీతడు—

దాసుని యిలు ద్రొక్కక యే
జేసిన యపరాధ మెఱుగ జెప్పక కరుణా
భాసుర హృదయులు మీరా
యాసం పడదగునె యెండ నలమట దోనన్ 2

అని పలుకరించినతీరు సహృదయుల హృదయముల నార్ద్రము గావించును. ద్వారపాలకులపై నీతనికి గల్గిన క్రోధము శ్రీవైష్ణవుల సాంత్వన వచనములచే గాని చల్లారలేదు.

వీరి జీవితమున సతిముఖ్య ఘట్టము రావణుని పై దండెత్తుట,

1. భ. మ. చ. 3.
2. అదే 3. 40

రామాయణ శ్రవణ సందర్భమున సీతావహరణ వార్తను విని దుష్ట రావణుని దండించి లోకమాత యగు సీతను రక్షించి తెచ్చి శ్రీరామున కప్పగింప వలయుననీ త్వరవడినారు. భగవద్గతమైన వీరి మానసము యుగభేదములను గూడ దాటి శ్రీరామచంద్రుని వైపురకలు వైచినది. వీరశ్వారూఢులై దక్షిణాభిముఖులై యపారపారావారము లోనికి పరుగులు తీసినారు. వీరి యీప్రయత్నము నాపుటకు మంత్రి సామంతుల కెవ్వరికిని సాధ్యము కాకపోవుటచే భక్త పాలనకళా సంరంభుడగు శ్రీమహావిష్ణువు తాను రఘుకులస్వామిగా రమాదేవి వైదేహిగా, శేషాహి సౌమిత్రిగా వీరికి ప్రత్యక్షమై సమాధానపరుప వలసి వచ్చినది.

శ్రీమన్నారాయణుడు స్వయముగ ఎలమి మదీయ భక్తిభర మెల్లను నీవ వహించినాడవు.నీవలన సమస్త భాగవతవర్గము కోర్కులు చెందుచుండు నిర్మలగుణ సంపదన్ భువనమాన్య చరిత్రుడవు అని ప్రశంసించియున్నాడు. 3-56.

కులశేఖరుల భాగవతప్రీతి పెచ్చుపెరిగి సదా వారితోడిదే లోక ముగ నైనది. రాజకార్యముల వైపు తిరిగి చూడకుండిరి. దీనితో మంత్రు లకు "నిజప్రభుప్రియ భాషణాభావము" వలన క్రోధము కలిగినది. రాజ కార్యములు కుంటుపడుచున్నవి. ఇందులకు వారొక తిరుగులేని యుపా యము నాలోచించి శ్రీవైష్ణవులపై చౌర్యము నారోపించినారు. అభ్యంగన సమయమున రాజు తీసియుంచిన యాభరణములను గుప్తము చేయించి యా నేరము శ్రీవైష్ణవస్వాములపై నారోపించినారు

వైష్ణవులపై వచ్చిననిందకు భాగవతగతప్రాణుడగు కులశేఖరుడు సహింప జాలకపోయెను పెరుమాళ్ తిరుమొళిలో భాగవతులను గూర్చి

వారి వట్ల తనకు గల వక్షపాతమును గుతించియు శ్రీరంగనాథుని దివ్య చరణములను దలదాల్చుటకు వలసిన భక్తిలేని పాపులను సైతము జ్జీవింపజేయుటకై తీర్థయాత్రా వ్యాజమునసర్వత్రసంచరించువారును తమ యనుష్ఠానము ద్వారమున నిరవద్య సన్మానమును జూవ సమర్థులును శ్రీరంగేశ్వరుని యందు పరమభక్తి గలవారును నగు భాగవతుల యందే నా మనస్సు జన్మ జన్మము లందు ప్రేమ కలిగి యుండును! అని పేర్కొనిన కులశేఖరుడు శ్రీవైష్ణవులకు సంభవించిన యపనిందా పరిభవముమ సహింపగలడా?

ఏమేమీ! మీ గుణములు
స్వాముల పైద్రోచి వలుకజనునే? దుశ్చిం
తామలిన స్వాంతులు ల
క్ష్మీమహిళారమణు చెంతజేరం గలరే ?[2]

అని పలికి తన యంగు శీయకమును, ఒక భయంకర కాకోదరమును నొక భాండము నందు బెట్టించి యా భాండమున జేయిడి పాము నొక ప్రక్కకు ద్రోచి నిజాంగుళీయకమును వెలుపలకు దీసి యెల్ల జనులకు జూపెను,

ఈ మహాద్భుతసాహస కార్యమునకు మెచ్చి ప్రత్యక్షమై శ్రీరంగనాథుడు.... గుణావనతుడ నీవు సరివత్తురె!దివ్యులు భక్తియుక్తికిన్[3] అని స్వయముగా గులశేఖరుని గుర్తించినాడు. అతని గోరిక దీర్చి నీళను బెం యాడినాడు.

1. పెరుమాళ్ తిరుమొళి ద్వితీయదశకము: 6 వ పాశురము
2. కు.మ.చ. 4_81
1. అదే, 4_95

ఈ చక్రవర్తి యా సకల జగన్నియామక చక్రవర్తికి మామయై కాళ్లు కడిగి కన్యాదానము చేసి ధన్యుడైనాడు. లోకాచార విరుద్ధముగ నల్లునకు నమస్కరించి యాతనితో గదలి కుమార్తెను దీనికొని శ్రీ రంగమునకు బయలుదేరినాడు. తన కుమార్తెను శ్రీదేవి కప్పగించునప్పుడు భగవద్భాగవత సేవాహేవాకముతోపాటీతని హృదయమున జోటు చేసికొనియున్న దుహితృస్నేహము వెల్లడి యగును. తన కుమార్తె యుదాత్తమహాసౌఖ్య భోగదశను స్వయముగ గన్నులార జూచి తిరిగి తన నగరము చేరినాడు.

ఈతని జీవితమున ధ్యేయములు రెండు ఒకటి శ్రీవైష్ణవ సంభావనము, రెండు శ్రీరామాయణ శ్రవణము. ఈరెండినిబరిపూర్ణముగ నిర్వహించి ఆళ్వారులు అను ఘనతను వహించి నిత్యము తన వీట శ్రీరంగయాత్ర చాటింపజేయుచు ముకుంద మాలయను సంస్కృత స్తోత్రమును బుధానందానుకూలముగా రచించి హరిభక్తిరసభరితముగా ద్రావిడ ప్రబంధము నొకటి బ్రకటించి, భాగవతుల కభిలేప్సితముల దీర్చుచు చిరకాలము రాజ్యమేలి కుమారుడగు దృఢవ్రతునకు రాజ్యమప్పగించి నిర్భరచిత్తుడై యుండి విష్ణుసన్నిధికి జేరినాడు.

వీరు రాజ్యభారమును నిర్వహించుచు భక్తిసామ్రాజ్యము నేలినవారు. జనులకు హరిభక్తజనులకు దయ యేలుబడిలో సుఖసంతోషముల సమకూర్చినారు. భోగముల కతిసమీపమున నుండియు విరాగమునే వరించినవారు. నీళాదేవికి దండ్రియై శ్రీరంగనాథునకు మామయై బాంధవ్యము నెరపినవారు.

నీళవేణి శ్రీరంగనాథునితో వీరిని గూర్చి—

సర్వ సర్వం సహాచక్ర నిర్వహణక్రి
యానముద్యత నిజోద్యద్భుజుండు
దీపితకీర్తి కన్యావదన్యాస చి
హ్నాన్విత నిఖల దిగంతరుండు
చటుల కోదండ లస్తక వినిర్గత శరా
సారమోహిత శత్రుసముదయుండు
సతతానుగత భాగవతబృందవందనా
చార సత్కార నిష్ఠాఘనుండు
రమ్యవేదాంత గుంఫితార్థప్రపంచ
పరిచయావాప్త విజ్ఞాన పరిణతుండు
సకల జనపాలనోత్సాహ శక్తిధరుడు
వెలసె గులశేఖరాహ్వయోర్వీ విభుండు ।

అని పలికిన ప్రశంసావాక్యములు ప్రత్యక్షరసత్యములు.

ఇట్లు కులశేఖరుని పాత్ర నుత్యుదాత్తముగా గంభీరముగా భక్తి గంధ గంధిలముగా రఘునాథాచార్యుడు చిత్రించియున్నాడు. విశిష్టాద్వైతమత సంప్రదాయ సిద్ధముగా దన ప్రబంధమున గులశేఖరుని జీవింపజేసినారు.

2. దృఢవ్రతుడు : కేరళ దేశమున గుక్కుటకూట నగరాధిపతి. "బాహుబలప్రతాపసందీపితకీర్తిమూర్తి""విశ్రుతవైభవశాలి", దానవిద్యా పరతంత్రుడు వివిధాశ్రమానుగుణ సంభావ్యప్రజారక్షుడు. ఈతని పాలనలో దేశము సుభిక్షమై 'పిల్లచెఱకీనినట్లుశోభిల్లినది'.

ఈతడు పరమ కారుణ్యమూర్తి. వేట తమకమున నొక హరిణిని

1. కు. మ. చ. 4-40

వెన్నంటి తఱిమియు గడకది కడు బడలి 'చిడిముడి నడలు గడలుకొనగ నడులేవక' తల్లడిల్లుచు బుడమిపై వ్రాలగా నీతనిహృదయము ద్రవింపగా నెంతయు సంతాపము నొందును 'పాపభీతియు గృపారసరసము గీలు కొనగ' నా హరిణిని సేదదీర్చినాడు.

ఆ హరిణి తనపూర్వజన్మ వృత్తాంతమును వివరించి రాజును బలు విధముల బ్రస్తుతించి అనపత్యత యొక్కటే లోపమని పేర్కొని హరిణి రూపము విడిచి యనుజ్ఞబొంది దివమునకు బోయినది.

దృఢవ్రతుడు సచివులతో దనకు గల యనపత్యతయానుకాలతను గుఱించి తెలిపి మిక్కిలి పరితపింపగా నయ్యమాత్యులు వైష్ణవశేష్ఠులకీ విషయము నివేదించి వారనుమతించినట్లు చేయుట మంచిదని పలికిరి రాజు నగరమున కేగి శ్రీమహాభాగవతుల రావించి హరిణీవృత్తాంతమును సాంతముగా వారికి వినిపించి తనకు సంతానభాగ్యము కలుగు నుపాయము తెలుపవేడిరి. ఒక్క సంవత్సరము క్షీరోపహార నియతిలో సతీ సమేతుడవై బ్రహ్మచర్యాను వర్తనుడవై శ్రీహరిని సేవింపుమని భాగవతులాదేశించినారు. వెంటనేయాతడు తదుక్తవిధమున మాధవారాధన కుద్యుక్తుడైనాడు. అనపత్యతను గుఱించి భాగవతులకు విన్నవించు కొనుట వారు పేర్కొనినట్లు ప్రవర్తించుట ఈతని భాగవతభక్తిని వ్యక్తీ కరించు చున్నది.

భార్యాసమేతుడై పరమభక్తి నిష్ఠాగరిష్ఠుడగుచు భగవత్స మారాధన చేయగా నబ్జనాభుడు ప్రత్యక్షమై కౌస్తుభాంశమున నొక పుత్రుడు కలుగునట్లనుగ్రహించును.

'మీవలె మద్విధంబు నిష్కంపితభక్తిచే నెఱుగ గానరుగా నరు లెందు జూచినన్' అని విష్ణుదేవుని పలుకులు [1] దృఢవ్రతుని భగవత్స

1. కు. మ. చ. 2-58

మారాధనావ్రత దృఢత్వమును నిష్కళంకిత భక్తిభావమును స్పష్టపరచుచు నీతని సార్థకనాముని గావించినవి.

విష్ణుప్రసాదమున నొక పుత్రుడుదయింపగా పితృలోక తమోని వృత్తియేగాక సర్వలోక తమోనివృత్తియు గోచరించినదిదృఢవ్రతునకు

కుమారోదయమునకు సంతోషించి యీతడు-అపరిమితములగు దానములు గావించి చంద్రవంశావతంసమై సంభవించిన కుమారునకు సన్వర్థముగ కులశేఖరుడనునామముంచినాడు, కుమారుడు తొకతొక వలుకులతో రఘుతిలక! కమలలోచన! మున్నగు విష్ణునామములుచ్చ రించునపుడు 'ఒకభుజము రెండభుజములుగా' పొంగిపోయెడివాడు. వైది కర్మనిరతుడగు నీతడు కుమారునకు యుక్తకాలమున జాతకర్మనామకర ణాదులగు సంస్కారములు,విద్యాభ్యాసము గావింప జేసినాడు. విద్యా భ్యాసానంతరము కుమారునకు ననన్యకన్యా సాధారణమ్ములగుగుణ సౌందర్య విశేషమ్ములు కలుపు దీపించు నొక్క రాజ పుత్రికం బరిణ యంబుజేసి రాజపీఠమున నభిషిక్తుని చేసి నిర్భరుడై యుండసాగినాడు

ఇట్లు దృఢవ్రతమహారాజు పరాక్రమనిధిగా పాలనాదక్షుడుగా భగవద్భాగవతసేవా వ్రతదీక్షితుడుగా దృఢవ్రతుడుగా వైదికకర్మ కలాప నిరతుడుగా సంపూర్ణమనోరథుడగు ప్రభువుగా చిత్రింపబడినాడు సమవర్తి యగు యముడు హరిణికి హరిణిజన్మ మోక్షమును గురించి చెప్పుచు పావన మూర్తియగు దృఢవ్రతుడు [1] అని యీతని గూర్చి పలికినాడు. కులశేఖరుని గురువులీతనిని పాండురకీర్తి రాజనిధిః ముద్రా రాజరాజోపమః [2] అని సంబోధించి యీతని విశిష్టవ్యక్తిత్వమును

1. కు. మ. చ. 1-125
2. అదే, 2-85

వ్యాక్తీకరించియున్నారు.

హరిణి దృఢవ్రతుని కీర్తించినవిధాన మీతని కీర్తిసౌధమునకు ముంగిలి నిల్పిన మణిదీపిక.

పోషించితివిగదా! పుణ్యతత్త్వజ్ఞాన
పరిణామయుత మహాభాగవతుల
భాషించితివిగదా! బహుధర్మ సంహితా
నిర్ణీత నిరుపమ నీతికథల
భూషించితివిగదా! భూరి కీర్తి మనోజ్ఞ
చంద్రికాస్ఫురణ దిక్ప్రాంగణముల
తోషించితివిగదా! దుష్టరాజకఘోర
కంఠీరవోద్రేక లుంఠనముల
సకల సంపద లందితి జగమునెల్ల
గలయ నేలితి వన్నిట ఘనుడవగుదు
వితతగుణజాల! యో దృఢవ్రతనృపాల![1]

ఇట్టి గుణవిశేషముగల్గి శ్రీరామునిగన్న దశరథుని వలె శ్రీకృష్ణుని గన్న వసుదేవుని వలె గులశేఖరాళ్వారులకు గన్నతండ్రియై కీర్తి గడించిన సుకృతి దృఢవ్రతుడు.

మంత్రి లీతని యగణ్య పుణ్య వర్తనము నిట్లు శ్లాఘించియున్నారు—బ్రహ్మోపవనయనాది బహుకృతుల్ గావించి
తది నీకు సంతతి యగునొ కాదొ
వాపీతటాక నిర్వాహమ్ము ఘటియించి
తది నీకు సంతాన మగునొ కాదొ

1, కు. మ, చ. 1-128

హయమేధముఖ్య ఛవ్యాధ్వరమ్ము లొనర్చి
తది సీకు సంతతియగునొ కాదొ
కాదా సంతాన మా రమాకాంతపద ని
బద్ధ పొంతఃకరణకృత భాగవత స
భా సపర్యాది సోపాసవం క్తి నీకు
సంతతి కొఱంత యెట్లయ్యె జనవరేణ్య![1]

ఈ ప్రశంసవలన దృఢవ్రతుని వైదికధర్మ కర్మతత్త్వము వ్యక్త మగుచున్నది. మూలమున కేవలము కులశేఖరుని గన్నతండ్రిగా బేర్కొనబడిన యీతని పాత్ర కిట్టి సంప్రదాయదీధితులను సంతరించి పెట్టినాడు రఘునాథుడు.

2. మంత్రులు :

ఈ మంత్రులెందరో వీరి పేళ్ళేమియో తెలియదు. కాని వీరి చర్యలు మాత్రము దివ్యసూరిచరితాదులగు సమస్త సంప్రదాయ గ్రంథములందును వర్ణింపబడినవి, ఈ మంత్రుల చరిత్ర కులశేఖరు నకు సంబంధించినంతవరకే యీ గ్రంథములందు బేర్కొనబడినది. రఘునాథాచార్యునిచే మాత్రము కులశేఖరుని తండ్రియగుదృఢవ్రతుని కాలమునుండియు నీ మంత్రుల వర్తనము వర్ణింపబడినది.

మంత్రులు దృఢవ్రతునితో వేటకు వెడలినారు. రాజు హరిణి వెంటనంటి కడుదూరము వెడలగా నాతని వెదకుచు వచ్చి యాతడు చిన్నబోయి 'యవనతవదనుడై' యుండుట చూచి కారణమడిగినారు. రాజు హరిణీ వృత్తాంతమును జెప్పి యది తన యనపత్యదోషమును గుఱించి ప్రస్తావించినదని విచారింపసాగినాడు. మంత్రులాతని

1 కు. మ, చ. 1–153

సోదార్పజూచిరి. వాపీతటాకాది సమస్త సంతానములు గల నీకు బుత్రసంతానము లేకపోయిన కొఱతయేమి యని మంత్రులాతనితో ననిరి. వెంటనే రాజుకు గోపము వచ్చి మంత్రులను నిష్ఠురముగ—

చనియెదరు నీతిపద్ధతి
ననియెద రుచితోక్తిసరణి నత్యాప్తులరై
మనియెదరని యుండితి మీ
ట్లనయులరగు టెన్నడెఱుగము[1] ........

అనిపల్కినాడు. దీనితో మంత్రులు "సభయాంతరంగులై" వెనువెంటనే పద్ధతిని మార్చి మీకు సంతానము పొందుటపై గల యిచ్ఛ యెంతటి దృఢమో తెలిసికొనుట కిట్లంటిమి. మమ్ము వేఱుగా దలచుట మీకు దగునా? అని పలికి శ్రీమహాభాగవతుల నడిగి వారెట్లు చెప్పిన నట్లు చేయుదుమని యుపాయము చెప్పి రాజును నగరమునకు గొనిపోయి నారు. ఈ ఘట్టమున మంత్రులు సమయోచితముగా సమస్యను శ్రీవైష్ణవులవైపునకు మరల్చినారు. అనపత్యదోషనివారణకు నే యుపాయము చెప్పిన రాజేమనునో యని శంకించుకొని యా యుపాయమేదియో శ్రీ మహాభాగవతులే చూచుకొందురను నభిప్రాయముతో వీరిట్లు చేసినట్లు కనుపించుచున్నది.

కులశేఖరుడు రాజైన పిమ్మట మరల మంత్రులవాసక్తివచ్చినది

కులశేఖరుడు శ్రీమద్రామాయణమును వినుచుండగా ఖరదూషణాదులు చతుర్దశసహస్ర వీరభటులతో గూడి రాముని చుట్టుముట్టిన ఘట్టమున గులశేఖరుడు రామునకు సాహాయ్యము జేయుటకు ససైన్యముగా బయలుదేరినాడు. ఆ యాటోపమును జూచి మంత్ర

1. కు. మ. చ. 1‒157

లాశ్చర్యపడినారు. రాజు నీస్థితికి దెచ్చినవారు శ్రీవైష్ణవసాధువులే యని యనుకొని ప్రస్తుతము కల్గిన యాపదను దప్పించుకొనుటకు దగిన యుపాయము నాలోచించి నల్వురను ముందునకు ద్వరగా బంపి రాజుతో రాముడు రాక్షసుల నందరను జంపెనని చెప్పించి తత్కాల యుద్ధప్రస్తావము నాపించినారు. ఈ సందర్భమున మంత్రుల రాజభక్తియు సమయోచిత బుద్ధి వైభవమును వ్యక్తమగుచున్నవి.

కులశేఖరుడెల్ల వేళలయందును శ్రీవైష్ణవులతో గాలక్షేపము చేయుచుండగా రాజకార్యములను చక్కపెట్టుటకు వీలుకలుగనిమంత్రులు దుర్మంత్రము బూని కావలివారిచే వైష్ణవుల నడ్డగింపజేసిరి. రాజు స్వయముగా బాదచారియై భవనము వెలుపలకు వచ్చి ద్వారపాలకు లడ్డగించుటచే నచట బడిగాపులు గాయుచున్న శ్రీవైష్ణవులను జూచి ద్వారపాలకులశిక్షింపబోయెను. వైష్ణవు లడ్డుపడ్డి యాపని నాపివైచిరి, ఇట్లు రాజును శ్రీవైష్ణవులనుండి దూరము చేయుటకై మంత్రుల పన్నుగడ ఫలవంతము కాకపోవుటయే గాక విషమించినదికూడ.

కులశేఖరుడు శ్రీవైష్ణవసన్నిధానముననే నిరంతరము "యోగ్య కాలక్షేపము" చేయుచుండ రాజుయొక్క దృష్టిని రాజకార్యములపైపునకు మరలించుటకు మంత్రులు మరొక యుపాయమును బన్నినారు. వారొక పరిచారికకు లంచమిచ్చి కులశేఖరుని యాభరణముల దీసి దాచబంపి యా నేరమును శ్రీవైష్ణవుల పైకి నెట్టివైచిరి. కాని రాజు వారి మాటలను నమ్మక వారు చోరులు గారని సర్పమున్న భాండమును జేయిపెట్టి నిరూపించినాడు. ఈ సాహసమునకు మంత్రులు భయపడి యాతని పాదములపై బడి క్షమింపవేడుకొనిరి,

ఇట్లు కులశేఖరుని శ్రీవైష్ణవులనుండి దూరము చేయుదమని

మంత్రులు కావించిన ప్రయత్నములు విఫలములైనవి. వీరి ప్రయత్నముల వెనుక నిష్కళంకమగు రాజభక్తితప్ప వేఱొక ద్రోహచింత కాన్పింపదు. కవి నిపుణముగా "నిజప్రభు సంభాషణాభావజనిత క్రోధమ్మగు మంత్రియూధమ్ము"1 అని వీరి ప్రభుప్రీతిని వివరించియున్నాఁడు. రాజాభిప్రాయమునకు విరుద్ధముగ వీరు వైష్ణవులపై చౌర్యము మోపుటయందు గూడ వారిపై ద్వేషముచేతగాక రాజకార్యములయందు రాజు విముఖుడైయున్నాడనియెడు చింతయే ముఖ్యకారణము. మఱి రాజ్యకార్యముల విషయమున రాజుల కర్తవ్యమును జ్ఞప్తికి దెచ్చుటయు మంత్రుల కర్తవ్యమేగదా! ఈ దృష్టితో జూచిన మంత్రుల రాజభక్తి, దేశభక్తి, కర్తవ్యనిష్ఠయు వ్యక్తమగును. మంత్రుల దుర్మంత్రముచే గులశేఖరునకుగల పరమ భాగవత ప్రత్యయము స్పష్టపడుటకు ప్రత్యక్షకారణము కలిగినది.

ఇట్లు మంత్రులు కులశేఖరమహాత్మ్యము వ్యక్తమగుటకు బరోక్ష కారణమైనారు.

4. నీళాదేవి :

విష్ణుపత్నియగు నీళాదేవ్యంశమున గులశేఖర దంపతులకు జన్మించిన పుత్రికనీళ. శ్రీమన్నారాయణుడు శ్రీరంగమున వెలసియుండుటచే నీమె భర్తను విడచియుండజాలక కులశేఖరునకు బుత్రికయై జన్మించినది. చిన్నతనమునుండియు దండ్రికడ బుణ్యకథలు వినుచుండెడిది. యౌవనవతియై సర్వాంగసౌందర్యశోభితయై యున్న సమయమున కొందరు వైష్ణవులు శ్రీరంగక్షేత్రమునుండి కులశేఖరుని కడకు వచ్చి ప్రసంగవశమున శ్రీరంగనాథుని గుణరూపవైభవమును—

---

1. కు. మ. చ. 4-60

విశ్వమున కెల్ల పెనుడు తద్విభవమెన్న
నలవియే యింక నతని కల్యాణగుణము
లజునకైనను గుణుతింప నగానె రూప
మహిమ యూహింప మన్మధమన్మథుండు[1]

అని వర్ణించినారు. ఇది విని నీళాదేవి శ్రీరంగవల్లభునే పెండ్లి యాడ నిశ్చయించు కొనినది. శ్రీరంగనాథునిపై గల్గిన మోహము దిన దినప్రవర్ధమాన మగుటచే విరహవ్యథ పెల్లుబొకాదొడగనది.

ఇంతలో వసంతము రాగా నీళాదేవి రంగనాథునిపై మోహము వలన జరితాపము పొందుచుండగా సఖులామె యలసలు బోగొట్టుటకు నుద్యాన వనమునకు గొనిపోయినారు. అచ్చట నీళకు విరహతాప మతి శయింపగా వెన్నెల మడుగులోబడి తనువు విడువ సంకల్పించుకొనగా నీలవేణియను చెలికత్తె యామె నోదార్చితనకుదండ్రి యిచ్చిన ఖేచర విద్య వలన నాకాశ మార్గమున శ్రీరంగనాథుని కడకుబోయి యాతనికి నీళ యవస్థను వివరించి యాతని కడ నుండి లేఖను గొనివచ్చెను. దానిని చదువుకొని నీళ సంతోషించినది.

కులశేఖరుని భాగవతప్రత్యయమునకు సాహసమునకు వైష్ణవ నిష్ఠకు మెచ్చి శ్రీరంగనాథుడు ప్రత్యక్షమై వరమడుగుమనగా నాతడు తన కుమార్తెయగు నీళను బెండిలిగమ్మని ప్రార్థించెను. అందులకు రంగనాథుడు సమ్మతించి నీళను వివాహమయ్యెను. కులశేఖరుడు స్వయముగ గుమార్తెను వెంటబెట్టుకొని శ్రీరంగనాథుడు తన నగరము నకు జేరి యిందిరా సఖులకు నీళనప్పగించి యామె నిందిర కడకు బంపెను. ఇందిరాదేవి తనకు మ్రొక్కిన నీళను దీవించి కౌగలించుకొని

1. కు.మ.చ. 3-71

క్షేమవార్తలడిగెను. కాని నీళ లజ్జాభయభరమున సమాధానము చెప్పకుండెను. ఇందిర యామెకు పూర్వజన్మమును జ్ఞప్తికి దెచ్చి జంకును బోగొట్టినది.

ఇట్లు నీళ పరమభక్తవరేణ్యుని పుత్రికగా శ్రీరంగనాథ ప్రియసిగా జిత్రింపబడినది. ఈమెను గులశేఖరుడిందిరాదేవి కప్పగించుచు—

గోముగ బెరిగిన యది మది
నేమియు గాపట్యమెఱుగ దెఱుక నొసగినన్
బ్రేమగొను నడుగదెద్దియొ 1

అని యామె మృదుస్వభావమును జక్కగా వివరించియున్నాడు వాణియు శర్వాణియు గీర్వాణాధిపురాణియు నీళను శ్రీరంగనాథునికడకు తీసికొనిపోయి యామెను గూర్చి—

బొంకుటనేర దర్థిజనపోషణతత్పర సత్యధర్మ ని
ష్పంకచరిత్ర వృద్ధగురుభక్తిసమన్విత శీలసత్క్రియా
లంకృత కీర్తిశాలిని విలాస మనోహర తానకైక మో
హాంకుర భిన్నహృన్నళినయై యిటులున్నది రంగవల్లభా![2]

అని పలుకుటలో నీమె గుణగణములు వ్యక్తమగు చున్నవి.

౨. నీలవేణి : ఈమె రఘునాథాచార్యుని నవ్యసృష్టి. సంప్రదాయ గ్రంథము లందెందు నీమె ప్రసక్తియే లేదు. ఈమె నీళాదేవి నెచ్చెలి శ్రీరంగనాథునిపై గల మోహాతిశయముచే విరహవ్యథను బొందుచున్న నీళకు దక్కిన నెచ్చెలులతో శీతలోపచారములు సలిపినది. నీళ విరహ సంతాప భరము సహింపజాలక పన్నీట మడుగులో బడి దేహము

1. కు.మ.చ. 4—212
2. అదే, 4—159

విడుచు ప్రయత్నమును జేయబోవగ జెలులు వారించి యోదార్పు చుండగ 'దుర్వారస్ఫురచ్చంద్రికల్' పై కొన్నవి. వ్యధ యెక్కువయై యామె దుఃఖింపసాగినది ఆమె దుఃఖమును జూడ జాలక యా నీల వేణి రంగనాథు నొద్దకు బోయి నీళా పరిస్థితిని దెలియజేయ బూను కొన్నది. తండ్రి యిచ్చిన ఖేచరవిద్య సాయమున శ్రీరంగమున కేగి నీళా విరహ వ్యథాదోదూయ మానమానసుడై గరుత్మంతునితో దన తాపమును గుఱించి వివరించుచున్న రంగనాథుని జూచి సమీపమున కేగి యాతడాగమన కారణ మడుగగా జతురముగా-

శ్రీనిలయ నీదు సన్నిధి
నేనెంతటిదాన నట్టి దిట్టిది యనగా
నైనను నొక సందేహము
పూని యిటకు వచ్చితిని బ్రఖ్యాతగుణాఢ్యా[1]

అని తానొక సందేహము కలిగి వచ్చితినని పలికి నీళ యందము మును గొంత పేర్కొని చమత్కారముగ-

మఱి కొలది నింతి యవయవప్రతతిబోల్ప
దోచెనివి కొన్ని సదృశవస్తువులు సాటి
మున్న తెలిసిన సర్వజ్ఞమూర్తి వీవె
తింగినను నాకు దెల్పవే రంగనిలయ[2]

అని యాతనినే ప్రశ్నించినది. అతని కోరికపై నీళయందచందముల నెంతయు వర్ణించినది. ఆమె విరహతాపమును గుఱించి తెలిపి.

1. కు.మ.చ. 3-208
2. అదే; 3-21?

వేయేల నీకుదగు చెలి
తోయజముఖి కీవు దగుదు తుల్యాకృతులన్—3-231

అని వినయోచిత వచన రచనలతో బ్రిసంగించినది. రంగనాథుడు సంతోషించి ఏనటకు నేగుదెంచె క్షితితలేంద్ర తనయ జేకొని యెద వేగ చనుము 3-238 అని పలికినాడు. అంతతో నీలవేణి రంగనాథుని వి`వలేదు మా రాకుమార్తెకు సంతోషము కలుగునట్లు శ్రీ రంగనాథుడందులకు సంతోషముతో సమ్మతించి కాంచనకేతకీకుసుమగర్భదళమున' లేఖ వ్రాసి యిచ్చినాడు. నీలవేణి యాకాశగమనమున నీళకడకు తిరిగివచ్చి కాంచితి కాంచనాంబరు 4-7అని మొదలిడి వృత్తాంతమంతయు జెప్పినది. శ్రీముఖ మిమ్మని నీలవేణియే రంగపతి నడిగినది కాని యాతడే స్వయముగ నిచ్చినట్లు నీళతో జెప్పినది. ఱాంగులెవ్వరున్ నీసరిరారటంచుమది నిశ్చయిమేర్పడ జల్కెను4-49అనియు నీళతోజెప్పి యామె నోదార్చినది. నీలవేణి గావించిన మేలునకు సంతోషించి నీళ నీదు ఋణమెట్లు దీర్తునే నీలవేణి 4-55 అనియామెను బొగడి కౌగలించుకొనినది.

ఇట్లు నీలవేణి నీళాదేవిపై నభిమానము కలదిగా ఖేచరవిద్య నెఱిగినజాణగా వ్యవహారదక్షురాలుగా వినయోచిత వచనరచనా నైపుణ్యము గల్గినదిగా నింగితజ్ఞురాలుగా జిత్రింపబడినది,

6. హరిణి : రఘునాథాచార్యుని యపూర్వ విశిష్టకల్పఫలమీ హరిణి ఏతత్కవి పరిణత ప్రజ్ఞాదర్పణమున బ్రతిఫలించిన మనోజ్ఞశిల్పమూర్తి యీ హరిణి.

వేటకు వచ్చిన దృఢవ్రతునిచే వెంబడింపబడి శ్రమ నొందిన యొక లేడి యాతనిచే సేదదీర్పబడి తన పూర్వజన్మ వృత్తాంతమునాతని

కెఱిగించినది. పూర్వజన్మమున నాలేడియొక 'అత్తింటికోడలు' ఈకోడలు పేరుకవి పేర్కొనలేదు. మన మామెను హరిణి యని వ్యవహరింతము.

'హరిణి' కుకురదేశమున లాంగూలపురమున ధర్మజ్ఞుడనెడి యొక విప్రుని "అర్మిలికూతురు". తల్లిదండ్రులీమెను "మన్ననదళుకొత్త కోరినవియెల్ల నిడుచు బెంచినారు. ఈమె గుణరూపములకానందించి తండ్రి - అత్తమామలు, నాడుబిడ్డలు, మఱదులు, సిరినందలు నున్న యొక సంబంధమును వెదకి చంద్రకుడను యువకునకీమె నిచ్చి పరిణయము చేసినారు. కలిగినంతలో ఘనముగ - వస్త్రాభరణ సమున్నతితో నైదు గోవులను, దాసీద్వయమును - నిచ్చి యీమె నత్తవారింటికి బంపినాడు.

ఇతంతవరకీమె జీవితము సుఖవంతము. ఆపై దినదినగండ మైనది. అత్తవారింట నీమె "సాటిపూబోండ్లు" మెచ్చునట్లు పనిపాటులు నిపుణమతితో జేయసాగినది. మామ కోపించునో, మగని మనసు కందునో, మఱదులు కాఱులరతురోయని యొదిగి యొదిగి యుండినది సుకుమార యయ్యును. నలసితి నని యుస్సురస్సురనకుండ పుట్టింట నీవలిదావలనిడకున్నదైనను ఓర్పుతో జెప్పిన పనులన్నియుదీర్చు నీఖిలపదార్థముల ననుభవించిన దైనను బెట్టరుపాయ్యరని తలపకుండ గారాబముగ" బెరిగిన దయ్యును కసరులంబడి క్రక్కసింపకుండ "కోడఱికము" నెఱపినది. ఎంతగా భయభక్తులతో మెలగుచుండిన నీమె "చండిక" యనబడెడి తన యత్తచిత్తము ను మాత్రము రంజింప జేయలేకపోయినది.

అత్త "మెకము" వలె చెలరేగి యామె మగనిమదిని, మఱదుల యాత్మలను, మామ గారి యుల్లమును విఱిచి సివమెత్తజేసినది. ఆడు

బిడ్డలు మొంటే గయ్యాళులు. దానికిదోడుగా నత్త "వత్తాసు" వలుక నొంటికాలిపై నీమె పైకి వత్తురు.

తెలతెలవారుచుండగ లేచి కాలకృత్యములు తీర్చిగృహకృత్యములు ముగించి రుచిగ శుచిగ శాకపాకములు సిద్ధము చేయగా నకారణముగ నత్త గొంతెత్తి యామెను దిట్టును. కూతులామెకు వంతబాడుదురు.

తండ్రి యొసగిన మాణిక్యకటకములు పుచ్చుకొన్నది. అమ్మ పెట్టిన పటుటంటుచీరలు నాల్గు టక్కరి తోడికోడండ్రకిచ్చినది. ముత్తవ దయచేసిన ముత్యాలవట్టెడ పుచ్చుకొని కుమార్తెకు దగిలించినది, అన్న యిచ్చిన పదార్వన్నె యొడ్డాణమ్ము వదలించి చెల్లెలి పైపునకు జేర్చినది. అన్నియునున్న నుగతిలేనిదానివలె నరణపుటావుల నమ్మివేసినది· పరిచారిక లిర్వురకు గూడునీళ్ళిడక వెళ్ళగొట్టినది. ఇల్లు హరిణి పుట్టింటి సొమ్ము వీసమైనను లేకుండజేసినదాయత్త. ఊరక దురాగ్రహముతో గొట్టి తిట్టి బాధించినది. మూడుజాములవేళ ముంగేల నన్నము పెట్టి నాల్గు తిట్టి దీని తిండివలన గుండలోని కూడంతయు నైపోయినదని వీథిజనులు వినగ బల్కెడిది.

ఇవన్నియు హరిణి లోలోనగుములునహించినది. క్రమముగా నామెకు సంసారముపై రోత కల్గినది. అయినను స్వతంత్రించి తన పరిస్థితి జక్కవరచుకొనజూచినది.

తన కష్టములకు మూలహితువు నామె యూహింపంగ తనయత్త గారే ప్రధానకారణమని దోచినది.

అత్తగారి మనస్సున గనికరము పుట్టించుటయే మార్గమను కొన్నది. నెమ్మదిగ సమయమునకై వేచి చూచి యొక సమయమున దగ్గరకుబోయి "నముల్లాన హాసఖాసురముఖి"యై యున్న యామె

యడుగులు తన తొడలపై బెట్టుకొని మెత్త మెత్తగా నొత్తుచు - స్త్రీలకు నత్తమామలే తల్లి తండ్రి దైవము గురుడు. కలలోగూడ వారి కెగ్గు తలపెట్టరాదు. మా తల్లిదండ్రులు మీ కప్పగించినారుగద! మీరు తప్ప నింకెవరున్నారు?తిట్టిన దీవించిన మీదే భారము అనిమంచికొనచేసి జూచి నది. దీనితో నత్తకు గోపము మిన్నుముట్టినది. "ముసముసమని" చూచి "నాకు నీతులు చెప్పుట కెంతదానివని" వసదన్నినది. అంతతో దనివిచెందక "ఇంతింతలు చేతుననుచు" పైకి రాబోయినది. ఆ ప్రాంతమున నున్న కవాటము నిటల తటమున దగిలినది. దీనితో నీ దెబ్బకుగూడ హరిణియే కారణమైపోయినది. మూడు దినములపాటు "కూడు నుదకంబుగొననీక" ఉపవసింపజేసినది.

అంతతోదృప్తి వడలేదు. మూడవనాడు మూర్ఛలోమునిగియున్న హరిణిని బిలిచి మేలిమీగడలున్న పాలుపాత్రలో నుంచి నీ భర్త కిచ్చి రమ్మని పంపి తన కుమార్తెను గాపు పెట్టినది. క్షుత్పిపాసాపర వశయై యున్న హరిణి భర్త కిచ్చులోపల నొక గ్రుక్కెడు పాలు తాను ద్రాగినది. ఇంకనేమున్నది. కాపుగాయుచున్న యాడుబిడ్డవలన నా విషయమునెఱిగిన భర్త యెంగిలిపాలిడిన కులిరాత్మురాలని తిట్టుచుగొట్టుచు నిల్లు వెడలగొట్టినారు.

ఇతఃపూర్వ మత్తచే వెడలగొట్టబడిన పరిచారికలు వెడలియిక్కడి విషయములుచెప్పగా నీమెయున్న దైవగతివలన నా సమయమునకే యక్కడకు వచ్చి పరిస్థితి నర్థము చేసికొని యామెను దనతో దీసికొని పోయినాడు. తల్లిదండ్రులతే చీరగూడు నొసంగి పోషించినారటుమీద కాలాంతరమున నీమెను యమభటులు యమధర్మరాజు కడకు దీసికొనీ వెడలగా ఎంగిలిపాలు భర్త కిచ్చిన "కుత్సిత" యగుటవలన "త్వణా

శనముచే భూమిలో హరిణిగా బుట్టుదుగాక ” యని యాదేశించియు నీమె వ్యథను గుర్తించి “పావనమూర్తి యగు దృఢవ్రతుని కరుణవలన సుగతికిబోయెదవ”ని యనుగ్రహించినాడు.

ఇట్లు తాను జేసిన తప్పునకు దనకు సంభవించిన లేడిజన్మమును గుఱించి దృఢవ్రతునకు “ధర్మసూక్ష్మము నెఱుగుట యెవ్వరి సాధ్యమని ప్రశ్నించినది. దృఢవ్రతుని గుణాధిక్యమును బొగడి యనువత్యత యొక్కటియే యీ కవికి గల కొఱత యని పల్కినది. మృగరూపము విడచి దివ్యగంధమాల్యాంబరాభరణములతో దీపించి దృఢవ్రతునొద్ద సనుజ్ఞ దీసికొని దివముకు బోయినది.

ఇట్లే “ హరిణి ” పాత్ర నిసర్గరమణీయమై యొప్పుచున్నది. హరిణి వివేకము, అత్తింట నామె పడిన కడగండ్లు, యోర్పు, అత్తను బ్రిసన్నురాలి జేసికొనుటకు జేసిన యత్నము, దాని పర్యవసానము నివన్నియు కరుణరసస్ఫోరకములై సహృదయుల హృదయముల ద్రవింపజేయును.

ఆంధ్రసాహిత్యమున వెలసిన స్వాభావిక సౌందర్యశోభితములు స్వతంత్రములు నగు నత్యంత ప్రముఖపాత్రలలో రఘునాథాచార్యులు సృష్టించిన యీ హరిణి పేర్కొనదగినది.

ఇందిరారంగనాథుల పాత్రలనుకూడ యథోచిత సౌందర్యముతో ఉదాత్తత చెడకుండ నత్యంత రమ్యముగా చిత్రించినాడు రఘునాథా చార్యుడు.

ఇట్లు విభిన్నమనస్తత్వములు గల పాత్రల నభిన్నచాతుర్యసంప న్నముగ సజీవములుగా రఘునాథాచార్యుడుచిత్రించినాడు. సామాన్య ముగా నొక ప్రబంధమునందేదో యొక పాత్రయొక్క చిత్రణము

పొకమునబడి లోకమున ఖ్యాతి నొందుట జరుగును. కాని కులశేఖరమ హిపాల చరిత్రమున పాత్రలన్నియు నుత్తమశిల్పిచే జెక్కబడిన దేవ మూర్తులవలె మూర్తిమంతములై స్ఫూర్తిమంతములై రఘునాథా చార్యునకు గీర్తిని సంతరించి పెట్టునవియై యున్నవి.

3. రసపోషణము

రఘునాథాచార్యుడు తనప్రబంధమున భక్తిక గ్రతాంబూలము నొసగినాడు. తాను స్వయముగ శ్రీరామభక్తుడు. శ్రీరాముని యానతి పై పరమభక్తుడగు కులశేఖరాళ్వారు జీవితమును బ్రబంధీకరించి యున్నాడు. ఎడనెడ గథోచితముగా శృంగారహాస్యకరుణాది రసముల బోషించి యున్నను బ్రబంధ మాదినుండి తుదివరకును భక్తిభరితము గావున భక్తిరసప్రధానమని యీప్రబంధమును బేర్కొనవలసియుండును

ఈ భక్తిని మొదట రూపగోస్వామి రసముగా బరిగణించి యున్నాడు. తదనంతర కాలమున భక్తిరసమును సిద్ధాంతపరముగ బ్రతిపాదించినవాడు మధుసూదనసరస్వతి. భగవద్భక్తిరసాయన మీతని గ్రంథము.

మధుసూదన సరస్వతి భక్తికి భగవంతుడాలంబనము. తులసీ చందనాదులుద్దీపన విభావములు. నేత్ర విక్రియాదులనుభావములు నిర్వేదాదులు వ్యభిచారులు. భగవదాకారత స్థాయిభావము. ఈ చిత్త వృత్తియే యనిర్వచనీయానందరూపమగురసముగ బరిణమించును[1] అని భక్తిరస స్వరూపమును వివరించి యున్నాడు.

భక్తిని జ్ఞానమునందంతర్భవింప జేయుట నీతడంగీకరింపలేదు ఆద్రుతచిత్తులకు నిర్వేదపూర్వకమైన తత్త్వజ్ఞానమునుద్రుతచిత్తులగు

1. భగవాన్ పరమానందరూపః స్వయమేవ హి।
మనోగతస్తదాకార రసతామేతి పుష్కలమ్॥
భగవద్భక్తిరసాయనము, 1-10, పు- 18

వారికి భగవత్కథాశ్రవణాదులగు భాగవతధర్మశ్రద్ధలతో గూడిన భక్తియు వారి వారి చిత్తవృత్తులను బట్టి మానవులచే నాశ్రయింప బడుచుండునని యీతడు వాదించినాడు.[1]

ఈతడు దేవాది విషయికమైన రతి రసము కాదనియు నదిభావ మేయనియుజెప్పినవారి వాదమును ఖండించి- దేవాదివిషయిక మనగా నింద్రాది దేవతలకు సంబంధించిన దనియు, నా యింద్రాదిదేవతా విషయిక మైన రతి భావమేకావచ్చును. కాని భగవత్సంబంధ మైన రతినిభావముగా భావింపరాదు. భక్తియే పరిపూర్ణరసము తక్కిన రసములకంటెనీభక్తి రసము బలవత్తరము తక్కిన రసములు ఖద్యోతములు భక్తిరసము సూర్యుని వంటిది[2] అనిసిద్ధాంతీకరించినాడు.

ఈ మధుసూదనసరస్వతి సిద్ధాంతము ననుసరించి కులశేఖర మహీపాల చరిత్రమున ప్రధానరసము భక్తియనిచెప్పకతప్పదు. కుల శేఖరుని జీవిత మాద్యంతము నిరంతర భగవద్విషయిక రతి నిరతము భగవద్భాగవతభక్తి తత్పరత్వముతప్పనీతని జీవితమునఁనితరచింతయే లేదు. బాల్యమున భక్తి పరత్వమును—

---

1. తతశ్చాద్రుతచిత్తస్య నిర్వేదరపూర్వకం తత్త్వజ్ఞానందుతచిత్తస్యతు భగవత్కథా

శ్రవణాదిభాగవతధర్మ శ్రద్ధా పూర్వికా భక్తిరిత్యవధిత్వేనద్వయమప్య పాత్తమ్ భగవద్భక్తిరసాయనము:పు 2

2. రతిర్దేవాదివిషయా వ్యభిచారీ తథోర్జితః।
భావః ప్రోక్తఃరసోనేతి యదుక్తం రసకోవిదైః। ॥ 75
దేవాంతరేషు జీవత్వాత్ పరానందా ప్రకాశనాత్।
తద్యోజ్యం పరమానందరూపో వ పరమాత్మని॥ ॥ 76
పరిపూర్ణరసా క్షుద్రరసేభ్యో భగవద్రతిః।
ఖద్యోతేభ్య ఇవాదిత్య ప్రభేవ బలవత్తరా॥ ॥ 78

అక్కయత్త యవ్వ యనియెడు నామమ్ము
లోలి బలుక నేర్చు వేళలందు
రామ! రామభద్ర! రఘువీర! యనియెడు
పేరులుగ్గడించి పిలువదొడగె[1]

అని రఘునాథాచార్యుడు వివరించియున్నాడు. గ్రంథాంతమున

శ్రీ వైష్ణవ పూజాసం
భావన లేమరక రామభద్రచరిత సే
వావిలసిత హృదయుడై
భూవరుడాళ్వారు లనగ బొలుపవహించెన్[2]

అనియు జెప్పినాడు. ఈ నడుమ నడచిన యాతని జీవితమంతయు భగవద్భాగవత సేవాభావైకహేవాకము. కావున రఘునాథాచార్యకృత కులశేఖర మహీపాల చరిత్రమున ప్రధానరసము భక్తి యని తక్కిన శృంగారాద్యంగరసములనియు జెప్పనవచ్చును.

కాని రూపగోస్వామియు, మధుసూదన సరస్వతియు దక్క దక్కిన యాలంకారికులెవ్వరును భక్తిరసము నంగీకరింపలేదు. ప్రసిద్ధులగు నాలంకారికులెల్లరు భక్తిని భావముగా జెప్పి రసత్వమును నిరాకరించి యున్నారు.

భక్తిరసమగునా? కాదా? యని తొలుత జర్చించి రసముకాదనియు కేవలము భావమే యనియు నిర్ధారించిన వాడు ధనంజయుడు. ఈతడు తన దశరూపకమున ప్రీతి, భక్తి మున్నగునవి భావములు. ఇవి హర్షోత్సాహాదుల యందే యంతర్భవించును, వానిని వేరుగ బరిగణింపపని లేదు[3] అని భక్తికి భావత్వమును జెప్పి రసత్వమును దిరస్కరించి యున్నాడు. అభినవగుప్తుడు భక్తిని శాంతము నందే యంతర్భవింప జేసినాడు. హేమచంద్రుడు భక్తిని దిరస్కరించినాడు. మమ్మటుడు

1. కు.మ.చ. 2-75
2. కు.మ.చ. 4-217
3. ప్రీతిభక్త్యాదయో భావా మృగయాక్షాదయో రసాః।
హర్షోత్సాహాదిషు స్పష్టమన్తర్భావాన్న కీర్తితాః॥ దశరూపకము

దేవాదివిషియక రతిభావమే కొని రసముకాదని తిరస్కరించినాడు[1] ఇట్లు పెలువు రాలంకారికులీ భక్తికి రసత్వమును దిరస్కరించి యున్నారు. కావున భక్తిని భావముగానే యంగీకరించియభినవగుప్తుని మతమున ననుసరించి దానిని శాంతరసము నందంతర్భవింపజేసినచో గులశేఖర మహీపాలచరిత్రముప్రధానరసము శాంత మగును. పూర్వాలంకారికులలో మధుసూదన సరస్వతి యొక్కడు తప్పవెరెవ్వరుభక్తిరసప్రధానకావ్యములనుబేర్కొనియుండ లేదు భక్తి ప్రధానమైనగంథములనుశాంతరస ప్రధానరసములుగా బేర్కొనుటయే వాడుకగానున్నది. కావుననీప్రబంధమునప్రధానరసము శాంత మనుటయేప్రఖ్యాతులగువలువురాలంకారికుల మతమున కనుకూలముగా నుండును.

శాంతము శమము స్థాయిగా గల యుత్తమ ప్రకృతి. నిత్యానిత్య వస్తువిచారాది సాధన చతుష్టయముచే సకలవస్తువులను నిస్సారములుగా దెలిసికొనుట గాని పరమాత్మస్వరూపముగాని దాని కాలంబనము. పుణ్యాశ్రమములు హరిక్షేత్ర తీర్థరమ్య వనాదులు మహాపురుష ప్రసంగాదులు నుద్దీపన విభావములు. రోమాంచాదులను భావములు. నిర్వేదము, హర్షము, స్మరణము మతిభూతదయ మున్నగునవి సంచారి భావములువీనిచే బరిపుష్టమైనచో శాంతమగును. ఇది కుందేందు సుందరచ్ఛాయగలది. దీని కధిదైవము శ్రీ నారాయణుడు.[2]

---

1. రతిర్దేవాది విషయా వ్యభిచారీ తథాంజితః।
   భావః ప్రోక్తః .... ....కావ్యప్రకాశము, 4-35

2. శాంతః శ్శమస్థాయిభావ ఉత్తమ ప్రకృతిర్మతః ॥ 245
   కుందేందు సుందరచ్ఛాయః శ్రీనారాయణదైవతః।
   అనిత్యత్వాదినా శేష వస్తునిస్సారతాతుయా॥ ॥ 246
   పరమాత్మస్వరూపంవా తస్యాలంబన మిష్యతే,
   పుణ్యాశ్రమ హరిక్షేత్ర తీర్థరమ్య వనాదయః॥ ॥ 247
   మహాపురుషసంగాద్యా స్తస్యోద్దీపనరూపిణః॥
   రోమాంచాద్యాశ్చా నుభావా స్తథాస్యుర్వ్యభిచారిణః। ॥ 248
   నిర్వేదహర్షస్మరణమతిభూత దయాదయః।–సాహిత్యదర్పణము

శాంతముయొక్క స్థాయిభావమును గూర్చి యాలంకారికులలో మతభేదములున్నవి. అభినవగుప్తపాదుడు శాంతరసమునకు స్థాయి భావము "ఆత్మజ్ఞానము" అని పేర్కొనినాడు.[1] ఈ శాంతము తత్త్వ జ్ఞానార్థహేతుసంయుక్తము, శ్రేయసోపదిష్టము, సర్వప్రాణిహితము అన్నింటిని మించి మోక్షప్రవర్తకము.

ఇట్టి యీ శాంతరసమీ కులశేఖరమహీపాలచరిత్రమున నామూలాగ్రము సుష్ఠుగా బోషించిపబడినది. తొలుత నీగ్రంథావిర్భావముననే భక్తిప్రమేయమున్నది. ప్రబంధనాయకుడగు కులశేఖరమహీపాలుని జీవితమంతయు మోక్షోన్ముఖము. పరమాత్మస్వరూపమే యాలంబనము, దదితరమంతయు నిస్సారమని యాతని యభిప్రాయము.

కులశేఖరునిలో బాల్యావస్థ నుండియు భగవద్భక్తియు, భాగవత సమారాధనప్రీతియు, భాగవతులతో సతతము గోష్ఠులు నెరప వలయునను కోరిక, నిరంతర శ్రీరంగయాత్రా సమారంభము గోచరించును. వీనికన్నింటికి నాత్మజ్ఞానమే స్థాయిగా నున్నది.

భోగైకనిలయమగు రాజ్యముగాని - రజోగుణప్రవర్ధకమగు ప్రభుత్వముగాని - కడకు మంత్రుల దుర్మంత్రములు కాని కులశేఖర మహీపాలుని యాధ్యాత్మిక సంస్థితికి బారలౌకిక ప్రావణ్యమునకు నవరోధము కాజాలకపోయినవి. విష్ణువరప్రధానఫలముగ దృఢవ్రతునకు జన్మించినది మొదలు కట్టకడపట విష్ణుసన్నిధికి జేరునంతవరకీతని జీవితము భగవద్విషయికాసక్తి భాగవతానురక్తియని వానితో నిండియుండి భక్తిభావం వినా వేఱొకభావమునకాస్పదముకాకయున్నది. భక్తి

1. కావ్యాలంకారసంగ్రహమునకు శ్రీసన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి గారి వివరణ, తృతీయాశ్వాసము, పు. 289

భావమును బలువురు ప్రసిద్ధులగు నాలంకారికులు శాంతరసమునందంత ర్భావింపజేయుటచే నీ ప్రబంధమున ప్రధానరసము శాంతమగును.

తొలుత నీ గ్రంథావిర్భావముననే భక్తిప్రమేయమున్నది. కృతి కర్తయగు రఘునాథాచార్యుని సంకల్పము – "చిరంతన ప్రపన్న చరితంబును గావించి భగవత్సమర్పితంబుచే"యవలయుననియు, లౌకిక వాంఛాసక్తముకాక కేవల కైవల్యదృష్టితో గ్రంథకర్త గ్రంథా రంభము గావింప నెంచియున్నాడు. దానికి దగునట్లు రఘురాముడు ప్రత్యక్షమై కృతికవిత్వమునకు స్వయముగా నుత్సహించుటతో గవి సంకల్పమునకు మఱింత పరమార్థము సిద్ధించినది. కవి యానంద మున మిన్నంది "లోజెక్కిన భక్తికి నర్పణము జేసెద మత్కృతి రామమూర్తికిన్" అని ప్రబంధ ప్రారంభము గావించినాడు ఇట్లే ప్రబంధము భగవంతుని కొఱకు – భాగవత గాథను భక్తుడు భక్తితో వ్రాయుట సంభవించినది.

ఇంక గథాప్రారంభమున గూడ భక్తిభరిత సన్నివేశమున జరిగినది. "ఒక దేశికమణి నిష్పంద ముకుందాంఘ్రి భక్తిభజనాసక్తిని జెంది సికతాతలమ్మున సుందర పద్మాసనైకశోభితుడగుచు" ఉండగా నాతని శిష్యులు సమీపించి "కులశేఖరాభిధానావనిభక్తి సచ్చరితము దాసులకు నానతిండు" అని ప్రార్థించినారు.[1] గురువర్యుడు "పరమ పవిత్రంబగు తచ్చరిత్రంబు" చెప్పదొడగినాడు.

దృఢవ్రతుని మాధవారాధనము దిలీపుని గోసేవావ్రతమును దలపించుచున్నది. భగవత్సాక్షాత్కారము, వరప్రదానము, కులశేఖర జననము, బాల్యము, శ్రీభక్తిసారుల యుపదేశము, రామాయణ కాలక్షేపము, ఇవియన్నియు భక్తిమయ సన్నివేశమున సృష్టించినవి

1. కు.మ.చ. 1–31

మంత్రులు దుర్మంత్రము గావించి శ్రీవైష్ణవులను లోనికిరాకుండ నిరోధించినప్పుడు, వారిపై చౌర్యము మోపినప్పుడును గులశేఖరుడు శ్రీవైష్ణవులపై జూపిన విశ్వాసము, శ్రీవైష్ణవమత సంప్రదాయమున భగవద్దాసులకు గల ప్రాధాన్యమును వెల్లడించునదై యాతని విష్ణు భక్తిని ప్రకటించుచున్నది.

వ్రతదీక్షకు మెచ్చి విష్ణుమూర్తి సాక్షాత్కరింపగా దృఢవ్రతుని ననేక జన్మములందు గావించిన భీషణ దోషములను గృపాణవంక్తులు దేహమునకు సోకకుండ పులకాంకుర పంజరము దాల్చినట్లు దృఢవ్రతుని యొడలు పులకలు పొడమినవి [1] ఇది రోమాంచమను సాత్వికభావము.

అటుపిమ్మట సానందశ్రుబిందుచ్ఛటలు పద్మపురేకులదారుల వెంట లోనికి బ్రవేశించి యందు నిల్చియున్న తుషారవారి వేకువవేళ తుమ్మెదలు చెదరింపంగా దొనుకాడునట్లు శ్రీహరి రాకతో నృపాల చంపతుల కమగ్రేవల గదలాడనవి.[2] ఇది అశ్రువను సాత్వికభావము

గరుత్మంతునిపై శ్రీదేవితో విష్ణువు సాక్షాత్కరింపగా దృఢవ్రత మహారాజు పారవశ్యమున వ్రాల్చిన కన్నుదోయి కదలింపజాలకపోయి వాడు.[3] ఇది స్తంభము.

ఇట్టి స్థితినుండి తేరుకొని యాతడు కావించిన విష్ణుస్తుతే శాంత రసపరిపోషకము. గ్రంథమందంతట నెడనెడ విష్ణు సాక్షాత్కారమ్ము, కులశేఖరమహీపాలుని సంస్తుతులు ప్రబంధమున నవిచ్ఛిన్న శాంతరస ప్రాబల్యమును నిలబెట్టినవి.

1. కు.మ.చ. 2-46
2. అదే. 2-47
3. అదే. 2-48

తృతీయాశ్వాసారంభమున-

ఆ నృపవర్యుడాఘమని యాతనిగైకొనిసద్గుణాన్వితున్
సూనుని యౌవరాజ్య పదశోభితుగా నొనరించి నిర్భరుం
డై నిజబుద్ధికిం గడు ప్రియుంబగు రామకథాసుధారసం
బానుచునుండె కర్ణముల నందొక వైష్ణవముఖ్య సన్నిధిన్ 3-3

అనిపేర్కొని "నిర్భరుండై" అనుప్రయోగముచే గులశేఖరుని మనసున నేర్పడిన అఖిలవస్తునిస్సారతాభావమును సూచించి శాంతరసమునకు ప్రాబల్యమును సమకూర్చినాడు రఘునాథాచార్యుడు. చతుర్థాశ్వాసమున—

శీలగుబోజ్జ్వలుండు కులశేఖర భూపరుడాత్మమంత్రి వా
గ్జాల మనిత్య లౌకికవిచార ఫలంబదియేలనంచు ల
క్ష్మీలలనా మనోహరు విశిష్టకథాశ్రవణమ్ము మోక్షదం
బై లలినొప్పు నట్టిది మహాత్ముల సన్నిధిగాని కల్గనే 4-59

ఇవ్విధంబున మనంబున దలంచి శ్రీవైష్ణవ సన్నిధానంబున నిరంతఋను యోగ్యకాలక్షేపమ్ము సలుపుచుండె - అని వివరించి శాంతరసమున కాలంకారికులు చెప్పిన నిత్యానిత్యవిచారము, పరమాత్మగత హృదయత్వము, మహాపురుష సంగాసక్తియు బ్రబంధనాయకుడగు కులశేఖరమహీపాలుని యందు నిరూపించి శాంతరసమును గవి విపులముగా బోషించియున్నాడు. చతురాశ్వాసమున నీళ నత్తవారింట దిగవిడచి తన పురమునకు వచ్చి—

శ్రీవైష్ణవపూజా నం
భావన లేమఱక రామభద్రచరిత సే
వా విలసితహృదయుండై
భూవరుడాళ్వారు లనగ బాలుపు వహించెన్ 4-217

అనియు, సతతము తన పురమున శ్రీరంగయాత్రకు జాటించుచు, ముకుందమాలను, ద్రావిడప్రబంధమును రచించి శ్రీరామచరితామృతా స్వాదనమును గావించుచు, భాగవతుల నాదరించుచు చిరకాలము భూపాలకము గావించి సప్తాంగమును గుమారుని వశము చేసి నిర్భర చిత్తుడై విష్ణుసన్నిధికి ఒనియెనని వివరించినాడు రఘునాథాచార్యుడు భాగవతాదరము,రామచంద్రానురక్తి, విష్ణుసాయుజ్యము భక్తిమార్గగా మిత్వ నిరూపకములు.

ఇట్టి తత్ప్రబంధ మాపాదచూడమునుబరమభక్తి భావసౌభవిర భాసురమై శాంతరసపోషణాకపూర్ణమై యొప్పుచున్నది.ఇకగథాసందర్భ మును బట్టిశృంగార, హాస్య, కరుణ, రౌద్ర. వీరాదులుశాంతమునకంగ రసములుగా బోషింపబడినవి.

శృంగార రసపోషణము :

ప్రబంధము శాంతరస ప్రధానమైనది, ప్రబంధనాయకుడు ప్రపన్నజనశేఖరుడగు కులశేఖరుడు. నిరంతర భగవద్భాగవత సేవాత త్పరత్వము తప్పనన్య మెఱుగని భక్తాగ్రగణ్యుడు.

ఈతని జీవితమున భక్తిభావమువినా వేఱొక భావమునకు బ్రసే యము లేదు. కావుననీప్రబంధము కేవల శాంతరస ప్రధానమై యుండ వలసి యున్నది.

కాని ప్రబంధనిర్మాణ మర్మజ్ఞుడగు రఘునాథాచార్యుడు కేవల శాంతరసప్రధానముగా నున్న కులశేఖరుని జీవితమును వర్ణించు నీ ప్రబంధమున శృంగార రసమునకు స్థానము కల్పించినాడు. సంప్ర దాయ గ్రంథములందు గులశేఖరునకు నీళ యను నొక పుత్రిక యుండినట్లును, గులశేఖరుడామెను భగవంతునకిచ్చి పరిణయము

గావించి యుండినట్లునుసూక్ష్మముగా బేర్కొనబడినది. నీళారంగవాథుల శృంగారగాథను ప్రబంధోచితముగా బెంచి శృంగారరస రుచిరముగా మలచినాడు రఘునాథాచార్యుడు. కులశేఖరుని భక్తిభావ వర్ణనతో బాఠకులకు విసువు గలుగకుండ నీ శృంగారగాథ నమర్చి ప్రబంధకథా గమనమున నౌత్సుక్యమును బెంచినాడు.

కులశేఖర తనూజయగు నీళాదేవి విష్ణుపత్ని యగు నీళాదేవి యొక్క యంశమున జన్మించినది, కవియామె బాల్యవృత్తాంతమును విడచి బాల్యము నుండి యౌవనము నందడుగిడుట నొక్క పద్యము నందు వివరించినాడు-

నీళాభిధాన యగు న
బ్బాలిక విలసిల్లె ధవళపక్షైందవరే
ఖాలీల బెరిగె నంత వి
శాలంబగు యౌవనావసర మేతెంచెన్ 3-64

అని కథ కావశ్యకము కాని నీళా బల్యమును విడచియామె యౌవనము నిట్లు వర్ణించియున్నాడు—

సంపూర్ణ శశికళాజాలంబు మెచ్చని
ముఖమున కొక వింత పొలుపుదోచె
వికసితేందీవర ప్రకరమ్ము నోడించు
కన్నులకొక వింతకాంతి దనరె
కలహంసకృత మందగమన మెంతనజాలు
నడలయం దొక వింతనలు వెసంగె
శుకపికాలావ నిస్తులమాధురి కెదుర్చు
పలుకుల కొక వింత చెలువు మిగిలె

భ్రమరసందోహ చక్రవాకముల గెలుచు
కచకుచంబుల కొక వింత రచన వొడమె
నరవి నవయవ సౌందర్య సౌష్ఠవంబు
వెలసె నవయౌవనాగమవేళ సతికి 3-65

నీళా సౌందర్యమును బ్రాబంధికమైన శైలిలో శృంగారరసపోష
ణమునకు బూర్వరంగముగ గవి యిట్లు వర్ణించియున్నాడు—

కచము సారంగలోకంబుతో జర్చింప
గమనంబు సారంగగతుల గెలిచె
నయనముల్ జలజబృందముల పై దార్కొన్న
కంఠంబు బలజసంఘముల గెలిచె
గటితటం బొగి రథాంగములతో బురణింప
ఘన కుచంబులు రథాంగముల గెలిచె
రసవదోష్ఠము పద్మరాగంబుల హసింప
కరములు పద్మరాగముల గెలిచె
సువిద రుచిరాంగకంబులం దొకటి
సొంపు రెట్టింప దీపించె సుర నరాంగ
నాసికాయంబునం దిట్టి నవ్యరూప
సంపద నొసంగునే యంచు జనులు పొగడ 3-66

ఇట్లు సర్వాంగశోభిత యైన నీళ తండ్రికడ బుణ్యకథలు వినుచు
బ్రసిద్ధి వహించి యుండినది. అట్లుండ నొకనాడామె తండ్రికడ నుండ
శ్రీరంగమున నుండికొందరు వైష్ణవులు వచ్చి సన్మానితులై శ్రీరంగ
నాథుని గుణరూప వైభవములను గూర్చి కులశేఖరుడడుగగా—

విశ్వమున కెల్లవిభుడు తద్విభవ మెన్న
నలవియే యింక నతని కల్యాణగుణంబు
లజునకైనను గణుతింపనగునె రూప

మఃహింప యూహింప మన్మధమన్మధుండు 3-71
అని వర్ణించినారు. అప్పుడచ్చటనే యున్న నీళ తనకువిభుడు రంగ వల్లభుడే యని నిశ్చయించుకొనినది. అప్పటినుండి రంగవల్లభునియెగ బొడమిన మోహాంకురంబు దినదినప్రవర్ధమానంబగుటయు బెల్లుకొను విరహాశ్రమంబున[1] గుందసాగినది.

ఇకబహుదూరదేశ భాగవతులు శ్రీరంగమున కేగి నీళాదేవి యొక్క గుణగౌరవరూప విలాస కాంతి సౌష్ఠవములు[2] సారెసారెకు ప్రసంగవశమున బేర్కొనగా విని శ్రీరంగనాధుడామెను బరిగ్రహింప గోరియుండి నీళాంగనా పరిష్వంగసముత్సుకాంతరంగడై[3] యుండెను.

ఇట్లుండగా వసంతము వచ్చినది. మాఱులేని మాధవశక్తి విరిసిల్లెడు మధుమాసవాసరములతో బ్రకృతిలోచనాభిరామముగానుండగా నీళ రంగశ్మా వల్లభువలన విరహసంభూతవిచారా విలమానస[4]యైనది ఆమె చెలికత్తెలోదార్చుటకై యామె నుద్యానవనమునకు దీసికొనిపో యినారు. అట వారు వనవిహారము గావించి, కుసుమావచయము చేసి యలసి యుండి యొక సరోవరమును జూచియందు జలక్రీడగావించి నారు. ఇంతలో సూర్యాస్తమయమై చంద్రోదయ మగుటతో నీళకు విర హతాపముమిన్నుముట్టినది. సఖులుశీతలోపచారములు గావించిచంద్ర మన్మధ దక్షిణానిల మరాళచంచరీక శుక కోకిలములను నిందించినారు అంతకంతకు విరహతాపమధికము కాగా నీళ వెన్నెల మడుగున బడి మడియ జూచినది. చెలులామె ప్రయత్నమును సాగనీయలేదు. అప్పుడు నీలవేణియను చెలి రంగనాధుని వద్దకు బయలుదేరినది దౌత్యము నెరపుటకు-

---

1. కు.మ.చ. 3-73
2. అదే, 3-74
3. అదే, 3-78
4. అదే, 3-81

అట రంగనాథుడు నీళావిరహవేదనతో నుండి గరుత్మంతుడు తోడురాగా నద్యానవనమున సంచరించుచు నీళపై దనకుగల ప్రేమను గరుడునకు జెప్పి లక్ష్మీదేవి యేమనుకొనునో యను తన శంకను వెల్లడించెను. గరుత్మంతుడు లక్ష్మీదేవి యంగీకరించునని సమాధాన పరచెను. ఇంతలో నీలవేణి వచ్చి రంగనాథునితో నీళను గూర్చి సంభాషించి యామె సౌందర్యమును ప్రస్తుతించినది.

రంగనాథుడు తనకు నీళపైగల ప్రణయమును వెల్లడించి

ఇంగితజ్ఞురాల! యింక వేయుచెప్పంగ
నేల యేన యటకు నేగుదెంచి
క్షితితలేంద్రతనయ జేకొనియెద వేగ
జనుము చెలియ సంతసమున నెనయ — 3-238

అని యభయము నిచ్చినాడు. కాని నీలవేణి యంతతో నూరకుండక శ్రీముఖపత్రిక నొకదానిని వ్రాసి యిమ్మని యడిగి వ్రాయించి పుచ్చు కొనినది,

నీళారంగనాథుల వివాహము నతి వైభవముగ వర్ణించియున్నాడు రఘునాథాచార్యుడు. వివాహసమయమున వధూవరుల నడుమనున్న తెరను దీసివేసినప్పుడు వధూవరులగు నా నీళారంగనాథుల సామరాగా లోకనములను రఘునాథాచార్యుడత్యద్భుతముగా వర్ణించియున్నాడు. మొత్తము ప్రబంధమునకు "కలికితురాయి" వంటిది పద్యము.

నీళపై గల యనురాగముతో రంగనాథుడును, రంగనాథునిపై గల ప్రణయభక్తులతో నీళయు నొండొరుల జూచుకొనినారు. రంగ నాథుని చూపులు నీళమోముపైబడి క్రమముగా గ్రిందకు దిగినవి. నీళ చూపులు రంగనాథుని పాదములపై వ్రాలి క్రమముగ బైకి బ్రాకినవి.

రంగవల్లభు చూడ్కి రమణీమోమున బెండె
సతిచూడ్కి విభు పదాబ్జమున బెనగె

వరుచూపు బోటి కంధరమున విలసిల్లె
చెలిచూపు హరి యూరువురులందనర్పె
కాంత వీక్షణ మింతి ఘనకుచమ్ముల ప్రాలె
నాతివీక్షణ మీశు నాభి నెసంగె
పతిదృష్టి సఖి నితంబములపై బ్రాపించె
యువతి దృష్టి మురారి యురము బ్రాకె
నాథుని విలోకనములు నాతి యూరు
జాను జంఘాదులకు డిగ్గె జంద్రముఖి వి
లోకనమ్ములు భర్త బాహాకలోల
నయన నిటలావలంనోన్నతికి నెసంగె

వధూవరుల చూపులను వర్ణించుటలో విభిన్నమైన యిరువురి మానసికస్థితులను వ్యంగ్యముగా వరించుటరఘునాథాచార్యునకే చెల్లినది రంగనాథుని యందనురాగము, నీళయందు ప్రణయభక్తులు ముప్పిరింగొనిన దృశ్యమును సాక్షాత్కరించినాడు కవి.

రంగపతి తన్ను జూచిన రమణి మోము
నొంచు నతడొందు జూచిన గాంచు మణుల
హంసములు ఖంజరీ టమ్ములందిడింది
మొనపి దాగురుమూత లాడినవిధముగ[1]

రంగనాథుడు తన్ను జూచినపుడు నీళ తలవంచుకొనును. ఇతడు వేఱొక వైపునకు జూచిన మరల నాతనిని జూచును. ఈ సన్నివేశమును గవి హంసములు కాటుకపిట్టలు దాగుడుమూతలాడినట్లున్నదని సరసముగా వివరించియున్నాడు.

వివాహానంతరము సంభోగశృంగారమును రఘునాథాచార్యుడు పరమోదాత్తముగా – సంప్రదాయబద్ధముగా వర్ణించియున్నాడు.

---

1. కు.మ్మ.చ, 4–142

పారిజాతాపహరణమున సత్యాకృష్ణుల శృంగారమును దిమ్మనార్యుడు వర్ణించినవిధమును శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి గారిట్లు వివరించియున్నారు– "అత్యుత్తమ దేవతా విషయకత్వేన వర్ణ్యమానా రతి రనుచితా తద్వర్ణనం హి మాతాపిత్రో రతి వర్ణన మివ అత్యంత మనుచితమ్" అను మమ్మటార్యునీ సూక్తి చొప్పున శ్రీకృషుడు భగ వంతుడు కావున దత్సంభోగ వర్ణనమును బరిహరించెను అని పేర్కొని యున్నారు.[1]

రఘునాథాచార్యుడీమార్గముననే నీళారంగనాథుల సంభోగ మును యౌచితీశోభితముగా సూచించి విడచినాడు. మరునాటి వేకువ వేళ వడకిట్లు వెడలివచ్చిన నీళను జెలులల్లరిపెట్టజూచినారు. నీళ గంభీరముగా—

అక్కట క్రొత్తకతలు మీ
రిక్కడ సెప్పెదరు వింటి నింతియు సరి యం
దొక్కటియు నేనెఱుంగను
జిక్కులబెట్టంగనేల చేడియలారా![2]

అని చెప్పి తప్పించుకొనజూచినది. కాని యాచేడియ లంతతోవిడువక

ఏమియు నెఱుంగ ననుచు నీవిపుడు మమ్ము
చిక్కుపఱిచెదు పరులేల జిక్కుగొనియె
కుచతటుల నెలవంకలగుంపు మోవి
కెంపులివి యేమి తెల్పవే కీరవేణి![3]

1. మనుచరిత్రము – వెంకటరామ గ్రంథమాల, వెంకట్రామ అండ్ కో., 1968, పీఠిక, పు. 88
2. కు.మ.చ. 4–175
3. అదే, 4–177

అని సాభిప్రాయముగా నామె నెక్కసములాడినారని కవి సరస ముగా వా శృంగారఘట్టము ముగించినాడు.

నిగ్రహముతో శాంతప్రధానమగు కుశశేఖరమహీపాలచరిత్రమున శృంగారమును బోషించి భక్తిభావమునకు బట్టముకట్టి ప్రబంధమును నందచందములతో రసానందకందముగా గావించినాడు కవి.

హాస్యరస పోషణము :

రఘునాథాచార్యుడు భక్తిభావగంధిలమై శాంతరసనిష్యంది యగు నీ ప్రబంధమున నతిమాత్రముగ హాస్యరసమును బోషించి యాంధ్ర సారస్వతమున గ్వాచిత్కముగ నున్న హాస్యరసమునకు బరిపుష్టినిగల్గించినాడు. ద్వితీయాశ్వాసమున రామాయణకథా సందర్భ మున రావణునిచే దరుమబడిన దేవతలు బ్రహ్మతో దమ పాట్లు చెప్పు కొనబోయిరి. బ్రహ్మ వారల యాగమన హేతువు నడుగగా నింద్రుడు—

ఇంటిముంగిట నుండనీ కెగచి యెగచి
యసూరబూతంబు వెనువెంట నంటి తఱుమ
వచ్చుటయ గాని వానితో వైరమెత్తి
పోరొనర్పంగ దరమె యెవ్వారికైన[1]

అని రావణునిపట్ల దమకు గల భయమును వివరించినట్టున "అసూర బూతంబు" "ఇంటిముందట నుండనీ కెగచి యెగచి" "వెంటనంటి" అనువానిని జదువునప్పుడు ఇంద్రునిపై జాలితో బాటు రఘునాథాచార్యుని రచనా వైదగ్ధ్యముచే సున్నితమగు హాస్యము పొడకట్టి మనసున

---

1. కు.మ.చ. 2.158

గిలిగింతలు పెట్టుచున్నట్లున్నది.

రావణు సెద్దుతో బోల్చి - బ్రహ్మ యొసంగిన వరములా యెద్దు కొమ్ములకు బదును పెట్టుటగా బేర్కొని యింద్రుడు బ్రహ్మదేవుని "సెవ పెట్టుచు" పలికిన పలుకులు—

పెను పేర్మిట్ల గిబ్బకొమ్ముల
కొనలకు బదనిచ్చి విడుచు కొమరున మీరా
దనుజులకు వరము లొసగిన
గినిసి యతని దొడర వశమె! గీర్వాణులకున్[1]

అసుఁ డెడ సున్నితమగు హాస్యస్ఫూర్తి సహృదయుల రంజిల్లజేయు నదిగా నున్నది. మఱింత చమత్కారముగా శ్రీమన్నారాయణునితో దనపాట్లు వివరించు—

వీరు వినుడు నను బిల్చున్
వీరుడు రక్కసుడు మేషవృషణ, యహల్యా
జార యనుచును నింద్రసునా
వీరాఖ్యల నుడుప దపహసించుచు సభలన్[2]

అని యింద్రునిచే జెప్పించినాడు రఘునాథాచార్యుడు. ఇంద్రునకు ఇంద్రుడు, సునాసీరుడు మున్నగు చక్కని పేళ్ళుండగ వానిని విడిచి సభలలో దేవతలందరు వినుచుండగ – మేషవృషణ, అహల్యాజార అను పేళ్ళతో బిల్చుచుండునంట. ఈ నామము లింద్రునకవమాన హేతువులు నపకీర్తి కారణములునగునవి. "వీరు వినుడు" అనుటలో "మగడు కొట్టినందులకుగాదు తోడికోడలు నవ్వినందులకు" అను సామెతలోవలె రావణుడనినందులకంటె సందరిముందర నన్నందులకు

1. కు.మ.చ. 2_136
2. అదే, 2_160

బాధపడినాడట. యింద్రుడు "వీరుడు రక్కసుడు" అనుటలో జేయున దేమియులేదు" అనివ్యంగ్యము. ఆ ఘట్టముననే శ్రీమన్నారాయణునితో నింద్రుడు—

అమృతముద్రావుదురమరులు సుఖులని యందురు పామరు
లౌటజుమీ!
విహిత నిశాచర వీరశిలీముఖవిక్షపితాంగతులై ఓబంధుల్
నెనుకుదు రద్రిగుహా గహనోదర నిర్వ్యథనాంతరముల్ గతిగా
గమలవిలోచన! విబుధవిపర్యయ కార్యమువారమె దేవరకన్[1]

అని వాపోయినాడు. దేవతలు సుఖముగా నుందురు. అమృతము ద్రావుదురు – అని పామరులగు ప్రజలనుకొనుటయే గాని శత్రువులగు రాక్షసులచే శిక్షింపబడి కొండగుహలు, నటవీప్రాంతములు వెదకుకొనుట తోనే సరిపోవుచున్నదనునెడ చక్కని హాస్యము తొణికిసలాడుచున్నది.

అట్లే నీళను వెంటబెట్టుకొని రంగనాథుడు శ్రీరంగమునకు వచ్చి మొదట నిందిరాసఖులచే నీళను శ్రీదేవి కడకు ఒంపి యూ వెనుక నెమ్మదిగ దాను నామెను జూడవచ్చును. అప్పుడా శ్రీదేవి లేని యలుకను నటించుచు హాస్యపూరితముగా—

ఈసారి పెండ్లికూతురు
నేసీమం దెచ్చికొనగ నిచ్చదలచితో!
ఆసపడి మాననగునే
వేసరకుండి క్రొత్తచెలుల వెదకెడు పనికిన్[2]

అని పలుకగా శ్రీహరి "శ్రీదేవి! నేను గ్రొత్తక్రొత్త వధూమణులను దీసికొని వచ్చుట నీసపర్యలకేగాని వేఱుగా దలపవలదు" అనినాడు.

---

1. కు.మ.చ. 2_163
2. అదే, 4_204

కాని శ్రీదేవి యామాటల విశ్వసించునా? భర్త మోములోనికి సూటిగా జూచి —

.... ....
.... .... ధర్మాత్ములు మీ
రెవ్వటికి మాయ లెఱుగరు
చెప్పకుండిక మేలివనులు చేసెద రెలమిన్!

అని యెత్తిపొడిచినది. ఇందు ధర్మాత్ములు, మేలిపనులు, మాయలెఱుగరు అను మాటలు వ్యంగార్థబోధకములై యున్నవి. ఇంకను లక్ష్మీదేవి

కుంఠిత వైరి! మున్ను నినుగూడి చరించెడి వేళలందు వై
కుంఠములోన వేళ యనుకూల నఖీత్వమెనర్చె గాన యు
త్కంఠజనించె నింక నొరు కన్నియ దెచ్చెదవేని దాని నో
లుంతము లాడి రంగపురిలో వెడలింతుజుమీ! జగత్పతీ![2]

అని ఖండితముగా బల్కినది. నాకు నచ్చిన వ్యక్తి కావున నీశను దెచ్చిన సహించితిని. వేఱొకరు దెచ్చినచో శ్రీరంగము నుండి వెడలగొట్టెదను అని కుంఠిత వైరి, జగత్పతి యను రెండు సంబోధనలు వాడినది. నీవు శత్రువుల గెల్చినవాడవు, జగత్తున కంతకు బతివి కావచ్చును. కాని నేను చేయదలచినది మాత్రము చేసితీరెదను అను నర్థము వచ్చును జమత్కారావహమై యొప్పుచున్నవి.

ఇట్లు లక్ష్మీదేవి విష్ణుమూర్తుల సల్లాపములు హాస్యగర్భితములై యున్నవి. కవి శాంతరసప్రధానమైన ప్రబంధమున నెడనెడ నాట విడుపువలె నీ హాస్యరసము నాహ్లాదకరితముగా బోషించియున్నాడు. ఆంధ్రసాహిత్యమున బ్రబంధములలో హాస్యము తక్కువగా నున్నదను

1. కు.మ.చ. 4-203
2. అదే, 4-207

లోటును రఘునాథుడు తన ప్రబంధమున దీర్చియున్నాడు.

కరుణరసపోషణము – హరిణీ వృత్తాంతము :

ఆంధ్రసాహిత్యరసాకాశమున హరిణీ వృత్తాంతము ధ్రువతార. నిసర్గ సన్నివేశములతో సర్వజనులకు నిత్యానుభవసిద్ధములైన సంఘటనలతో హృదయమును గరిగించినట్టి కరుణరసప్రధానమైనది హరిణి వృత్తాంతము.

వీరరసస్ఫూర్తితో వేట తమకమున నున్న దృఢవ్రతుడొకలేడిని వెంబడించినాడు. అది బెదరి చెదరిన చిత్తమున బరుగిడి వివశయై వడిపోయినపుడు రఘునాథాచార్యుడు గావించిన వర్ణన—

కదువడి జలియించు కన్నుల కొలకుల
 నుడుకు జలమ్ముల విడుచు దాని
వెఱయూది యంగముల్ విరవిరవోవంగ
 నగ్గలమ్ముగ వడుకొడుదాని
ప్రాణముల్ చంచలభావమందగ నోట
 గళగళ నురువులు గట్టుదాని
మార్మెడ యిడుచు నుమ్మలికంబు దోవంగ
 నొయ్యన గుట్టూర్పు లార్చుదాని[1]

రూపము కరుణరసోత్సేకమున నెవ్వరి హృదయమును గలింపకుండును

హరిణి తన పూర్వజన్మ వృత్తాంతమును వినిపించినది. అది మఱింత కరుణరససమంచితము. హరిణిపూర్వజన్మమున నొక“అత్తింటి కోడలు” అత్తగారును, ఆడుబిడ్డలును వివిధ విధములుగా వేధింప బ్రతుకునకు రోసిపోయినది.

అత్త పెట్టు నారడి నెంత కరుణరస సమగ్రముగా సహజముగా రఘునాథాచార్యుడా హరిణిచే జెప్పించినాడో!

1. కు.మ.చ, 1.83

ప్రాణతదమ్ముగా బాకముసేయ ము
బ్బోకల కూడంచు ముట్టియాడు
గృహకృత్యముల నెచరింప డగ్గటి యింత
వడకంచు నడుసెత్తి యడచిపోవు
పని చెప్పి పనిచి చయ్యన మగవారితో
నింట నిల్వదటంచు నెచ్చరించు
ముందట జనగ బిఱుంద దావచ్చుచు
మోము నిట్టటుద్రిప్పిమూతి విఱచు
మెకము వలె నిట్లు రేగి నామీద మగని
మదిని మఱదుల యాత్మల మామగారి
యుల్లమున శివమెత్తినట్లుగ్రక్రోవ
బుద్ధి పుట్టించె నేమి సెవ్వాదు నరేంద్ర![1]

ఇట్లెన్నోపాట్లు భరింపగా—

మూడుజాములరుగ ముంగేల నన్నమ్ము
వెట్టిననుచు నాల్గుదిట్టి దీని
తిండివలన సమసెగుంద కూడంతయు
ననుచు వీథిజనులు వినగనాడు[2]

ఇట్టి జీవితము దుర్భరమైన వగపెల్లుబికి సంసారము దెస రోత పుట్టినది హరిటికి. అప్పటి యామె మనోభావములను రఘునాథా చార్యుడు వెల్లడించినతీరు—

తొడబడి కన్నవారొసగు తొఢ్ఢుల నమ్మిరొకించుకైన న
న్నడుగక సొమ్ముబుచ్చుకొని రన్నము నీళులు వేళవట్టునం

1. కు.మ్మ.చ. 1-100
2. అదే, 1-101

దిడక యదల్చి యూడిగపుటింతుల నిల్వెడలంగద్రోచి కీ
నడపడి వీరికిందగియె నాయముగాదని చూడరక్కటా! [1]

ఇట్టి యిడుమలలో బడియుండి బుద్ధిమంతురాలు గావున దన కష్టముల నుండి విముక్తి బొందు నుపాయము నాలోచించి యత్తగారిని మంచి చేసికొనజూచి యామె సంతోషముతో నున్న వేళ కనిపెట్టి నెమ్మదిగా దగ్గరకుబోయి యిట్లు పలికినది—

పెంచిన తల్లిదండ్రులరసేయక మీపదసేవకై సమ
ర్పించిరి నన్ను మీకు బెదిరింప దలంచిన నాదరించినన్
మంచిదకాక యన్యులిక మాకెవరమ్మ మదిందలంచి మీ
వంచజరించుదాన దయపాయగ నేమిటికమ్మ! నాయెడన్[2]

ఇట్లతిదీనముగా వేడుకొనగా దయ గలుగుటకు మారుగా నా యత్తకు గనలెత్తినదట. కోడలును రోషమున బడదన్ని యంతటితో దృప్తిపడక నన్నింతకు చేతుననుచు పైపైకి రాబోయినది. అసందడిలో నా ప్రక్కనున్న కవాటము నిటలమునకు దగిలి రక్తము కారగా నదియును హరిణి దోషమే యైనది. కోపముతో మూడుదినములు కూడు నుదకంబు గొననీక యుపవసింపజేసినదట. అట్లుపవసించి యుండి భర్తకిమ్మని యిచ్చిన పాలలో నొక గుక్కెడు పాలు త్రాగినందులకు హరిణి భర్త యుగ్రుడై—

— — — —

ఇది కుటిలాత్మురాలకట! యెంగిలిపాలిడెనంచు నెమ్మదిన్

1. కు.మ.చ. 1.107
2. అదే, 1-112

ఇొదిలిన రోషవేగమున బోరున దిట్టుచు నన్నుడాసి యీ
యదమున వెళ్లదోసితునని యుద్ధమరేయి సత్ప్రచండతన్[1]
చేతులు మాటిడుకొనుచు భ
యాతురత వడంకు నన్ను నడిచి గృహబహి
ర్భూతంగా జేసిన మతి
కొతరనై తల్లడిల్లగా నవ్వేళన్[2]

ఇట్లిల్లు వెడలగొట్టినప్పటిహరిణినిస్సహాయత్వము-మగని ముష్క రత్వముతో గూడిన నిష్కరుణత్వము-అత్తకర్కశత్వము మనలజుట్టు ముట్టి యీ కరుణరసనిర్భరదృశ్యము మన మనఃఫలకములపై చెరగక ముద్రవైచుకొనజేసినాడు రఘునాథాచార్యుడు. ఈ హరిణపూర్వజన్మ వృత్తాంతము రాతి గుండె గలవారిని సహితము కదలించి వేయగల రీతిలో మానవనైజమునకు సన్నిహితముగా చిత్రింపబడి యాంధ్ర సాహితీ లోకమున గరుణరసవద్ఘట్టములలో దలమానికమై యొప్పు చున్నది.

రౌద్రరసపోషణము :

కులశేఖరుడు వైష్ణవముఖ్యుని సన్నిధిలో రామాయణమునువిను ందర్భముననాయీ ఘట్టములలో రౌద్రరసము గంభీరముగాపోషింప బడినది. ఖరదూషణాదులను రాముడు వధించుఘట్టమును వినునప్పుడు కులశేఖరుడు రాము నొక్కనిజేసి ఖరదూషణాదులు పదునాలుగు వేల ్ంది ముట్టడించిరని విని రామసహాయార్థము రాక్షసులపై దండెత్త

1. కు.మ.చ. I-119
2. అదే, I-120

దలచినప్పుడాతని రౌద్రరసోద్రేక సంరంభమును గపి యిట్లువర్ణించి నాడు—

చండక్రోధరసజ్వలజ్జ్వలన చంచద్విస్ఫులింగమ్ములొం
డొండన్ గన్గవక్రేవలన్వేడల నత్యుగ్రాకృతిం దాల్చి మా
ర్తాండ ప్రక్రియమన్న రాజుగమునంతన్ మంత్రి సామంత లా
దండన్ నిల్వగజాలరైరి భయచింతావిస్మయభ్రాంతులై[1]

సీతాపహరణవార్త విని కోపించి రావణునిపై దండెత్తిపోవుచున్న కుల శేఖరుని సంరంభము—

తురగ క్రూరఖురాగ్రదూత ధరణీధూళిచ్ఛటల్ క్రమ్మి ది
క్కరి గండోదిత దానబిందుచయ మింకల్ జండబాహావిని
ష్ఠుర కౌక్షేయక ఘోరదీప్తిమద నిష్ఠ్యూతాహిత వ్రాత దు
స్తర గర్వాంధతమం బడంగ నృపరత్నం బేగె నుగ్రాకృతిన్[2]

వీరరసపోషణము :

ప్రథమాశ్వాసమున దృఢవ్రతుని వేట సందర్భమున వీరరసము చక్కగా బోషింపబడినది—

వడి బన్నిదముజేసి పొడవైన పొదరిండ్ల
దొడరి యావల బడ దుముకువారు
రంపటిల్లెడు మల్లరంపు గిత్తలవోలె
నెడ నెడ వడి బొబ్బలిడెడివారు

1. కు.మ్మ.చ, 3-9
2. అదే, 3-5

వడపోఁ(ళ్లు వెట్టిన వెడద పెండొడలపై
సారెసారెకు మల్ల సఱచువారు
పటుతరాయుధము లిట్టటు ద్రిప్పికొనుచు జే
ర్పాడి లక్ష్యమ్ములఁ వైచువారు
నగుచు వనచరభటులు సాహసికవృత్తి
గ్రామ్యబలముల నృపవరు గడిచి కలిసి
శరభశార్దూల సింహకాసరము లాది
యగు మృగమ్ములఁ బడవైచి రలవు మెఱసి

ఈ సందర్భముననే దృఢవ్రతుని వీరరసస్ఫోరకమైన వర్తన మును గవియిట్లు వర్ణించియున్నాడు—

జగదీకరాత్మీయ సైన్యంబు లిట్లా
మృగస్తోమమున్ దున్మి మెప్పించువేళన్
మొగమ్మందు నుత్సాహమున్ బొంపుదోడై
తగన్ ఘోటమున్ గాలదాటించె లీలన్

ఇచ్చట వీరరసపోషణమున భుజంగప్రయాత వృత్తమును వాడి కవి చమత్కారము గావించియున్నాడు. ఇట్లు సందర్భోచితముగా నుత్సాహవంతముగా వీరరసమును గవి నిర్వహించి యున్నాడు.

భయానకరసపోషణము :

దృఢవ్రతునిచే వెంబడింపబడిన మృగమును వర్ణించు సందర్భమున నిపుణముగా భయానకరసము పోషింపబడినది.

తురగరింఖోద్ధూత ధరణీపరాగమ్ము
కనుదోయి గ్రమ్మిన గలగి కలగి
వటు హయాంఘ్రిన్యాన భయదారభటుల పెర్మి

సుడియు విభ్రాంతిచే సొరిగి సొరిగి
సంక్షుబ్ధవక్త్ర సంచారశ్రమంబున
నొడలు కంపింపంగ నొదిగి యొదిగి
యెడనెడ నృపుడొనర్చెడు సింహరవముల
వెడవెడ నరచుచు నడలి యడలి
కొంత దూరమరిగి యంతట జిడిముడి
నడలు గడలుకొనగ నడువలేక
యొక్క సరసిచెంత నుర్వీశు డీక్షింప
హరిణి తల్లడిలుచు నవని వ్రాలె[1]

ఈ పద్యమున దృఢవ్రతునిచే తరుమబడుచు ప్రాణభీతిచే గతి వరము చెందు మృగము యొక్క స్థితి భయానకరస నిర్భరముగా వర్ణింపబడినది.

అద్భుతరసపోషణము :

లోకోత్తరమగు శ్రీమన్మహావిష్ణుని సర్వమంగళ దివ్యస్వరూప మును బలుతావులలో నీతడు పరమాద్భుతరసభాసరముగా వర్ణించి యున్నాడు. రఘునాథాచార్యుడు గావించిన విష్ణుసాక్షాత్కారవర్ణన ములో నొకదాని నుదాహరింతును.

తమకు రావణుని వలన గలుగుచున్న కడగండ్లను నివేదించు కొనుటకు వచ్చియున్న దేవతలకు దర్శన మిచ్చిన విష్ణు మూర్తి వర్ణనము—

మొలకలెత్తెడు నవ్వుముఖ సుధాకరునిపై
నవచంద్రికా సమున్నతి నెసంగు

1. కుమ్మచ, 1–81

వమకొన్న కరుణారసమ్ము కన్గమ్ముల
మకరంద బిందుసంపదవహింప
పొలుపొందు కలుములబోటి వక్షః పీఠి
తగు రత్నవిధమ్ము దాల్ప
విలసిల్లు దరచక్రములు భుజోదయ శృంగ
ముల క్రేవ జంద్రార్కకలన బెనుప
లలితపీతాంబరము గాత్రజలధరమున
మించు క్రొమ్మించు తెఱగున మెఱుపులీన
చటుల ఖగరాజ వక్షఘోపము లెసంగ
శౌరి విచ్చేసె నిర్జరేశ్వరుల కడకు[1]

ఇట్లు శాంతరసప్రధానముగా దక్కినరసము లంగములుగాసమర్థ వంతముగా బోషింపబడినవి. ముఖ్యముగా గరుణరసము హాస్యరసము సాటిలేనివిగా బోషింపబడినవి.

తక్కినరసములత్యంత యౌచిత్యశోభితములుగా బోషింపబడి ప్రధాన రసమగు శాంతమున కవరోధము లేకుండుటయేగాక తత్పరి పుష్టికిసహకరించుచుగావ్యప్రశస్తికి దోహదముచేసినవి. కేవలభక్తిభావ భరితమగుశాంతరస ప్రబంధములలోనగ్రశ్రేణిలో శ్రీరఘునాథాచార్య కృత కులశేఖరమహీపాల చరిత్రమును బేర్కొనవలసి యుండును.

4. వర్ణనలు

వర్ణనాధిక్యము ప్రబంధలక్షణములలో నొక్కటి. ఆంధ్ర సాహిత్య రంగమున బురాణయుగమున గథకే ప్రాధాన్యము. అటు పిమ్మట వెలసిన కావ్యయుగమున వర్ణనలకు బ్రాధాన్యము హెచ్చినది. ప్రబంధ

---

1. కు.మ.చ. 2-138

యుగమున వర్ణనలగాశ్రిసనాధిపత్యము నొ౦గినవి.

మహాకావ్యమున నష్టాదశ వర్ణనలుండవలయునని యాలంకారికులసూక్తి ప్రబంధమున గూడ నీ యష్టాదశ వర్ణనలుండవలయునని చెప్పబడుచున్నది.

ప్రాచీనాలంకారికుడగు దండి కావ్యాదర్శమందు నగరార్ణవాదులగు పదునెనిమిది వర్ణనలుండవలయునని పేర్కొనినాడు. అప్పకవి యిరువది రెండనియు, సాహిత్యదర్పణకారుడిరువదినాల్గనియు, నటు పిమ్మట మఱి కొన్నింటిని గలిపి యలంకారశేఖరమున ముప్పది రెండు వర్ణనలుండవలయునని శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి గారు పేర్కొనినారు.[1]

రఘునాథాచార్యుడు తన ప్రబంధమున గథాప్రాబల్యము తగ్గకుండబలువిధములగు వర్ణనలనుగన్నులకుగట్టినట్లు కావించియున్నాడు వాసియేకాని రాశి ప్రధానముకాదను జనవాక్యము ననుసరించి చూసి నొక కవి యెన్ని వర్ణనలు చేసినాడన్నది ముఖ్యము కాదు. ఎంత రమ్యముగా నెంతయుచితముగా నెంతగా గథతో బొత్తుకల్గియున్నట్లు చేసినాడన్నదే పరిశీలింపదగిన యంశము.

ఈ దృష్టితో బరిశీలించినప్పుడు రఘునాథాచార్యుడీవర్ణనల విషయమున నత్యంత నిష్ణాతుడనియునుచితజ్ఞుడనియుజెప్పకతప్పదు కథాగతికి నిరోధము లేకుండ, రసపుష్టికి విరోధము రాకుండ సంక్షిప్తముగా నీతడు వర్ణనలగావించియున్నాడు.

కావింపబడిన వర్ణనలు :

అష్టాదశ వర్ణనలుగా నాలంకారికులచే బేర్కొనబడినవానిలో రఘునాథాచార్యుడు కావించిన వర్ణనలు—

---

1. మనుచరిత్ర వ్యాఖ్యానము ; వెంకట్రామ గ్రంథమాల, వెంకట్రామ అండ్ కో, 1968, పు. 14

1. నగరము 1_39_57
2. అర్ణవము 2_210
3. శైలము 2_203
4. ఋతువు 3-77_79
5. చంద్రోదయము 3.123_25
6. సూర్యోదయము 4_179
7. ఉద్యానము 3.90_103
8. సలిలక్రీడ 3. 106_113
9. రతోత్సవము 4.162_68
10. విప్రలంభము 3.81.4_59
11. వివాహము 4.102_151
12. కుమారోదయము 2.68_70
13. మంత్రము 4.60_62
14. ప్రయాణము 4.189_1921
15. ఆజి. 2.231_38
16. నాయకాభ్యుదయము 2.89.101

ఇతరములగు వర్ణనములు :

1. లేడి 1_83
2. విష్ణువర్ణన 1_15, 2_45, 138, 3.203, 4-35,90,181
3. వైష్ణవయోగి 2.123
4. సీత వర్ణన 2_241
5. అమాత్యహితులు 3_22
6. సరోవరము 3_105
7. సూర్యాస్తమయము 3_117
8. నీళవర్ణన 4-149
9. బాలరాముడు 2-172
10. రావణుని రథము 2_235
11. రామపట్టాభిషేకము 2_253_56
12. హనుమంతుడు సముద్రము లంఘించుట 2_212
13. వాయువర్ణనము 3-86
14. వేట 1-66_75
15. దౌహృదము 2-61_67
16. రాత్రి 3_121
17. ధ్వాంతము 3_121
18. పుష్పావచయము 3_91_95
19. కులశేఖరుబాల్యము 2-75_84
20. సంధ్యాసమయము 3-118

రఘునాథాచార్యుడిందు కొన్ని వర్ణనలు పరంపరాగతములుగా గావించి యున్నను పెక్కు వర్ణనలు స్వతంత్ర ప్రతిభతో స్వీయతా ముద్రతో గావించి యున్నాడు. అందు గొన్ని వర్ణనల నాతడు నిర్వ

హించిన తీరుతెన్నులను స్థాలీపులాకన్యాయమున బరిశీలింతము.

1. నగర వర్ణన : దృఢవ్రతునకు నా తరువాత గుణశేఖరునకు రాజధాని కుక్కుటకూట నగరము. ప్రబంధ ప్రారంభమున గవి యీనగరమును వర్ణించి యున్నాడు, ఈ నగరము సంపదల కెల్లదామరతంపము సురనర నగరోత్తమము లందుమేటియై ధారుణీదేవియానసదర్పణము వలె నొప్పారుచుండెనట ఆ పురము నందలి కవాటపాళికలపై సమర్చిన నూత్న రత్నముల కాంతులచేనటు నిటు తిరుగు ప్రజల వస్త్రములు వింత వింత రంగులు గలిగినవియై యందరి యుడుపు లొక్కవిధముగ బ్రకాశించు చుండుటచే నిర్ధనులు ధనులు నొక్కటిగా దోచుచురుట ఇది యిప్పటి (Uniform) సమానవేషధారణను దెచ్చుచున్నది.

> మేటి కవాటపాళికలమీద నమర్చిన నూత్నరత్నపుం
> దేట మెఱుంగు లంగముల నివ్వటిలంగ బురప్రఘాణ పా
> ర్శ్వాటనవేళ అందు శబలాంబరధారణలీలలేర్పడన్
> నీటుదలిర్ప నొప్పుదురు నిర్ధనులున్ ధను లొక్కలాగైవడిన్ 1.41

నగరమున మన్న సుందరుల సౌందర్యమును జమత్కారముగ వర్ణించినాడు కవి.

> మేడల మీది నెత్తముల మేలగు చంద్రిక సాంద్రపింఛముల్
> జోడుగ విప్పవారగొని సొంపుగ నాడెడి నెమ్మి పిండువున్
> జూడగ వచ్చి యందు పురసుందరులన్ వెనజూచి యచ్చరల్
> వ్రీడఘటింప మోము లరపెట్టుదు రీశులకున్ మఱుంగుగన్ 1–4

ఇందు నగరసుందరీమణుల యంగాంగవర్ణన కవి జేయలేదు ఈ నగరము నందలి మేడలపై నాట్యము సేయు నెమలిపిండువును జూచుటకు వచ్చిన యచ్చరలు అటనున్న సుందరులను జూచి సిగ్గువడి తమ వారిని జూచి తమ్ము చులకన చేయుదురేమోయని కాబోలును

తమ మోములు భర్తలకు మఱుగుగ నుంతురట యటకవి కల్పోక్తిగ జెప్పక పోయినను నగర సుందరీమణుల యందు మచ్చరల యందమున కంటె మిన్న యనియూహింపగలము. నగరమున నన్ని దిక్కుల యందు నుద్యాన వనము లున్నవి. మఱియు నా పట్టణమున సద్ధర్మ యుక్తిని, సత్య వ్రతాఢ్యులైన విప్రులు, పరమ వైదికులగు భాగవతులు సాధుర క్షణక్షాంతులగు క్షత్రియులు, గోరక్షణము వాణిజ్యము తమ వృత్తులుగ గల్గినానా ధనధాన్య లాభములయక్షస్వామి నోడించు వైశ్యులు మహో దారులు సంగ్రామకళాశూరులునగు శూద్రులు నివసింతురట అప్పటి పురంధ్రికామణులు అవ్యయ పుణ్యగణ్యులై పతిప్రియగుణాన్వితలు ఉల్లసిత ధర్మ పరిశ్రమనై పుణీమనో హరిచరితలు వీని యన్నింటిని మించిన సౌందర్యవతులు. ఇట్లు సర్వశోభాకరముగా గుక్కుటకూట నగ రము వర్ణింపబడినది.

2. వసంతర్తు వర్ణన ;

కులశేఖర పుత్రిక నీళకు యౌవనము సంప్రాప్తమైనది. అమె శ్రీరంగనాథుని బతిగా గోరుచున్నది. అట శ్రీరంగమున రంగనాథుడీ నీళను బత్నిగా బొందగోరుచున్నాడు. వీరి మధురశృంగారమున కూర్వరంగముగ వసంతర్తు వర్ణన మారంభింపబడినది.

సహసాసముల్లసత్ప్రహకారమంజరీ
పుంజ మంజుల విశాఖాభాషితమ్ము
మల్లికావల్లికీ మధువత్తంత్రీ ఝుంకృ
తిస్వనోత్సుక కిరాతీజనమ్ము
దుస్తృజాశాపుక శ్రోటీకృతత్పక్వ
ఫలరసాపాత పంకిల్ల తలమ్ము

కలహంసమాలికాకులిత పంకరజరజ
శ్ఛన్న కాసారాంబు సౌరభంబు
సరస కిసలయ చర్వణోత్సాహకలిత
వితత కోకిలకాకలీసితఖలీన
కర్షణక్షుబ్ధ విముఖితగమన పాంథ
సైంధవము మధుమాసవానరము దనరి 3_78

ఇందు ప్రత్యేకముగా బేర్కొనదగినది మల్లిక యనెడు పల్లికి పైనున్న మధుపమనెడు తీగయొక్క ఝుంకృతినాదమునకు ముచ్చట పడెడి కిరాతీజనముయొక్క ప్రసంగము మధుమాసమున తుమ్మెదలరొద నందరు వర్ణింతురు. కాని మల్లికను వీణగా జెప్పి తుమ్మెదను తీగగా జెప్పెడి భావన యద్భుతము. తరువాత పద్యమున సమస్త తరుల తాగుల్మాదులకు సిరిని నింపు మాధవోత్సాహశక్తి ప్రస్తుతింపబడినది.

పశ్యజ్ఞానేక్షణు భావ్యంబులై కేస
రంబులదగు కేసరంబులకును
ప్రచలత్సరోజకైరవ మంపరముదిలై
సరసుల కింపైన సరసులకును
లలిత విచిత్రపల్లవశోభి సుమరమా
కందమ్ములైన మాకందములకు
మధుపానమదలీన మధురవాగ్రృమరీ
కదంబంబులైన కదంబములకు
వనస జంబూ శిరీషచందన మధూక
మాలతీ కుంద కురవక మల్లికాది
తరులతాగుల్మతతులకు సిరి దనర్చె
మాధవోత్సాహశక్తికి మారుగలదె? 3_79

మాధవుడను పదమునకు వసంతుడనియు, విష్ణువనియు నర్థము చెప్పవలయును. విష్ణువు కొందరికి సిరిని వర్తింపజేయును. ఈ వసంతుడు సమస్త వృక్షసంతతికి సమానముగా సిరిని/శోభను/భేదభావము లేకుండ గలిగించుచున్నాడు. కావున నీతని యుత్సాహశక్తికి మేర లేదని రఘునాథాచార్యుడు వ్యంగార్థము నిట నిక్షేపించినట్లూహింప వీలు కలుగుచున్నది. ఈ పద్యమునందున్న పదావృత్తి సౌందర్యము కేసరంబులదగు కేసరంబులకును, సరసులకింపైన సరసంబులను, సుమరమా కందమ్ములైన మాకందములకును, కదంబంబులైన కదంబములకునను రీతిని సహృదయగమ్యమై యున్నది.

3 చంద్రోదయ వర్ణన :

చంద్రోదయమగుచున్నది. తూర్పున జంద్రునికాంతులు కొలదిగా గాన్పించినవి. సూర్యుడు తొలుత దనతో గూడియుండి యటుపిమ్మట చంచలుడై పశ్చిమదిక్కాంతపై ననురక్తితో నామెను గూడియున్నాడని విరక్తి భావముతో దూర్పుదిక్కులనెడి కాంత నవ్వగా నామె రదనకాంతులు క్రమ్మినట్లు చంద్రకాంతులు కొలదిగా గాన్పించినవి.

ఇనుడనురక్తి మున్నదను నేర్పడజెంది యతిక్రమించి వం
చన నవరాశగూడి మది చంచలతం జనజూచి ప్రాగ్దిశాం
గన నగినన్ రదద్యుతులు గ్రమ్మినకై వడి దేజరిల్లం గా
ర్కొను పెనుజీకటుల్ విరియ గాంత సుధాకరదీప్తి తూర్పునన్
3-123

4. సలిలక్రీడ :

కులశేఖర మహీపాలచరిత్రము భక్తిభావగంభీరమైన ప్రబంధము. ప్రబంధనాయకుడు కేవలము భగవద్భాగవత సేవాభావ

ఖాసురుడు. ఇట్టి యీతని జీవితచరిత్రమును వ్రాయునప్పుడు పాఠకు కకు విసువు గలుగకుండజేయుట రఘునాధాచార్యుడు చేయవలసిన కని. అందులకు నీళా రంగనాథుల ప్రణయగాథను మాటిడుకొన్నాడు కవి. వసంతగమనముచే నీళకు విరహతాపము మొదలైనది. ఆమె ననుయింప నెంచి చెలికత్తెయలుద్యానవనమునకు దారిదీసినారు- వనవిహారము గావించి "నిశితాతపక్లాంతమ్ములగు శరీరంబులు స్వేదోద్గ మాక్రాంతంబులగుటయు జలావగాహంబు" గోరుచుండగా నొక సరసి కాన్పించినది. సంతోషముతో "నొండొరుల కరములూడుచు జని" శీతల వనజాకర జలవిగాహవశమతులై జలక్రీడకుపక్రమించినారు నీళయు జెలికత్తెలును సరోవరమున నీటియందు జరించుచుండగా దీరమున నున్న స్ఫాటికరత్నములందు వీరి యంగకములు ప్రతి బింబించినవి. అప్పుడు వారు లాస్యవేళ రంగస్థలమున తెరపై శోభిల్లు పసిడిబొమ్మలవలె ప్రకాశించినారట.

ఇక వారి సలిలక్రీడా విధానము—

డాయుచు బాయుచుంగరపుటమ్ములు సాచుచు వారిపూరమునన్
దోయజలోచనల్ చలముతో నితరేతర వక్త్రబింబ ల
జ్జాయత దృష్టి జిమ్ముచు సహాసవచోరచనల్ జెలంగ నీ
రాయతనమ్మునం దరగలాడవు తత్తటిఘట్టితమ్ములై— 3-109

పద్మవంటము లందొక యువతి మునిగి మోము పైకెత్తియుండగా తక్కిన యువతులందరుచూచి యది పద్మమని కాదు మునిగిన యువతి ముఖమని నిర్ణయింపలేకపోయినారట.

మీను తొడ దగిలి యులికెడు
మానిని చెలిచటిచి - వరపుమాన్పుచు నొక ప

ద్మానస గంతులు వైచెను
దీనత దనకాలు నాచుదీవ దగిలినన్ 3–112

సరోవరమున క్రీడించుచుండగా నొక వనిత తొడకు చేప యొకటి తగులగా మలికివడినది. ఆమెను భయపడకుమని వేఱొక వనిత ప్రయత్నించబోయినది. ఇంతలో నీమె కాలికి నాచుగీవ తగులగా నీమెయే గంతులు వేయ మొదలిడినదట. ఇచ్చట సున్నితమైన హాస్యము కనవరువబడినది. ఇట్లు సరసముగా సరోవరక్రీడ రఘునాథాచార్యునిచే వర్ణింపబడినది.

౯. సూర్యోదయ వర్ణనలు :

నీళారంగనాథుల వివాహమైనది. "దంపతుల నొకటిసేయుటకు" ముహూర్తము నిశ్చయించి వైభవోపేతముగా దత్కార్యక్రమమును బూర్తి చేసినారు. ముత్తయిదువలు నీళను రంగనాథుని యొద్దకు జేర్చి వెడలిపోయినారు. ఆ రాత్రి గడిచినది, అటుపిమ్మట సూర్యోదయవర్ణనము గావించియున్నాడు - రఘునాథాచార్యుడు. ఒక్కటే పద్యము అద్భుతమైన భావము. సంక్షిప్తము - రసవంతము.

తామరసాకరోత్సవవిధాయి రథాంగ విహంగ సంతత
క్షేమ సమర్థవమ్ము సువిశేష బుధవ్రజవేదభాపిత
శ్రీమహనీయమై రుచుల జెన్నెసంగిన్ భువనైకదర్శన
ప్రేమరసావలంబ మినబింబము తూఱుపుకొండ కొప్పునన్ 4–179

నీళాదేవి విష్ణుపత్నియగు నీళాదేవ్యంశమున జన్మించినది. పుట్టిననాట నుండి శ్రీరంగనాథునే కోరుకొనినది. అతడే స్వయముగ విచ్చేసి యాదరమున బెండ్లియాడినాడు, సౌఖ్యరసాబ్ధిలో నోలలాడించినాడు. నీళకు గోరిక నెరవేరి క్షేమము గలిగినది. ఇక గులశేఖరుడు వ్రివన్న

జనశ్రేష్ఠుడు. నిత్య భగవద్దర్శనాకాంక్షి. అట్టివానికి భగవంతుడు మెచ్చి తన కల్లుడై వాడు. కులశేఖరుని జన్మ చరితార్థమైనది. ఆ మరునాడు ఉదయముకులశేఖరునకు, నీళకు, రంగనాథునకు మహోత్సవముగాక యెట్లుండును. ఇట్టికళ్యాణసమయమును సూర్యోదయమనుప్రతీకద్వారమున రఘు నాథాచార్యుడు సూచించియున్నాడు. కులశేఖరుని దామరసాకరముగా నీళాదేవినిరథాంగవిహంగముగా భువనైకదర్శనప్రేమరసావలంమగునినబింబముగా రంగనాథుని భావనచేసినచోనీ పద్యము సహృదయైకవేద్యమైన మధురార్థమును బోధించుచున్నది. కులశేఖరుని సంతోషము-నీళాహృదయానందము-శ్రీరంగనాథుని భక్తజనహృదయానందసంధాయకత్వము వ్యజ్యమానములై రఘునాథాచార్యుని కవితాహృదయము నావిష్కరించుచున్నవి. ఇట్లష్టాదశవర్ణనములలో ప్రసిద్ధి నొందిన వర్ణనలలో నీతడు జూపిన మెలకువలు హృద్యములై యున్నవి.

ఇక నీతడు గావించిన యష్టాదశేతర వర్ణనలలో గొన్నింటిని నిర్వహించిన కౌశలమునుగూడ బరిశీలించుట యుక్తము. ఒకవ్యక్తి గాని, వస్తువునుగాని ప్రకృతి దృశ్యమును యాతడు కన్నులయెదుట నిలిపి ప్రత్యక్షముగా మనము చూచున్నట్లు వర్ణించినాడు. అందుల కుదాహరణముగా స్థాలీపులాకన్యాయమునవాలయిదింటినిబేర్కొందును

వె షవయతి

కులశేఖరునకు రామాయణగాథను వివరించి- యట్టి రామాయణమున శ్రీవైష్ణవుల సన్నిధిలో బఠింపజేసికొని విని కాలక్షేపము చేయుమని యుపదేశించిన శ్రీభక్తిసారుల వర్ణన యిది. ఈతని రాకతో గులశేఖరుని జీవితము ప్రధానమగు మఱియొక మార్గమును బట్టినది.

అట్టి యా మహిమాన్వితుడగు వైష్ణవ యతి వర్ణన వినినంతనే కన్ను లకు గట్టినట్లు రూపసాక్షాత్కారము కలుగువిధముగ జేయబడినది.

జడలు గట్టిన శిరోజశ్రేణి బాలార్క
కిరణాంకురముల గ్రేణిసేయ
భూషితశ్వేతోర్ధ్వపుండ్రరేఖలలోన
బచరించు హరిద్రరుచులెసంగ
బహుతంతుకీలిత పటమిళత్కంఠసీ
శిక పయోజాక్షమాలికలు గదల
షణ్ముఖతీర్థోదక పూరితంబగు తిరు
క్కావేరి వలకేల గానుపింప
భవ్యభుజపీఠి వ్రేలుచు దివ్యదేశ
గమ్య మృదుతీర్థగుళికల కక్షపాల
సారె నూరియాడ శ్రీభక్తిసారులనంగ
నెసంగు నొక యోగిశేఖరుండేగుదెంచి — 2_103

లేతసూర్యుని కాంతివంటి కాంతిగల జడలు గల్గిన శిరోజములు, ఊర్ధ్వ పుండ్రములు, పయోజాక్షమాలికలు, చేతిలో కమండలము, తీర్థ గుళికలతోనున్న కక్షపాల- ఇది కులశేఖరుని దర్శింపవచ్చిన శ్రీవైష్ణవ యతి స్వరూపము. మనుచరిత్రాదుల సిద్ధయత్యాదిక రూపవర్ణనము నకు ప్రతిబింబసదృశ్యము.

దండకాటవి నుండి వచ్చిన వారి వర్ణన :

కులశేఖరుడు రామాయణ గాథను వినుచున్నాడు. ఖరదూష ణాదులు రాముని చుట్టుముట్టిన ఘట్టము వచ్చినది. కులశేఖరుడు క్రుద్ధుడై యుద్ధసన్నద్ధుడైనాడు. మంత్రులా సంరంభము నాపుట కుపాయము నాలోచించి కొందరను మునుదుగా బంపగా వారెదురువచ్చి

మేము దండకాటవి నుండి వచ్చుచున్నాము. రాముడు ఖరదూష ణాదుల వధించినాడని తెల్పి కులశేఖరుని శాంతుని గావించినారు. ఇట్లెదురు వచ్చినవారి యాకారములను రఘునాథాచార్యుడిట్లు వర్ణించి యున్నాడు—

సముచిత శ్రమబిందు సరణి ముల్చీరలు
మేనుల మలకలై కానుపింప
గవయు బీఱెండల కడిమిచే గ్రాగు కన్
గవల కెంజివురుల కరణి దనర
రాలెడు వేఱువ్రతములు గ్రమ్మిన మస్త
కముల బుష్పరజమ్ము గ్రమ్ముకొనగ
దొడిబడి నీరమెుల్ దూటి కొమ్ములజెట్టు
కట్టు వల్వల సిరికలు నటింప
జేరువల సారువల వెంటజేరి తిరిగి
దండకాటవినందుండి తరలివచ్చి
నట్లుమాయా పరిశ్రమం బలవరించి
మనుజపతి చూడ్కి నొదవి రమాత్యహితులు — 3-22

నిజముగ దండకాటవి నుండి నడచి నడచి యలసి సొలసి వచ్చినట్లు వీరి యాకారములు సహజముగా వర్ణింపబడినవి.

సూర్యాస్తమయ వర్ణన :

నీళాదేవి శ్రీరంగనాథుని వలచినది. వసంతకాలము రాయగా విరహతాపము హెచ్చినది. యామె బాధ నపనయింపదలచి చెలికత్తెలామెనుద్యానవనమునకు గొనిపోయినారు. జలక్రీడలు సలిపినారు. అట్టి సమయమున గవి సూర్యాస్తమయ వర్ణనము గావించియున్నాడు

వనధి లుఠత్తరంగముల (వాలుటకున్ వెఱవగ్గలించినన్
దనదు మయూఖవార మొకదారి జనన్ బెడగైన మేన దా
ర్కొనిన వివర్ణవృత్తికి మఱుంగుంగ శోణపటంబు దావహిం
చినగతి రక్తదీప్తి బొలిచెన్ రవి పశ్చిమ శైల సంగతిన్ 3-117

సాయంకాలమున సూర్యుడు పశ్చిమ సముద్రమున మునుగవలసి యున్నది. కాని యాతని కిరణములందుల కంగీకరించ వేరుదారిన బోయినవి. అందుచే సూర్యుడు వైవర్ణ్యమును బొంది తన వివర్ణత నితరులు గుర్తింపకుండ శోణపటము నొకదానిని మరుగంగ దాల్చి నట్లు రక్తవర్ణకాంతితో ప్రకాశింపజొచ్చినాడట.

ఇందు విరహసముద్రమున మునిగియున్న నీళాదేవి వ్యథను గవి సూర్యుని వైవర్ణ్యనతో వ్యంగ్యముగా సూచింపదలచినట్లు గాన్పించుచున్నది.

రాత్రి వర్ణన : నీళాదేవికి శ్రీరంగనాథ విరహముచే దాపమధికమైనది. వనవిహారముచే, సలిలక్రీడచే నా తాపము శాంతింపలేదు. ఇంతలో ర్యుడస్తమించినాడు. అప్పుడు రాత్రివేళ గృహతారకలెట్లున్నవో కవి వర్ణించియున్నాడు.

వసుధ విహరించు రాత్రి దేవతకు
సత్కృతి యొనర్చదలచి దిక్సతులు వేడ్క
దనర బహు పుష్పములు మేన నునిచినట్లు
దివి బహు గ్రహతారకల్ దేజరిల్లె — 3-122

భూమిపై రాత్రిదేవత విహరించుచున్నది. ఆమెకు సత్కారమొనర్చ టకు దిక్కాంతలు పుష్పములనామె దేహమున నలంకరించునట్లు బహు గ్రహతారకలు తేజరిల్లుచున్నవట.

ఇట్లు రఘునాథాచార్యుడు తన ప్రబంధమున గావించిన యే వర్ణన గావించినను పత్యంత ప్రతిభావంతముగా బొడకట్టును. ఇట్లు ప్రతిభా సముద్భూతమగు నిస్తుల వర్ణనానైపుణ్యముచే సార్థక్యము నందిన కవిగ్రామణి రఘునాథాచార్యుడు. ఇట్టి లోకోత్తర వర్ణనా నైపుణ్యుడగు రఘునాథార్యకృత కులశేఖరమహీపాల చరిత్రము మహితవాగ్దేవీకంఠ అన్మన్మణిహారమున వెలసిన మంజులనాయకమణి

## 5. కథాకథనము :

పాకమున నుపయోగించిన శాకాదులెంత ప్రశస్తములైనను, అధికమూల్యమునిచ్చి తెచ్చినవైనను, సత్యద్భుతరుచిరుచితములైనను బాకక్రియాకలాపము కళాత్మకముగా దక్షతతో సాగింపనిచో విందు రక్తికట్టదు. అట్లే కవి యెట్టి విశిష్టకవితాసామగ్రి సమగ్రుడైనను, గథ యెంతటి సొగసరియైనను, గథనము కళాకౌశల కమనీయమై పాఠకుని యుత్సుకతను బెంపలేనిదైనచో నువర్వ్యక్త సాధనసంపత్తి సమస్తము వ్యర్థమగును.

కవియందలి ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు కృతకృతములై యుత్తమ కావ్యసృష్టి కావింపబడుటకు గథాకథనకౌశలమే కారణము.

ఆంధ్రసాహిత్యమున గథాకథన విషయమున నాదికవి నాగమ శాసనుడు ప్రసన్నకథాకలితాయుర్థక్తుడగుట యాంధ్రుల బహుజన్మ పరిపాకసుకృతము. ఆతని మార్గముననే తిక్కనయు, నెఱ్ఱనయు ననుసరించి భారతమువంటి బృహత్కథాభాగము నాంధ్రులాదరమున బఠించినట్లు గావించియున్నారు. ఆ తరువాత నాచన సోముని నం విధానచక్రవర్తిత్వము, నల్లసానివాని యల్లిక జిగిబిగి, పింగళి సూరనార్యుని విచిత్రకథాకథన కౌశలము నాంధ్రసాహిత్యమును ముజ్వలము గావించినవి.

ఇట్టి కథాకథనవిధాన పథముననే కులశేఖరమహీపాలచరిత్ర కర్త యగు రఘునాథాచార్యుడును దనప్రస్థానమును సాగించి యద్భుతములగు మెలకువలను బ్రదర్శించి తన ప్రబంధమునకు బింకమును గొనివచ్చినాడు.

స్వీకరించిన యితివృత్తము "పురాతన భాగవతపరంపరాముఖోదీరితమై" వచ్చుచున్నది. ఇట్టి కథను దాను స్వయముగ జెప్పినట్లు గాక కొందరు శిష్యులు తమ గురువర్యునడిగినట్లును, గురువు వారికి కథాంశమును వివరించినట్లు గల్పించియున్నాడు.

ఒక దేశికమణి తామ్రపర్ణికా నదీతీరమున పద్మాసనస్థుడై యుండ శిష్యులాతనితో నిట్లనిరి—

దేవరవారు మున్ను వసుదేవకుమారక భక్తవృత్తముల్
పావనసూక్తులం దెలియబల్కితి రక్కులశేఖరాభిధా
నావనిభర్త సచ్చరిత మద్భుతరూపముగా నాత్మలన్
దావలమయ్యె గౌతుకము దాసులకున్ గృప నానతీదగున్ 1,33

ఇందు గులశేఖరాభిధానావనిభర్త సచ్చరితము అద్భుతరూపము లని పేర్కొనబడినది. శ్రీవైష్ణవసంప్రదాయము గాలక్షేపమను దాని కొక విశిష్టమైన యర్థమున్నది. ఉబుసుపోకకేవో విషయములను ముచ్చటించుకొనుటకంటె మోక్షప్రదములగు పవిత్రవిషయములను జెప్పుకొనుట మంచిది. అట్లు భగవద్భాగవతలీలలు ముచ్చటించుకొనుటనే కాలక్షేపమందురు. సాధారణముగ గురువు చెప్పుట శిష్యులు వినుచు మధ్య మధ్య తమకు గల్గు సందేహములడుగుట, గురువు సందేహములు తీర్చుచుండుట, యీ తీరున "కాలక్షేపము" సాగును. విశిష్టాద్వైత

మత సంప్రదాయవేత్తయగుటచే దన ప్రబంధ కథనావిధముగ గురు వర్యునిచే శిష్యులకు జెప్పించియున్నాడు.

కథను గుక్కుటకూటపురవర్ణనతో నారంభించియున్నాడు. సర్వ ప్రబంధసాధారణమగు నీ పురవర్ణనమున భాగవతుల వర్ణన, వారు తిరుమాళిగల వర్ణన కావించి రాబోవుకథలో భాగవతుల ప్రాధాన్యమునకు నిపుణముగా బీజారోపము గావించినాడు. పురవర్ణనతోబాటు ధృఢవ్రతుని పాలనాదక్షతను శౌర్యాదులను బ్రస్తావించి వెనువెంటనే వేట వృత్తాంతమును దీసికొని వచ్చినాడు. రాజు వేట తమకమున లేడి వెంటబడుట, లేడి యలసిపోయి యొక సరసి చెంగట నేలపై వ్రాలుట రాజు హృదయము ద్రవించుట క్రమముగా జెప్పి, వేట సమయము నందలి వీరరసస్ఫూర్తిని గ్రమముగా గరుణరసముపై పునకుమరలించి యున్నాడు. కరుణరసపూరితమైన హరిణీ వృత్తాంతముచే పాఠకుల హృదయమును కరగించినాడు. రాజు ననపత్యత నెత్తిచూపి హరిణి వెడలిపోగా దన యనపత్యతకు రాజు విచారించుట, వెదకుకొనుచు వచ్చిన మంత్రులు రాజు నోదార్ప ప్రయత్నించుట, రాజు వారలపై గోపించుట, కడకు మంత్రులు రాజుహృదయము నెఱిగిన వారగుటచే "మహాభాగవతుల నడిగి వారు చెప్పినట్లు చేయుదుము" అని రాజు నొప్పించుట యను యంశములతో బ్రథమాశ్వాసమును ముగించి యున్నాడు. రాజు భాగవతుల నడుగునో, వారేయందురో యను ప్రశ్నలతో బాఠకుడుత్కంఠితుడగునటులాశ్వాసమును ముగించుటయిట విశేషము.

ద్వితీయాశ్వాసారంభమున మహాభాగవతుల రాక, వారిని రాజు సంభాషించుట, వారు మాధవారాధనవిధానమునువదేశించుటతో రాజా

వ్రతదీక్షితుడైనాడు. ధృఢవ్రతుడు తన నామము సార్థకమగునట్లు నిష్ఠతో మాధవారాధనము గావించి పుత్రుని వరముగా బొందినాడు. కులశేఖరుని బాల్యము నత్యంతరమ్యముగ వర్ణించినాడు కవి. ఆళ్వారు కోటిలో బరమ ప్రసిద్ధి నొందనున్న కులశేఖరుని బాల్యమును దగినట్లు చిత్రించి చూపుటలోనే రఘునాథుని కథనకౌశల మిమిడిగున్నది. కులశేఖరునకు విద్యలు నేర్పిన గురువులచే గులశేఖరుని యోగ్యత జెప్పించినాడు కవి.

గురువులు దృఢవ్రతునిచే గులశేఖరుని విద్యాభ్యాసమును గురించి—

రాజన్మూర్తి భవత్తనూజుడు మనోరాజీవవీథిన్ మహా
రాజశ్రీ రఘురామనామ దివిషద్రాజాధిరాజాంఘ్రి సే
వాజాగ్రద్ధతిబూని నేర్చె జదువుల్ వైదుష్యమేపార నో
రాజా! పాండురకీర్తి రాజనిధిముద్రా! రాజరాజోపమా! 2-85

ఇత్యాదిగా జెప్పించి యథాలాపనుగా జెప్పినట్లు కులశేఖరుని వైదుష్య మును, యోగ్యతను వివరించియున్నాడు కవి. తదనంతరము కుల శేఖరుని జైత్రయాత్ర పరిపాలనావిధానమును వర్ణించియున్నాడు వెనువెంటదే వైష్ణవయతి రాకతో గులశేఖరుని జీవితమున నతిముఖ్యమగు రామాయణ శ్రవణాసక్తికి ప్రసక్తి యేర్పడినది. వైష్ణవయతివలన రామాయణ గాథను సవిస్తరముగా జెప్పించియున్నాడు.

కులశేఖరుని భక్తిపారవశ్యమును వివరించు ఘట్టములకు రామాయణ శ్రవణముతో సంబంధమున్నది. ఖరదూషణాదులపైకి, రావణుని పైకి గులశేఖరులు దండెత్తిపోవుట రామాయణ శ్రవణ సందర్భముననే జరిగినది. కులశేఖరాళ్వారు తన పెరుమాళ్ తిరుమొళిలో మూడు దశకములలో /8, 9, 10/ రామాయణ గాథను గీర్తించి యున్నాడు, ఇట్లు కులశేఖరుల జీవితమున ప్రధానపాత్ర వహించు

చున్న రామాయణమును రఘునాథాచార్యుడు సందర్భమునుగల్పించు కొని సంపూర్ణముగ వివరించియున్నాడు. ఇందులకు దాను స్వయముగ రామభక్తుడగుటయు గారణమనవచ్చును. ఈతడు తన కృతిని శ్రీరామునకే యంకితము గావించియున్నాడు. గ్రంథారంభమున సైతము శ్రీరామచంద్రుని, సీతాదేవిని ప్రార్థించియున్నాడు. ఇట్లు కవికిగల శ్రీరామభక్తి, ప్రబంధనాయకుడగు కులశేఖరునకు గల రామాయణానురక్తియును వానికి సరియగునట్లు రామాయణ గాథనత్యంతభక్తియుక్తుడై వివరించియున్నాడు. వైష్ణవయతి రామాయణ గాథను వివరించి "ఇట్టి శ్రీరామచరిత్రంబు వల్మీక సంభవప్రోక్తబును గాయత్రీవర్ణాత్మకంబును నుభయలోక సౌఖ్యసంధాయకంబును నగుటజేసి యిప్పుణ్యచరితంబు భాగవతోత్తమునిచే నాకర్ణింపుచున్ గాలక్షేపంబు సేయుము" /2-258/ అని చెప్పి వెడలిపోవుటతో ద్వితీయాశ్వాసమును ముగించినాడు రఘునాథాచార్యుడు.

తృతీయాశ్వాసారంభమున రామాయణ శ్రవణావసరమున ఖరదూషణాదులపై కులశేఖరుడు దండెత్తుట మంత్రులు సాయమున మాన్పించుటయు, వైష్ణవులను ద్వారపాలకులడ్డగించుట కులశేఖరుడు వారలపై గోపించుట రమ్యముగా జెప్పబడినవి. రఘునాథుడు భాగవతులచే ద్వారపాలకులను రాజు బారినుండి విడిపింప జేయుట యొక ముఖ్యవిశేషము. రామాయణ శ్రవణసందర్భమున సీతాపహరణ వృత్తాంతము వచ్చినది. కులశేఖరుడు రావణునిపై దండెత్తిపోవుచుండగా సాక్షాన్నారాయణుడు శ్రీరాముడై యాతనిపూనిక నాపుచేయించి యాతని కొక కుమార్తె గలుగునని చెప్పెను. నీళాదేవి బాల్యాదులను వర్ణింపక యామె యౌవనవతియై భాగవతులవలన

విని శ్రీరంగమున నున్న శ్రీరంగనాథుని బరియణమాడ గోరిక గలిగి యున్నదని సంగ్రహముగ చెప్పి ముగించి ప్రబంధ, రచనావిధానముకుదగినట్లు నీళాదేవివిరహతాపమును, నీలవేణిదౌత్యమును, శ్రీరంగనాథుని విరహమును శ్రీముఖపత్రికను వ్రాసియిచ్చుటను వేర్వేరని తృతీయాశ్వాసమును ముగించి చతుర్థాశ్వాసమున నీలవేణి తాను రంగనాథుని యొద్దకు బోయి వచ్చిన విశేషములు రమ్యముగా వివరింపజేసినాడు. మంత్రుల దుర్మంత్రముచే వైష్ణవులకు జౌర్యమాపాదింపబడగా గులశేఖరుడు పామును ముట్టినాడు. శ్రీమహావిష్ణువు రంగనాథుడై సాక్షాత్కరింపబడగా గులశేఖరుడు తన కుమార్తెను బెండ్లియాడుమని ప్రార్థించును. శ్రీరంగనాథుడంగీకరింపగా వివాహమతివైభవముగా జరిపించినాడు కులశేఖరుడు ఈ వివాహపు వేడుకల నతి విపులముగా రమ్యముగా వర్ణించి కులశేఖరులు కుమార్తెను నత్తవారింటికి దీసికొనిపోయి దిగవిడచి వచ్చిన తరువాత ముకుందమాలను దివ్యప్రబంధమును రచించి భాగవత సేవాపరతంత్రుడై కుమారునకు రాజ్యము నిచ్చి స్వర్గమున కేగినని నాలుగయిదుపద్యములలో సంగ్రహముగా జెప్పి ముగించినాడు.

ఇట్లు భక్తిభావబంధురము, శాంతరసభరితమునైన కథను గైకొని విసుగు కలుగకుండునట్లు శృంగారమును మేళవించి కులశేఖరుని స్వభావప్రభావముల వివరించునట్టుల విపులీకరించి యక్కరలేనివట్టుల సంక్షిప్తము చేసి కథకు నేకవాక్యతచెడకుండ, ధారాళముగా సాగిపోవునట్లు నిర్వహించియున్నాడు. వర్ణన లత్యంత సంక్షిప్తము కథతో బొత్తు కలిసిపోయియుండుటవలన గథ యెచ్చటను నాగిపోక యెడతెరిపిలేకుండ సాగిపోయినది.

ఇట్లు పాఠకుల యుత్సుకతను బెంచుచు జాతుర్యముతో గథా

కథనము సాగించి కులశేఖరమహీపాల చరిత్రము నుత్తమ సాహితీ ఖండముగా దీర్చిదిద్దినాడు. పరమపవిత్రమైన కులశేఖరుని జీవిత గాథను నిర్మలముగా ప్రబంధరూపమున సహృదయహృదయానంద సంధాయకముగా నొనరించి దన కథాకథనచాతుర్యమును వెల్లడించు కొనినాడు రఘునాథాచార్యుడు.

6. అలంకారములు :

కావ్యమునకు శోభను గలిగించు ధర్మము అలంకారములు. ఇవి యంగదాద్యాభరణములవలె శబ్దార్థముల శోభ నతిశయింపజేసి రసాదుల కుపకారములగునవి. రామరాజభూషణుడు కావ్యేందిర కలంకారములు సొమ్ములని నుడివినాడు[1] కావ్యము నలంకరించునవి కావుననే యివి యలంకారములని సార్థకనామములైనవి.

ఒక భావమును సామాన్యపద్ధతిలో జెప్పినప్పటికంటె నాలంకారికముగ జెప్పినప్పుడు స్ఫూర్తి హెచ్చును. వినువారలచిత్తము హత్తుకొనును. కవితానముల్లాసుడగు కాళిదాసు తన కమనీయకవితా కళాకౌశలము నుపమాలంకార విన్యాసము ద్వారమున బ్రదర్శించియున్నాడు. అలంకారములు కావ్యకీర్తికపరిహారములు కాకపోయినను నత్యావశక్యములైనట్టివి. ప్రబంధయుగమున వెలసిన సాహిత్యమును బరిశీలించినచో నాలంకారిక రచన ప్రబంధమునకపరిహార్యమునగే భావింపబడినట్లు తోచును. ప్రబంధములయందు వర్ణనల తరువాతి స్థానమునీ యలంకారములాక్రమించినవి. ప్రబంధములందు శబ్దాలంకారములును, నర్థాలంకారములును బ్రచురణ ప్రచారమునందినవి.

ఈ ప్రాబంధిక మార్గముననే రఘునాథాచార్యుడు తన కులశేఖర

---

1. కావ్యాలంకార సంగ్రహము 2-58

మహీపాల చరిత్రమును శబ్దార్థాలంకారములచే నలంకరించి సొంపు నింపినాడు.

రఘునాథాచార్యుడు వెలయించిన శబ్దాలంకారములను దొలుత బరిశీలింతము.

శబ్దాలంకారములు :

1. వృత్త్యనుప్రాస :

ఒక్క వర్ణంబు కడదాక నుద్ధరింప
బరగు జృంభణవృత్త్యనుప్రాసమయ్యె[1]

ఒక్క వర్ణమునే తుదిదాక ననగా ఎక్కువపర్యాయములావృత్తిసేసినచో వృత్త్యనుప్రాసమగును.

అట్టిదికాదె! నా బ్రదుకు హారవటీర నికాశకీర్తినం
ఘట్టిత దిక్తటీకరటికొంభమ బీవధ్రజ కంఠపాళికా
చట్టికి రాజ్యపుంగడలి పట్టికి బట్టగునట్టి పట్టికిం
బట్టన రాజ్యపీఠమునంబట్టముగట్టగలేమి వక్కటా! 1-115

ఈ పద్యమున ద్విరుక్తటకారము పలుమారులావృత్తిని బొందినది. అందుచే నిది వృత్త్యనుప్రాసమగును.

2. ఛేకానుప్రాస :

"అడర నెడలేక రెండు రెండక్షరంబు
లెనయు నియమంబు ఛేకమౌ నెట్లటన్న"[2]

1. కావ్యాలంకార సంగ్రహము 4-75
2. అదే, 4-73

అవ్యవధానముగా రెండేసి హల్లుల జంటలను, అనేక పర్యాయములు నొడువుట ఛేకానుప్రాసము.

సమధిక సూక్ష్మపక్ష్మనికషా సుకషాయిత వీక్షణద్యుతల్
దము నునుగెంపు దువ్వలువ దట్టపురంగు పాంసంగజేయ భూ
రమణుని కిన్కగన్గొని ధరాధర ధైర్యధురంధరుండు చి
త్తమునగలంగెనంచును బ్రధానవరుల్ సభయాంతరంగలై 1.158

ఈ పద్యమునందు మూడవపాదమున ధరాధర, ధురంధర అనువిధము రెండేసి హల్లుల జంటలు నొడువబడుటచే ఛేకానుప్రాసమగును.

3. లాటానుప్రాస :

"తలప బునరుక్తియయ్యు దాత్పర్యభేద
మెనయు నియమంబు లాటమౌ"[1]

శబ్దార్థములయొక్క పౌనరుక్త్యమున్నను దాత్పర్య భేదమున్నచో నది లాటానుప్రాసమగును.

ప్రథమాశ్వాసమున దృఢవ్రతుడు వెంటాడుచుండగ బరుగుపెట్టు చున్నలేడిని వర్ణించిన పద్యము—

తురగ రింఖోద్ధూత ధరణీపరాగమ్ము
కనుదోయి గ్రమ్మిన గలగి కలగి
పటు హయాంఘ్రిన్యాస భయదార్భటుల ఫేర్మి
నుడియు విభ్రాంతిచే సొరిగి సొరిగి
సంక్షుబ్ధ వక్రసంచార శ్రమంబున
నొడలు కంపింపంగ నొదిగి యొదిగి
ఎడనెడ నృపుడొనర్చెడు సింహరవముల
వెడవెడ వరయుచు నడలి యడలి

1. కావ్యాలంకార సంగ్రహము 4-75

కొంతదూర మరిగి యంతట జిడిముడి
నడలు గడలుకొనగ నడువలేక
యొక్క సరసిచెంత నుర్వీశుడీక్షింప
హరిణి తల్లడిలుచు నవని వ్రాలె 1-81

ఈపద్యమున గలగి. కలగి, సొరిగిసొరిగి, ఒదిగియొదిగి, అడలి యడలి అను రీతిని శబ్దపునరుక్తియున్నది కలగికలగి యనునప్పుడు మొదటి "కలగి" యను పద్యముయొక్క యర్థము, రెండవ "కలగి" యను పదముయొక్క యర్థము సమానమే. కాని యభిప్రాయమునమాత్రం కొలది భేదమున్నది. కలగి – మఱింతగా గలగి – అని విశేషార్థము సుంత రెండవ "కలగి"యను పదముద్వారమున వ్యక్తమగుచున్నది.

4. యమకము :

"సమవర్ణ యుగాధికమై
యమరిన నియమంబు యమకమగ గృతుల"[1]

సమానమైన వర్ణముల యొక్క జంటను గాని, సమూహముకుగాని యావృత్తిసేయుట యమకము.

మొనసి పురి యరసి కానక
వనివడి క్రిమ్మఱ దలంచె పావని కులపా
వని వనితామణి జనకా
వని పాల తనూజ కింకవని కావని కాన్ 2-214

ఈ పద్యమున నాల్గవ చరణమున వని - వని; వనితా - వనితాన్ అని సమాన వర్ణస్తబకముయొక్క యావృత్తి జరిగినది కావున యమకమగును.

అర్థాలంకారములు :

రఘునాథాచార్యుడత్యంత సమర్థవంతముగ, నర్థవంతముగ

---

1. కావ్యాలంకార సంగ్రహము 4-78

నుపమాద్యలంకారములచే దన కావ్యకన్య నలంకరించియున్నాడు. అనేకాలంకారముల నీతడుపయోగించియున్నను ముఖ్యముగా నుపమాలంకారముల నైపుణ్యము ప్రథమగణ్యము. తక్కిన యలంకారములను నైతము సందర్భోచితముగా నుపయోగించినాడు. ఈతడు నిస్సీమశేముషీవిశేషమున విన్యసించిన యర్థాలంకారములలో బ్రసిద్ధములగు కొన్ని యలంకారములను లక్ష్యలక్షణ సమన్వయపూర్వకముగా బరిశీలింతము.

1. ఉపమాలంకారము :

"ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీరుల్లసతిద్వయోః"[1]

ఉపమానమునకు, ఉపమేయమునకు-ఈ రెండింటికి సామ్యరూపమైన సౌందర్యము సహృదయరంజకముగా నెచ్చట నుండునో యచ్చట నది యుపమాలంకారమగును.

అరయ కుంభసంక్రమణమందు శుభానుగతిన్ బునర్వసూ
తార నుదారకీర్తి వనితా సహచారుగుమారు సద్గుణా
ధారు నరేంద్ర సుందరి ముదంబున గాంచె సముల్లసత్పయో
వారిధిగర్భవీచి చెలువంబుగ జంద్రుని గన్న కైవడిన్ 2-68

దృఢవ్రతుని పట్టపుదేవి కులశేఖరుని బ్రసవించిన సందర్భములోనిది పద్యము.

కుంభసంక్రమణ సమయమున బునర్వసు నక్షత్రమున దృఢవ్రతుని భార్య సద్గుణాధారుడు వనితా సహచారుడగు కుమారుని పయోనిధి గర్భవీచి చెలువముతో జంద్రుని గనినట్లు ప్రసవించినది.

ఇందు నరేంద్రసుందరికి బయోవారిధిగర్భవీచితో కుమారునకు

---

1. చంద్రాలోకసమున్మేషము, పు. 1 స్ఫూర్తిశ్రీ / శ్రీటి. భాస్కరరావు మహతీ గ్రంథమాల, తృతీయ ముద్రణము, 1981/

జం(్ద్రునితో సాదృశ్యము చెప్పబడుటచే నుపమాలంకారమైనది.

ఇచ్చట కేవల మలంకార(ప్రాయముగ నుపమించుటయేకాక యీ యౌపమ్యముచే నహృదయ గమ్యమైన కావ్యాత్మయగు ధ్వనిని సాధించుటలో సార్థకమైనది. క్షీరాబ్ధివీచితో గులశేఖరమాతకుపమానము చెప్పుటవలన నామెయందు:పవిత్రత, గాంభీర్యము మున్నగు నుదాత్త గుణములు స్ఫురించుచున్నవి. అట్లే కులశేఖరునకు జం(ద్రునితో బోలిక జెప్పుటచే జనప్రియత్వము ప్రసన్నసుభగత్వము మున్నగు విశిష్ట గుణములాతనియందు వ్యంగ్యరూపమున వ్యక్తములై నిరతిశయానందమునుగలిగించుచున్నవి. ఉపమానములు (ప్రసిద్ధములై (ప్రకృతిలో నుండి కైకొనబడుట మఱొకవిశేషము. లేకలేకకలిగిన సంతానమగుటచే నామెకు గుమారదర్శనముచే గల్గు సంతోషము చంద్రునిగన్న సం(ద్రంవలె నుప్పొంగుటకూడ నూహ్యమైయున్నది.

అత్యద్భుతమగు మఱియొక యుపమానము—

కాంచి కోదంచదవలగ్న కాంచనాంగి
కాంచి కవి కార్యసిద్ధి యూహించి పొంగె
భంగ సంఘాత సంచార భంగి గ్రుంగి
చంద్రికళ గాంచి పొంగిన జలధివోలె 2-216

కులశేఖరుడు రామాయణమును భక్తిసారులవలన వినుచుండెను. రామాయణ కథలో హనుమంతుడు సీతను వెదకుటకు వెడలి యామెను గాంచినప్పటి పద్యమిది.

సీతాదేవిని జూచిన హనుమంతుడు చంద్రికళను గాంచిన జలధివలె బొంగినాడట. సముచితము, సార్థకమునగు రీతిలో నుపమాలంకారమును వాడినాడు కవి. సీత రావణునింట కృశించియున్నది. అందుచే నామె చంద్రికళతో బోల్చబడినది. ఆమెను గాంచిన హను

మంతని యానందమును వర్ధించుటకు - జంద్రికళను జూచి పొంగిపొర లెడు సముద్రమునకంటె ప్రసిద్ధము, సమంజసమునగు నుపమానము మఱియేది? ఎల్లరకు దెలిసి, ప్రకృతిలో సహజమగు సముద్రమునుప మానముగా గొనుటలోనే రఘునాథాచార్యుని ప్రాగల్భ్యము వెల్లడి యగుచున్నది. రామవిరహముచే రావణ నిర్బంధముచే భృశము కృశించియున్న జానకిని - గృశించియును బ్రకాశించుచున్న జానకిని జంద్రికళతో బోల్చుటలోనే "ఉపమా రఘునాథస్య" అని పేర్కొనుట లోని సార్థక్యము వెల్లడియగుచున్నది.

2. ఉత్ప్రేక్షాలంకారము :

సంభావనా స్యా దుత్ప్రేక్షా వస్తు హేతు ఫలాత్మనా।
ఉక్తానుక్తా స్పదాద్యాత్ర సిద్ధాసిద్ధాస్పదే పరే॥[1]

వస్తువును, హేతువునుబట్టి, ఫలమునబట్టి యూహించుట యుత్ప్రేక్షా లంకారము.

అప్పుడద్దేవవరేణ్యు లాత్మనిటలప్రాంతమ్ములం జేర్చు పా
ణిపుటంబుల్ విలసిల్లె రావణభుజాన్వీతజ్వలచ్చంద్రహా
స పటుక్షేప నిరీక్షణోదిత మహాసంతాపములంజెందు డెం
దపుగెందమ్ముల చంద మచ్యుతునిచెంతందెల్పునట్లొప్పగన్. 2141

రావణునిచే భీతులైన యింద్రాది దేవతలందరు బ్రహ్మతో గూడ విష్ణువు కడకు బోయినారు. విష్ణువును జూడగనే నిటలప్రాంతమునకు దాకునట్లు చేతులు జోడించి నమస్కరించినారు. ఆసందర్భములోనిది పద్యము.

1. చంద్రాలోక సమున్మేషము, పు. 39

దేవశ్రేష్ఠులు తమ నిటలప్రాంతములకు జేర్చిన పాణిపుటములు రావణుని చేతనున్న కృపాణముయొక్క విక్షేపములను జూచుటవలన తమ హృదయములనెడు నెత్తమ్మితామరలు సంతాపమును బొందిన విధమును విష్ణువునకు దెలియ జెప్పుచున్నట్లుగా నొప్పినవి.

చేతులు జోడించుటకు హేతువుకాకపోయినను దమ హృదయములనెడు నెత్తమ్మితామరలను జూపుటకుగా బేర్కొనబడినది. కావున నిది యుత్ప్రేక్షాలంకారము. హేతువు కానిదానిని హేతువుగా నూహించుటచే హేతూత్ప్రేక్షయని చెప్పబడుచుండును.

3. రూపకాలంకారము :

" విషయ్యభేద తాద్రూప్యరంజనం విషయస్య యద్।
రూపకం తత్త్రిధాధిక్య న్యూనత్వానుభయోక్తిభిః ॥1

ఉపమేయమునకు ఉపమానముతోడి యభేదమును గాని తాద్రూప్యమును గాని వర్ణించిన యెడల రూపకాలంకారమగును.

భవదావానల కాలమేఘము విపత్పాథోధిపోతమ్ము దుః
ఖ నిషాభీల భుజంగబర్హిణము మౌర్ఖ్యగ్రావ దంభోళి దు
ర్వ్యవసాయాంధతమః పతంగకిరణవ్రాతంబు తాపత్రయీ
నవిధారణ్య కుఠారధార భవదీక్షాలాభ మెవ్వారికిన్ 2-107

భక్తిసారులను యోగిపుంగవునిగూర్చి కులశేఖరుడు పలికిన పలుకులివి.

ఎవ్వరికైనను మీదర్శనభాగ్యము భవమనెడు దావానలమునక కాలమేఘము. విపత్తులనెడు సముద్రమును దాటించుటకుదెప్ప. దుఃఖమనెడి విషసర్పమునకు నెమలి. మూర్ఖత్వమనెడు పర్వతమునకు వజ్రాయుధము. దుష్టప్రయత్నములనెడి చీకటికి సూర్యకిరణ సమ

1. చంద్రాలోక సమున్మేషము, పు. 18

దాయము. తాపత్రయములనెడు నరణ్యములకు గొడ్డలివదును.

ఈ పద్యమునందు భవమునందు దావానల ధర్మమును, విపత్తు నందు సముద్రధర్మమును, దుఃఖమునందు భుజంగి ధర్మమును, మౌర్ఖ్యమునందు గ్రావధర్మమును, దుర్వ్యవసాయమునందు నంధకార ధర్మమును, తాపత్రయమునందు నరణ్యధర్మమును, యోగీశ్వరేక్షా లాభమునందు గాలమేఘము, పోతము, బర్హిణము, దంభోళి, పతంగ కిరణముల సముదాయము, కుఠారధార యను వాని ధర్మములను నారోపింపబడినవి. ఇట్లు పమేయోపమానములకున భేదతాద్రూప్యము లను వర్ణించుటచే నిది రూపకాలంకారము.

యోగీశ్వరేక్షాలాభము ననేకరీతుల రూపించుటచే భాగవతదర్శన భాగ్యప్రభావము లెస్సగా నిరూపించబడినది. దీనివలన గథానాయకు డగు కులశేఖరుని భాగవతానురక్తి వ్యక్తమై తత్పాత్రపోషణముసమీ చీనముగా గావింపబడినది.

4. అర్థాంతరన్యాసము :

ఉక్తి రర్థాంతరన్యాసస్స్యాత్సామాన్య విశేషయోః[1]

సామాన్యవిశేషములను చెప్పుట యర్థాంతరన్యాసాలంకారము—

లోకహితార్థియైన శిఖిలోచను సాధనభంగవృత్తిమై
నాకుని పక్షహానియు మనమ్మున సైపక హేమశైల ర
త్నాకర తోయముల్ దలపడయ్యె సుతోత్సవ దానవేళ సు
శ్లోకులు సాధురక్షణ విలోపముసేయుట కోర్వనేర్తురే 2-72

కులశేఖరుడుదయించినపు డాతని తండ్రియైన దృఢవ్రతుడు అనేక దానములు గావించియున్నాడు. కానీ లోకహితముమ మనమున

---

1. చంద్రాలోక సమున్మేషము, పు. 102

నుంచుకొనియును, శంకరుని/యుద్ధ/సాధనమునకు భంగము కల్గునని మేరుశైలమును, మైనాకుని రెక్కలకు హాని కలుగువని సముద్ర జలములను కుమారుడుదయించినప్పుడు దానములు చేయు సందర్భమున స్మరింపలేదు. మంచి కీర్తికలవారు సాధుజనుల రక్షణమునకు లోపము గలుగజేయుటకొప్పుకొనరు గదా!

మంచికీర్తిగలవారు సాధురక్షణ విలోపము చేయుట కోర్వరను నర్థాంతరమున దృఢవ్రతుడు హేమశైలరత్నాకరతోయములను దాన సందర్భమున దలపలేదను విషయమును సమర్థించుటచే నిది యర్థాంతరన్యాసమైనది.

5. సందేహాలంకారము :

"స్యాత్స్మృతిభ్రాంతి సందేహైస్తదకాలంకృతిత్రయమ్"[1]

సందేహము వ్యక్తమైనచో నది సందేహాలంకారమగును.

పద్మషండమ్ములం దొక్క పంకజాక్షి
మునిగి మోమెత్తియున్నచో ముగుదలెల్ల
కని వదనమంచు నది గాదు కమల మనుచు
నిశ్చయింపజాలక నిలిచి రపుడు 3-111

నీళయు సఖులును జలక్రీడలాడు సందర్భములోనిది పద్యము. ఒక యువతి పద్మవండమున మునిగి లేచి ముఖమును బైకెత్తినది. తక్కిన స్త్రీలందరు ముఖమని, కమలమని నిశ్చయింపలేకపోయిరి. ఇందు యువతి ముఖమని, కాదు కమలమనియు సందేహము వ్యక్తమగుటచే సందేహాలంకారము.

6. అతిశయోక్తి :

"సంబంధాతిశయోక్తిః స్యాత్తదయోగేయోగకల్పనమ్"[1]

---

1. చంద్రాలోక సమున్మేషము, పు. 28
2. అదే పు. 52

సంబంధము లేనిచోట సంబంధమున్నట్లు కల్పించినయెడల సంబంధాతిశయోక్తి యగును.

అడుగున బుట్టితీవు దివియందు జనించినదాననౌట నే
పొడవని గంగపల్క నరపుంగవు కీర్తివధూటి పల్కునా
నడుగున నీవు పుట్టితివి హస్తతలమ్మున బుట్టినట్టి నే
పొడవని యిట్లు సంగుదురు భూరి నభోంతరవీధి నిద్దరున్ 2-99

రఘునాథాచార్యుడీపద్యమున గులశేఖరుని కీర్తిని వర్ణించియున్నాడు. నీవు అడుగున/భూమిపై బుట్టితివి. నేను స్వర్గమున బుట్టితిని. కావున నేనే గొప్పదాననని గంగ వలుకగా నీవు ఖడుగున/కాలియందు/బుట్టితివి నేను హస్తతలమున జన్మించితిని. నేనేగొప్పదాననని కులశేఖరుని కీర్తివధూటి వలుకును. ఇట్టీ యిద్దరును నాకాశవీధిని ప్రసంగించుకొందురు.

ఇట కులశేఖరుని కీర్తివధూటికి, గంగకు సంభాషించుకొనుట యను సంబంబంధము లేకపోయినను నున్నట్లు పేర్కొనుటచే నతిశయోక్త్యలంకారము.

కవియగు రఘునాథాచార్యుడు కంఠోక్తిగా శ్లాఘింపక గంగా కీర్తివధూటుల సంభాషణరూపమున జమత్కారముగ బ్రబంధనాయకుడగు కులశేఖరుని గీర్తిని శ్లాఘించినాడు.

7. విషమాలంకారము :

"విషమం వర్ణ్యతే యత్రఘటనా ననురూపయోః"[1]

అనురూప్యములేని రెండింటికి సంబంధము వర్ణింపబడిన యెడల విషమాలంకారమగును.

రక్కసులజేడు తన పే
రుక్కున బలి గెలువబోయె నోహో తన యూ

1. చంద్రాలోకనమున్మేషము, పు. 116

రెక్కడ? సుతలంబెక్కడ
నక్కజమగుచున్న దిప్పుడది మది దలపన్ 2_151

ఇంద్రుడు తనపాట్లు శ్రీహరికి విన్నవించుకొను సందర్భములోనిదిది.

రావణుడు బలిని గెలువబోయినాడు. తన యూరెక్కడ? బలి నివాసమగు సుతలమెక్కడ? వాని యీ సాహసమును దలచుకొలది యాశ్చర్యమగుచున్నది.

ఇందు పరస్పర సంబంధరహితములగు రావణుని యూరునకు, సుతలమునకు సంబంధమును జెప్పుటచే విషమాలంకారము.

8. సారాలంకారము :

"ఉత్తరోత్తర ముత్కర్షస్సార ఇత్యభిధీయతే।"[1]

పూర్వపూర్వములకంటె ఉత్తరోత్తరములకు ఉత్కర్షను వర్ణించినయెడల అది సారాలంకారమగును.

మదికి నది పల్వలంబై
నదియై మున్నీటి తెఱంగునన్ బెంపైయు
న్నది మోహరసము నేనా
సుదతిన్ వరియించు తెఱగు జొప్పడ దనఘా! 3_184

ఈ పద్యమున రంగనాథుడు నీళాంగనాగతమైన తన మోహాతిశయమును నర్మసచివుడుగా నున్న గరుడునకు వివరించుచున్నాడు.

నా మనస్సున నీళాదేవిపైగల మోహరసము నీటిపడియయ్యె, నదియై, సముద్రమై పెంపొందియున్నది. ఆమెను వరించు మార్గము మాత్రము సమకూరుటలేదు.

ఇందు రంగనాథునకు నీళపైగల వలపు క్రమముగా పల్వలమై

---

1. చంద్రాలోక సమున్మేషము, పు. 143

మఱికొంత పెరిగినదియై, యంతకంటెను బెరిగి సముద్రమంతదైనట్లు త్తరోత్తరోత్కర్షను వర్ణించుటచే సారాలంకారము విలసిల్లుచున్నది.

9. స్వభావోక్త్యలంకారము :

"స్వభావోక్తిః స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్"[1]

జాత్యాదిస్థమైన స్వభావమును వర్ణించుట స్వభావోక్త్యలంకారమగును

కవి భయకౌతుకమ్ము లెసంగన్ వెనగ్రమ్మిన సమ్మదాశ్రువుల్
గమగవనిండ బర్వి తొనుకన్ గొలకుల్ నిలుపోవలేమి జ
య్యన నునుజెక్కులం బెరయ నంగకముల్ పులకింప రంగథా
ముని చరణాంబుజమ్ములకు మ్రొక్కె సరోజదళాక్షి గ్రక్కునన్
3–204

రంగనాథుని కడకేగిన నీలవేణిచేష్టాదికమిందు వర్ణింపబడినది. శ్రీరంగని జూచి భయము, కుతూహలము గలుగగా వెనువెంటనే సంతోషాశ్రువులు కనుగవనిండి కొలకులలో నిలువజాలక చెక్కులపై ప్రవహింపంగ నవయవములు పులకింపంగ నా సరోజదళాక్షి వెంటనే రంగనాథాముని చరణాంబుజములకు మ్రొక్కెను.

ఇందు పెద్దలను జూచినప్పటి పిన్నల సవినయచేష్టాదికము నీలవేణియందు సహజసుందరముగా వర్ణింపబడుటచే నిందు స్వభావో లంకారమున్నదని చెప్పవచ్చును.

10. శ్లేషాలంకారము :

"నానార్థ సంశ్రయః శ్లేషో వర్ణ్యావర్ణ్యో భయాశ్రితః"[2]

అనేకార్థముల నాశ్రయించుకొని యుండినయెడల శ్లేషాలంకారమగును

అకలుష జీవనమ్మున మహాసరసుల్ దనరార దూఱెదో
వికలముఖంబుగాగ నడవిన్ సుమనస్తతి గెంటద్రోచెదో

---

1. చంద్రాలోకనము ఉన్మేషము, పు. 218
2. అదే, పు. 85

ప్రకటరజోవికాసమున భాసిలు కొమ్మలం గౌగిలించెదో
అకటకటా మహత్తరుల కాకుల పాటొదవెన్ సమీరణా 7-15

స్వచ్ఛమైన జీవితమును గడుపు సరసహృదయులను నిందింతువా? ముఖముజు చిన్నవోగా మంచి మనస్సుగల వారినదవులకు గెంటెదవా? రజోభావముతోనున్న స్త్రీలను కౌగిలింతువా? నీవలన గొప్పవారలకు కష్టములు కలిగెను అని సమీరుని నిందించుటలో సామాన్యార్థము. అకలుషజీవనము, మహాసరసులు దూఱెదో, వికలముఖంబుగాగ, సుమ నస్తతి, రజోవికాసము కొమ్మలు, మహత్తరులు, అకులపాటు అను పదములకు గల యర్థాంతరముచే స్వచ్ఛమైన జలములుగల సరస్సు లలో ప్రవేశింతువు, అడవిలోని పువ్వులనెగురగొట్టుదువు, పుష్పాడిరేణువు లతో ప్రకాశించు చెట్టుకొమ్మల గౌగిలించుకొందువు నీవలన గొప్ప గొప్ప వృక్షములకు ఆకులు రాలిపోవుట కలిగినది అను వేరొక యర్థము సిద్ధించుచుండుటచే నిది శ్లేషాలంకారమునకుదాహరణము.

ఇట్లీతడు కడు చాకచాక్యముగా ననేకాలంకారములను గల్పించి తన ప్రబంధమునపూర్వాలంకార సంశోభితముగా నొనరించియున్నా ముఖ్యముగా నుపమాలంకార ప్రయోగమున నీతని చాతుర్యము విజ్ఞత ప్రశంసింపదగినవి. ఈతడుపయోగించిన యలంకారములన్నియు నప్రయత్నసిద్ధములుగా నుండి కావ్యశోభనినుమడింపజేసినవి.

7. శైలి :

కవి తాను చెప్పదలచిన విషయమును హృదయంగమముగా జెప్పవలసియుండును. చెప్పిన విషయమెంత యుదాత్తమైనదైనను జెప్పెడితీరు "ఆకర్షవంతముగ" లేకపోయిన శ్రోతల లేక పాఠకుల యంతరంగములు రసరంజితములు కాజాలవు. అందమైన భావములను సుందరమైనభాషలో బొందికయగుపద్ధతిలో ననుసంధించుట యుత్తమ

స్థాయి కవులకే సాధ్యమగు కళ. లలితములగు భావములు మంజుల మగు శైలిలో గూర్చబడినప్పుడు ఉజ్జ్వలమగు వజ్రము సువర్ణమున బొదగబడినట్లు శోభిల్లును. కావున గవి కావశ్యమగు కవితాసామగ్రిలో శైలిది యున్నతస్థాయి.

ఇట్టి మధురమనోజ్ఞశైలి రఘునాథాచార్యుని సొత్తు. అగాధమగు మేథావిలాసనము, దాని కీడగు భావగంభీర్యము, దానికి సాటియగు వర్ణనా వైదగ్ధ్యము, దాని కెనయగు శబ్దాధికారము, దానికి సరియగు నిర్మలధర్మకర్మాభిరతి, దానికిదీటగు మనోనిగ్రహము, నివియన్నియు రఘునాథాచార్యునియందు మూర్తీభవించినవి. నిరర్గళ ధారాసం శోభిత మృదుమనోహర శైలియా మూర్తికి బ్రాణముపోసినది. దీనితో రఘునాథాచార్యుని కమ్రకమనీయ కవితావనితామతల్లి సహృదయ హృదయతంత్రులను సరసముగా మీటి బ్రహ్మానందబ్రహ్మచారియగు సాహిత్యానందమున నోలలాడింపజేసినది. రససిద్ధుడగు నీ కవివరేణ్యుని మంజులవాణీవిలాసములు నిజముగా మంజుల వాణీవిలాసములే. ఇట్లు రఘునాథుని కవితా సౌందర్యమునకు బ్రాణస్థానీయమైన శైలిని బరిశీలింతము.

కృత్యాదిని రఘునాథాచార్యుడు దాను "మిశ్రకవితావిశేషాను బంధము" గా వింపదలచినట్లు పేర్కొనియున్నాడు/1–14/ ఇందాతడు నిర్దేశించిన మాశ్రమకవితా విశేషానుబంధమననేమియో తెలిసికొనవలసి యున్నది. కలలో గాన్పించిన శ్రీరామచంద్రుడు కవితో బలికిన వలుకులలో దీనికి గొంత వివరణ కాన్పించుచున్నది.

శ్రీరాముడు రఘునాథాచార్యునితో—

ఆంధ్రగీర్వాణ మిశ్ర పద్యాంతరముల

గృతి వినిర్మింపు మాకు నంకితముగాగ  1-17

అని యాదేశించియున్నాడు. రఘునాథాచార్యుని తలపు హృదయ మెఱిగి వచ్చిన రఘురాముని పనుపు నొక్కవిధముగా నున్నవి. మొత్తముమీద నీరెంటిభావము సంస్కృతాంధ్రభాషల కలయికతో గూడిన భాషలో గవితను వెలయించుటయై యున్నట్లు గోచరించు చున్నది. కాని సంస్కృతాంధ్రములను గలిపిన భాషలో వ్రాయుటలో విశేషమేమియు గాన్పింపదు. కావున సరసముగా సంస్కృతాంధ్రముల మేళవించి సుందరశైలీశోభితముగా రచన సాగించుటయే దీనిభావము కావచ్చును. పరిశీలించి చూడగా నిట్టి సంస్కృతాంధ్ర సుభగసమ్మే ళనము కులశేఖరమహీపాల చరిత్రమున సర్వేసర్వత్ర గోచరించు చున్నది.

దృఢవ్రతుడు తన యెదుట సాక్షాత్కరించిన శ్రీహరిని స్తుతించు సందర్భమున వ్రాయబడిన యీ క్రిందిపద్యమున సంస్కృతాంధ్ర ముల సంసన మ్మేళనముతోబాటు లాలిత్యము పోషింపబడినది.

అనిలాన్నవన్యాశనాంగ మానసశయ్యు
    లొక నిద్ర యొక నీద్ర నొనరు ముద్ర
కమలకైరవలబ్ధ కల్యాణదైవమ్ము
    లొకకంట నొకకంట నొనరి యుంట
నరి శిరశ్ఛ్రవణ దారాయుధశ్రేష్ఠమ్ము
    లొకకేల నొకకేల నొనరులీల
క్షాంతి సంపత్పూర్ణ కాంతామలాలమ్ము
    లొకత్రేవ నొకత్రేవ నొనరఠేవ
వంక మడగింప లోకమ్ము లంకురింప
జేయగల యాడు మొగపావ లాయితముగ

దగ నడుగు దమ్మి పొక్కిటిదమ్మి బొడము
మహిమ నీయందె చెన్నొందె మధువిరోధి — 2-53

నీళావృత్తాంతమును దెలువ వచ్చిన నీలవేణితో రంగనాథుని పలుకులు -

ఎందు వసించునవిట కీగతి రాబనియేమి కుందమా
కంద మధూక చంపక వికస్వరవాసన విందుగోరి నీ
విందు జరించెదొక్కొ! మఱి యింకొక కార్యభరమ్ముపూని యీ
చందము నన్మెలంగెదవా చంద్రముఖీ! భయమందినేటికిన్
—3-206

వివాహమంటపమునకు నీళను గొనిపోవచ్చిన చెలు లామెతో ననిన మాటలు –

మఱి మఱి మాలతీ సుమసమాన శరీరిణి! మంజుభాషిణీ!
కుతుకమెలర్ప లోకముల కుం బతి నీపతియయ్యె, నయ్యె నీ
కతిహితమాచరించె సముదంచితమయ్యె విరించి లేఖము
వ్రతమునందు నిమ్ము నింక నాతని నేంచెదవమ్మ కొమ్మలన్
—4-134

ఇట్లే పద్యమును జూచినను పరసముగా సంస్కృతాంధ్రముల మేళవించి శ్రవణసుఖము నిచ్చునట్టి యమరికతో రఘునాథాచార్యుని శైలి పరితల నాకర్షించును.

సామాన్యముగా సంస్కృతాంధ్రముల జోడించి రచన సాగించినను సందర్భమునుబట్టి యీతండచ్చతెనుగునను సంస్కృతపదభూయిష్ఠము గను దన కవితను వెలయించుచుండును.

హరిణీవృత్తాంతమున గరుణరసనిర్భర సన్నివేశమున నధికముగా నచ్చతెనుగు పదములతో జీవద్భాషాలక్షణమగు చక్కని నుడికారముతో రచన సాగింపబడినది.

తెల తెల వేగు నంతనె యతిశ్వర గైకొని మేలుకాంచి ని
ర్మల ము ఖమార్జనాదుల సమంజసనై గృహశుద్ధి మున్నుగా
నలవొనరించి శాకములు నన్నము డింపగ నిద్రిదేశీ యొ
త్తిలి గిళమెత్తి యత్తనను దిట్టుమ గూతలు తోడుపల్కగన్
-1-103

హరిటి యత్తవారింట దాబడిన పాట్లను వర్ణించుఘట్టములోనిదీ
పద్యము. ఆసందర్భమునందలిదే మఱియొక పద్యము-

మూడుజాము లరుగ ముంగేల నన్నము
నెట్టిసనుచు నాల్గుదిట్టి దీని
తిండివలన నమసెగుండ కూడంతయు
ననుచు విధిజనులు వినగ నాడు - 1-104

మఱికచో సంస్కృతభూయిష్ఠమైన శైలిలో నీకడు రచించిన
పద్యములు కడుంగడు హృద్యములు.

వేట నుండి దృఢవ్రతుడు మరలి యింటికిబోవు సందర్భములోని
పద్యమిది-

అనృపుడాదరించె బునరాగను నావసరాగతాంబు శే
లానిరతామరీకుచమిళద్ఘనసారపటీర పాళికా
పేనిల సహ్యజాసలిల పేశలబిందు పయోజగంధ ప
న్నానిత శైత్యమాంద్య లసమాన విహారసమీర డింభమున్
-1-163

రావణుని యౌద్ధత్యమును వర్ణించుపట్టునరచింపబడిన పద్యమిది-
తూలెన్ గైలాస మత్యద్భుత శిఖరశిఖాందోళనధ్వాన కువ్య
ద్వ్యాళీనిశ్వాసధూమ వ్యతికర కుహనావారిదభ్రాంతచేతః
ఖేల త్తద్భర్తృకేకాకృత గుహవదకేకి వ్రతిధ్వానమై ద
ర్వ్యాలీఢానేక లోకోద్యమ దశవదనోద్యద్భుజోత్సాహశక్తిన్ -2-129

ఈ పద్య మోజోగుణవిశిష్టమై సంస్కృతపదయుక్తమై సాగినది.

ఇట్లు రఘునాథుని శైలి సంస్కృతాంధ్రపదసమ్మిశ్రితమై యుండియు, కేవలాంధ్రపదములతో గాని కేవలము సంస్కృతమువ గాని సందర్భమునుబట్టి ధారాళముగా సాగిపోవును. సంస్కృతపదము లైనను, దెనుగు పదములైనను మృదుమధురములై యర్థము సులభ గ్రాహ్యమై యుండి రఘునాథుని కవితాశైలి సౌందర్యశోభితమై యొప్పారుచున్నది.

8. విశిష్టాద్వైత సంప్రదాయపాలనము

అ, రఘునాథాచార్యుని విశిష్టాద్వైతమత సంప్రదాయభిజ్ఞత :

రఘునాథాచార్యుడు విశిష్టాద్వైత మతస్థుడు కేవల మామతస్థు డగుటయేగాక తన్మత సంప్రదాయవేత్త. ఈతని పినతమ్ముడగు చెన్న 'భట్టరు అమలవైష్ణవరహస్యార్థవేది' అని యీతనిని గీర్తించియున్నాడు నిజ జీవితము నందును రఘునాథాచార్యుడు వైష్ణవసంప్రదాయ పరి పాలనా తత్పరుడుగా గోచరించు చున్నాడు. చిరంతనప్రపన్నచరితము ను, వ్రాయవలయు ననిన యాతని కాంక్ష,యద్దానిని 'భగవదర్పితము' చేయవలయు ననిన బలీయమగు నాకాంక్షయు, సత్కవులు 'భగవదర్పి తమైన కావ్యరసమునే మెత్తురు' అను నాతని దృఢవిశ్వాసమును నిందు లకు నిదర్శనములు.

వీని కన్నింటికి దోడు శ్రీరామచంద్రుడు కలలో గాన్పించి పరమ పురుషార్థవేత్తలగు భాగవతోత్తములం గీర్తించుట కీర్తికరంబును మదీయ కైంకర్యవిశేషంబు నగు, నని యానతిచ్చినాడు. ఈతడు సంతోషముతో 'లోజిక్కిన భక్తి' శ్రీరామమూర్తికి దన కృతి నర్పణము జేయదలచినాడు ఇట్టి యీ సుకృతికృతమైన యేతత్ప్రకృతి విశిష్టా ద్వైతసంప్రదాయ సౌరభములతో శోభిల్లుటలో వింత యేమి?

ఈతడు సంప్రదాయాభిజ్ఞుడేకాక సంప్రదాయబద్ధుడు కూడ లక్ష్మణమునీంద్ర విమలపదాబ్జంబులు శరణంబని నమ్మితి, ననియు తనకు 'భాగవతార్చనాభిలాషం బధికమ' నియు చెప్పుకొనియున్నాడు

2. ఇతివృత్తస్వీకరణము :

రఘునాథాచార్యుడు చేపట్టిన యితివృత్తము ఈతని విశిష్టాద్వైత మతమువల్ల యభిమానమునకు ద్యోతకము. పరమ భాగవతశిఖామణియై విశిష్టాద్వైతమత సిద్ధాంతప్రవక్త యగు భగవద్రామానుజునకు మార్గ దర్శకులగు వన్నిద్దరాళ్వారులలో నొక్కరగు శ్రీకులశేఖరుల జీవితచరిత్ర నీతడు ప్రబంధీకరింప దలచుటయే తన్మత ప్రబోధమువల్ల నీతనికి గల తాత్పర్యమును వెల్లడించుచున్నది. శ్రీకులశేఖరుల జీవితము అడుగ డుగున శ్రీవైష్ణవ సంప్రదాయాచారణమే. అట్టి వారి జీవితము నితి వృత్తముగా గొనిన 'కులశేఖరమహీపాలచరిత్రము' అద్యంతము విశి ష్టాద్వైత సంస్కారపురస్కృతమై సొబగులీనుచున్నది.

3. భాగవతప్రాధాన్యమును వెల్లడించుట :

ప్రబంధము దృఢవ్రతుని వృత్తాంతముతో బ్రారంభమైనది. అతని రాజ్యపాలనము, వేట కేగుట, హరిణి రాజు ననపత్యత నెంచి చూపుట, మరతుల మాటపై దృఢవ్రతుడు శ్రీ భాగవతులకు దన యన పత్యతను విన్నవించుకొని సంతానభాగ్యము కలుగు నుపాయము తెలుపుడని ప్రార్థించుట, వారి యాదేశానుసారము మాధవారాధన దీక్షితు డగుట, శ్రీవిష్ణుమూర్తి ప్రత్యక్షమై పుత్రుడు కలున్ననుగ్రహించుట యను నంశములు కథా ప్రారంభముననే ప్రసక్తములైనవి. ఇవ న్నియు రఘునాథాచార్యుని కల్పనలే. ఏ యితర సంప్రదాయచరిత్ర గ్రంథము లందును లేని కథాంశముల నీతడిట్లు స్వోపజ్ఞతో సృష్టించి యున్నాడు. అళ్వారుగా బ్రఖ్యాతి బొందనున్న కులశేఖరుల జన్మ వృత్తాంతమునకు బవిత్రతను, అతని వంశమునను విశిష్టాద్వైతమత

సంబంధమును సాధించుటలో నీ కల్పనలు సార్థకములైనవి. ప్రబంధ ప్రారంభముననే కుక్కుటకూటపుర వర్ణనలో భాగవతులు వర్ణనగావించి దృఢవ్రతునకు భాగవతుల పట్ల గల భక్తిని బీజరూపముగా సూచించి యున్నాడు. కుక్కుటకూటపురము నందు-

భుజమూలముల జతుర్భుజసాధనములైన
ఘన శంఖచక్రలాంఛనము లమర
రసనాంచలముల నారాయణద్వయమంత్ర
లలితాక్షరమ్ములు చెలిమిదెలుప
మనముల నుపనిషద్వనధి ప్రమథన ని
ష్కృష్టతత్త్వామృతసేవ దనర
నల్లాపములు విష్ణుచర్యాతదీయ పూ
జావిశేష ప్రపంచన మెసంగ

మహితసౌరభనళినాక్షమాలికా స్ఫు
రద్గళమ్ముల నూర్ధ్వపుండ్రప్రదీప్త
ఫాలముల సొంపుదొల్తు రప్పట్టనమున
బరమ వైదికులగు మహాభాగవతులు![1]

అని భాగవతుల వర్ణన గావించి యటుపై వారలలోగిళ్లను- 'దళమగు వాసుదేవ పరతత్త్వనిబంధనవాదఘోషణములతో, హరిపూజనక్రమ నిబోధన మంత్రరవములతో నిర్మలములై యయ్యగార్ల తిరుమాళిగ లొప్పునని, వర్ణించి యున్నాడు.[2] ఇట్లు పురవర్ణన గావించుటలో భాగముగ శ్రీవైష్ణవుల వర్ణన గావించుటచే దృఢవ్రతుని పాలనలో భాగవతులకు గల ప్రాముఖ్యము వెల్లడియైా దృఢవ్రతుని భాగవతజనానురక్తి వ్యక్తము చేయబడినది. దృఢవ్రతుడు తనకు గల్గిన యనపత్యతను

---

1. కు. మ. చ.—1-47
2. అదే, 1-48

నివారించుకొనుటకు శ్రీమహాభాగవతుల నాశ్రయించుటయందే వార లపై నారాజునకు గల యనన్యసామాన్య భక్తిప్రత్యయములు విశద మగు చున్నవి. హరిచిచే దృఢవ్రతుని–

పోషించితివిగదా! పుణ్యతత్త్వజ్ఞాన
　　పరిణామయుత మహాభాగవతుల

అని కీర్తింపజేసినవాడు రఘునాథాచార్యుడు.

రాజుహృదయము నెఱిగిన మంత్రులు–

మంచి దింతట నేమయ్యె మనుజనాథ!
మన పురంబున కేగి పమ్మదము మిగుల
బ్రహ్మవిదులైన శ్రీమహాభాగతుల
నడిగి వారల యానతి నడువవలయు2

అని పేర్కొనుటలో దృఢవ్రతుని యేలుబడిలో శ్రీవైష్ణవులకు గల ప్రాబల్యము వ్యక్తమగుచున్నది. రాజప్రార్థనమున సభకు విచ్చేసిన భాగవతుల రూపములను శ్రీవిశిష్టాద్వైత సంప్రదాయస్ఫూర్తితో రఘునాథాచార్యుడు చిత్రించి యున్నాడు–

సుషమ పారాశర్యసూత్ర తత్త్వవివేక
　　పరిణామ మేథానుభావయుతులు
భూతకాసారాది పూర్వపుణ్యశ్లోక
　　జల్పిత ద్రవిడవాక్ప్రచుర మతుల
ఘన మనః కీలితాకార త్రయార్థని

---

1. కు. మ. చ.–1–128
2. అదే 1–161

ష్టాత్యంతరసిక సాంగత్యమతులు
నశ్రాంతకృత తదీయారాధనార్థ న
త్కర్మనిర్మిత యశశ్శర్మగతులు

పరమ పురుషానుమతులు శ్రీభాగవతులు
నిజనిలయభాగ వేదికానిష్ఠ అగుచు
బలసి సద్గోష్ఠి సేయుచో బార్థివేంద్ర
భటులు గాంచిరి కన్నులపండువుగను[1]

ఈ పద్యమును విశిష్టాద్వైతమత సంప్రదాయము తెలుగనివాడు వ్రాయుట సాధ్యము కాదు.

ఈ సందర్భముననే యీతడు భాగవతులను-ఇచ్ఛాహార పాత్ జాతములన - సౌజన్యగుణప్రపన్నముఖులని - ఆర్యజనాగ్రగణ్యులని పేర్కొనియున్నాడు. ఆ తరువాత దృఢవ్రతునిచే జేయించిన భాగవత ప్రశంసయు విశిష్టాద్వైతమత సంప్రదాయబద్ధమై యొప్పారుచున్నది,

శ్రీహరిపాదపద్మతులసీదళతీర్థ రసజ్ఞు లజ్ఞహృ
న్మోహ నివర్తకుల్ భవ విమోచను లాశ్రితమోక్షలాభ ని
ర్వాహులు రోషలోభ మదరాగ వివర్జితు లూర్జితక్రియో
త్సాహులు నైన మిమ్ము బ్రిమదంబున గొల్తురు ధన్యులెల్లెడన్[2]

అంతియగాక గంగ భవబంధమెడలించును. చంద్రుడు తను తాపముడిగించును. కల్పశాఖి దారిద్ర్యమడగించును. అమృతధార యను మృత్యువు నడచును. ఈ గుణము లన్నియు నార్ధికన్యాప్రియో రుచరిత ఘన సుధాస్వాదవిదళితకలుషపాశవేష్టలైన[3] శ్రీవైష్ణవుల యందే

1. కు. మ. చ. 2-3
2. అదే. 2-10
. అదే, 2-11

యుండు ననియు-వారి వంటి ధన్యులెందును లేరనియు ధృడవ్రతునిచే బలికించి యాతనికి వారిపట్ల గల దృఢవిశ్వాసమును బ్రకటింపజేసి యున్నాడు.

భాగవతపూజనమే విశిష్టాద్వైతమత సంప్రదాయమున శత్యుత్తమము ఈ భాగవతవైశిష్ట్యమునే తన్ను దర్శింపవచ్చిన శ్రీభక్తిసారులను పేరు గల యోగీంద్రునితో గులశేఖరులు పలికిన-

.... ... .... రమామనోహర
శ్రీయుత దివ్యమూర్తి మదిజేర్చి భజించు మహానుభావులే
చాయకు వచ్చునన్ గలుపసంఘము వాయుట తథ్యమెన్నగన్[1]

అను పలుకులలోను :

సంసృతి విపినము వెడలగ
సంసరణంబెట్లు దొరకు జడులకు భగవ
త్సంసత్ప్రియులగు యుష్మ
త్సంసర్గము లేకయున్న ధన్యవిచారా![2]

అను పలుకుల యందును జక్కగ వ్యక్తము చేసినాడు కవి.

మంత్రుల యాజ్ఞచే ద్వారపాలకులు శ్రీవైష్ణవుల నంతఃపురము వెలుపలనే నిలిపివేయగా నెఱిగిన కులశేఖరులు స్వయముగా బాద చారులై వచ్చి-

దాసుని యిలు దొక్కక యే
జేసిన యపరాధ మెఱుగజెప్పక కరుణా

1. కు. మ. చ. - 2-105
2. అదే, 2-108

భాసుర హృదయులు మీ రా
యాసం పడదగునె యెండ నలమట దోపన్1

అని చేసిన ప్రార్థనము నందు పరమభాగవతభక్తి వ్యక్త మగు టయేగాక 'దాసుని' అను పట్ల శ్రీవైష్ణవమత సంప్రదాయము ప్రకాశ మానమగుచున్నది. శ్రీవైష్ణవుడు తన్ను గూర్చి భాగవతదాసునిగా పేర్కొనుట సంప్రదాయము.

కులశేఖరాళ్వారు తమ ముకుందమాలలో-

మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే
మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏవఏవః
త్వద్భృత్యభృత్య పరిచారకభృత్య భృత్య
భృత్యస్య భృత్య ఇతిమాంస్మర లోకనాథః2

/ఓ మధుకైటభారీ! లోకనాథ! నీ దాసపరంపరలో గట్టకడపటి వానిగా నన్ను భావింపుము. ఇదియే నా జన్మకు ఫలితము. ఇదియే నా ప్రార్థనము. ఇదియే నాపై నీవు చూపవలసిన యనుగ్రహము/

అని భాగవతదాసునిగా దన్ను గుర్తింపగోరియున్నాడు. ఈ సాంప్రదాయమునే తన ప్రబంధమున గులశేఖరుల పలుకులలో నిక్షేపించియున్నాడు. రఘునాథాచార్యుడు.

మంత్రులు శ్రీవైష్ణవులపై జౌర్యము నారోపింపగా గులశేఖరులు పాముల ముట్టిన' సన్నివేశములో భాగవతజనప్రభావము-విశిష్టాద్వైత మతమున భాగవతులకు గల ప్రాధాన్యము సమర్థింపబడినది.

కులశేఖరులు మంత్రులతో బలికిన-

---

1. కు. మ. చ. - 3-49,
2. ముకుందమాల, 27 శ్లో.

జలరుహపత్రిలోచనుడు సర్వజత్పతి. వైష్ణవోత్తముల్
దలవదదీయ పుత్రులుగదా! ధరగల్గు ధనంబులెల్ల వా
రల వినిగైకొనందగుదు రట్టి దెఱింగి యింకేల పెక్కు భా
షలు భగవత్ప్రపన్నులకు జౌర్యములేదని పాము ముట్టెడన్.[1]

అను వల్కులలో భగవత్ప్రపన్నులపై ననన్యప్రగాఢమగు విశ్వాసము ప్రస్ఫుటము చేయబడినది.

కులశేఖరాళ్వారు తమ దివ్యప్రబంధమగు 'పెరుమాళ్ తిరుమొళి' యందు ద్వితీయదశమున మొత్తము పాశురము లందు భాగవతుల బ్రస్తుతించి యున్నారు. అందు ముఖ్యముగ భాగవతుల గోష్ఠిదర్శన భాగ్యము నేత్రసాఫల్యమును గల్గించును.[2] భక్తుల పాదపద్మరజో స్నానమే గంగాస్నానమున కంటె మిన్న.[3] పరమభాగవతుల పాదాబ్జముల కంటిన పంకమును నేను తిలకముగా ధరింతును.[4] భాగవతుల ధ్యానించి, స్మరించి నా మనసు హర్షప్రకర్షవివశమగుచున్నది.[5] భాగవతుల యందే నా మనసు జన్మజన్మముల యందును ప్రేమగలిగి యుండును[6] అని యెలుగెత్తి విష్ణుభక్త ప్రాబల్యము చాటబడినది. ఏతత్సంప్రదాయాను సారమే రఘునాథాచార్యుడు కులశేఖరుల భాగవతగత భవ్య భక్తిభావ భరితత్వమును బ్రకటించి యున్నాడు.

1. కు. మ. చ.–4–79
2. పెరుమాళ్ తిరుమొళి 2వ దశకము, 1వ పాశురము
3. అదే, 2వ పాశురము
4. అదే, 3వ పాశురము
5. అదే, 4, 5 పాశురము
6. పెరుమాళ్ తిరుమొళి 2వ దశకము 6వ పాశురము

భగవద్భక్తులు భాగవతులు. వారిపట్ల చూపవలసిన గౌరవ భావమును కులశేఖరుల ప్రవర్తనద్వారమునగవి వెల్లడించి యున్నాడు అంతటితో తృప్తి జెందలేదు. భాగవతుల యోగ్యతను గథాముఖమున్న జమత్కారముగా వ్యంగ్యరీతి నావిష్కరించియున్నాడు - ప్రాజ్ఞుడైన రఘునాథాచార్యుడు.

మంత్రులు శ్రీవైష్ణవులను ద్వారపాలకులచే నిరోధింపజేసినారు. ఆ ద్వారపాలకుల యనుచితచర్యకు గ్రుద్ధుడైన కులశేఖరుడు వారలను 'ఖండీభూతుల జేయుడంచు' ఆజ్ఞాపించినాడు. కాని భాగవతు లడ్డుపడి- 'వలదు వలదిట్టి కార్యమ్ము వసుమతీశ!' అనియాతని ప్రయత్న మును మాన్పించినారు. తమపట్ల నపచారము గావించిన భటుల యెడ శ్రీవైష్ణవులు కనబరచిన కరుణ పరమభాభావతలక్షణము.

4. భక్తితత్త్వ ప్రకటనము :

విశిష్టాద్వైతమత సిద్ధాంతమునకు సారభూతముగా భగవద్రామానుజులచే బ్రసాదింపబడిన గద్యత్రయమున నొకటగు 'శరణాగతి గద్య'లో-

పురుషస్సపరః పార్థ భక్త్యాలభ్యస్త్వనన్యయా।
భక్త్యాత్వనన్యయాశక్యః
మద్భక్తిం లభతేపరామ్।

ఇతి స్థానత్రయోదిత పరమభక్తియుక్తం మాకురుష్వ. పరభక్తి పరజ్ఞాన పరమభక్త్యైక స్వభావం మాం కురుష్వ.

1. కు. మ. చ.—3-44

అని భగవద్గీతలో గీతాచార్యుడు భక్తిని గూర్చి తెలిపించిన ప్రసంగమును గుర్తుచేయుచున్నట్టి భక్తివిశేషమును గలవానినిగా జేయుమని భగవంతుని ప్రార్థించియున్నారు.

అట్టి భక్తిని గూర్చియు దాని ప్రాశస్త్యమును గూర్చియు భాగవతులచే దృఢవ్రతునకు బోధింపజేయుచు—

హరులచే గరులచే నరుల గెల్వదరంబె
చక్రపాణి సహాయశక్తి లేక
కలిమిచే బలిమిచే గులము బెంపదరంబె
రాక్షసాంతకు దయారసములేక
సతులచే సుతులచే సుతులకెక్కదరంబె
శౌరి కటాక్షవీక్షములేక
జపముచే దపముచే సువరమింపదరంబె
కనకచేలుని యనుగ్రహములేక

మానవేశ్వర! యమ్మహామహుని కరుణ
కలుగదేని గలుగునే! ఘనులకైన
నైహికాముష్మిక సుఖము లతని నాత్మ
దెలిసి కీర్తించి నీకోర్కె దీర్చుకొనుము[1]

అని యనవత్యత తొలగిపోవుటకు విష్ణువును ప్రార్థింపుమని సూచించియున్నారు. ఈ సందర్భముననే భాగవతులచే రఘునాథాచార్యుడు-

1. కు. మ. చ.—2-24

జరాజర్ఝరీభూత పర్వాంగయష్టిన్
•తిన్
నతుల్ బుద్ధిజాడ్యమ్మునం జొక్కువేళన్
మురారాతి నేరీతి బూజింతు రాత్మన్[1]

అని పలికించియున్నాడు. ఈ పద్యము కులశేఖరకృతమును, విశిష్టా ద్వైతమత సంప్రదాయ సర్వసంగ్రహమనదగిన ముకుందమాలలోని.

కృష్ణ! త్వదీయ పదపంకజ పంజరాంత
మద్యైవ మే విశతు మానసరాజహంసః ॥
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే ॥[2]

/ప్రాణప్రయాణ సమయమున గఫవాతపిత్తములచే గంఠావరోధము కలుగగా నీ స్మరణచేయుట సాధ్యమా? కావున నీ పాదాబ్జములనెడు పంజరమునందు నా మనస్సనెడు రాజహంస యిప్పుడే ప్రవేశించును గాక! అను శ్లోకభావమునకు ననువాదప్రాయమైనది.

భాగవతులనపత్యత్వ దోషనివారణోపాయముగా దృఢవ్రతున కుపదేశించిన మాధవారాధన విధానము శ్రీవైష్ణవులకు విహితమైన దిన చర్యాక్రమమే,

నుడువు మచ్యుత నామముల్ విడువు మితర
తంత్రముల్ విష్ణుచరితామృత ప్రసక్తి
దడవు మిహపరసౌఖ్య సందర్భనిరతి
నడువు మవనీశ! వేయు ననంగనేల[3]

1. కు.మ.చ. 2-28
2. ముకుందమాల, 7 శ్లో.
3. కు.మ.చ. 2-32

ఇందు జెర్కొనబడిన విష్ణునామ స్మరణము, సర్వేతర ధర్మపరిత్యాగము విష్ణుచరితామృత ప్రసక్తి, ఇహపరసౌఖ్యసందర్భనిరతి–ఇవియన్నియు శ్రీవైష్ణవుల కవశ్యాచరణీయములుగా ప్రసిద్ధమైన ధర్మములే. శ్రీకుల శేఖరులు తమ ముకుందమాలలో నీ ధర్మములను సువిదితముగా విస్త రించియున్నారు.

.... అవిస్మృతి స్త్వచ్చరణారవిందే
భవే భవే మేస్తు భవత్ప్రసాదాత్ – 3 శ్లో.

/ప్రతి జన్మమునందును నీ పాదారవిందములయందు మరపులేకుండుట నీ ప్రసాదమువ నగుగాక/

.... .... .... ....

త్వత్పాదాంభోరుహ యుగగతా నిశ్చలాభక్తిరస్తు – 5 శ్లో.

/జన్మాంతరములయందు సైతము నీపాదకమలయుగళమందు నిశ్చల మైన భక్తి సంధిల్లునుగాక/

చింతయామి హరిమేవ సంతతమ్ – 8 శ్లో.

/శ్రీహరినే నేను సతతము ధ్యానింతును/

.... సుఖతర మపరన్న జాతు జానే
హరిచరణ స్మరణామృతేన తుల్యమ్ –10 శ్లో.

శ్రీహరిపాదస్మరణామృతముతోసాటియగుసుఖమును నేనెన్నడెఱుగను

.... .... ....

నిత్యం త్వచ్చరణారవింద యుగళ ధ్యానామృతాస్వాదినా

మస్మాకం సరసీరుహాక్ష సతతం సంపద్యతాం జీవితమ్ 20 శ్లో

/నీచరణారవింద ధ్యానామృతము నాస్వాదించు నస్మదాదుల జీవితము సదా యీరీతిగనే సాగునట్లనుగ్రహింపుము/

....హేగోపీజననాథా! పాలయ పరం జానామి నత్వాంవినా 21శ్లో

/ఓ కృష్ణా! రక్షింపుము. నిన్నుదప్ప యే ఇతర దైవమును నెఱుంగను

ఇత్యాది వాక్యములచే ప్రపంచింపబడినభావములే మాధవారాధన విధానముగా రఘునాథాచార్యునిచే నిర్దేశింపబడినవి. దీని ననుసరించి కులశేఖరుల జీవనవిధానమును వర్ణింపబడినది.

ప్రకృతిభిన్నస్వాత్మ పరమాత్మసాంగత్య
మొకటియం దొకటిగా నుడువవలయు
స్తవ పూజానాహ్లాద తాత్పర్యశీలమ్ము
లొకటియం దొకటిగా నుడుపవలయు
భవ్యకర్మ జ్ఞానభక్తియోగమ్ముల
నొకటిపై నొకటిగా నూదవలయు
నల మనోబుద్ధిచిత్తాహం క్రియా వృత్తు
లొకటిచే నొకటిగా నుడుపవలయు
వలయు నీకింక నొక్కటి వనజనాథ!
చరణకంజాత మంజుల సౌరభాను
భవ రసిక భాగవత జనావచితి యిదియె
మాధవారాధనప్రౌఢి మనుజనాథ![1]

అనువద్యము విశిష్టాద్వైతమతమున భక్తితత్త్వమునకు గల మహత్త్వమును వెల్లడించును రఘునాథాచార్యుని శ్రీవైష్ణవ సంప్రదాయ పరిజ్ఞానపాలనమును ప్రస్ఫుటీకరించుచున్నది. ఇందులకు గట్టకడపట పేర్కొనబడిన "వనజనాథ చరణంజాత మంజుల సౌరభానుభవరసిక భాగవతజనావచితి" భావికాలమున గులశేఖరులయందు మూర్తిభవించినది.

5. భగవంతుని దివ్యమంగళవిగ్రహ వర్ణనము :

విశిష్టాద్వైతమతమున శ్రియఃపతియే పరమదైవము. అతని

1. కు.మ.చ. ౨-౩౭

దివ్యమంగళ స్వరూప సందర్శనతన్నామ సంస్తుతులే విధాయకము లైనవిధులు. కులశేఖరాళ్వారు తమ ముకుందమాలలో "కృష్ణంలోకయ లోచనద్వయ"[1] అని తన కన్నులను నిత్యమచ్యుతస్వరూప సందర్శనమునందే లగ్నమైయుండుటకు నియమించియున్నారు. వారు తమ పెరుమాళ్‌తిరుమొళియందుసైతము సందర్భానుసార మాయాచోటుల విష్ణుస్వరూపమును సంపూర్ణముగ వర్ణించి ధన్యులైనారు. భగవద్రామానుజులు తమ "శ్రీవైకుంఠగద్య"యందు శ్రీవిష్ణుదేవునిదివ్యమంగళ విగ్రహమును సంపూర్ణముగా వర్ణించియున్నారు.

రఘునాథాచార్యులు సైతము పూర్వాచార్యులు చూపిన మార్గమున దన ప్రబంధమున నైదుమారులు విష్ణుసాక్షాత్కారమును వర్ణించి యున్నాడు. ఇట్లిన్ని పర్యాయములు భగవత్సాక్షాత్కారము మఱే యితరాంధ్ర ప్రబంధమునందును గానరాదు. ఇది కవికిగల భక్త్యావేశమును, ప్రగాఢమగు భగవత్సందర్శనేచ్ఛను జాటుచున్నది. కవి తన మననునగల శ్రీమన్నారాయణుని దర్శింపవలయునను నాకాంక్ష బలీయముకాగా దర్శనేచ్ఛా తీవ్రతను దన ప్రబంధముద్వారమున దీర్చుకొనినాడు.

విష్ణువు సాక్షాత్కరించిన యైదు సందర్భములలో నొకటి ప్రబంధ రచనా కుతూహలియై యున్న కవికి శ్రీరాముడు సాక్షాత్కరించుట, రెండవది దృఢవ్రతుని మాధవారాధన వ్రతదీక్షకుమెచ్చి సాక్షాత్కరించి విష్ణువు స్వరూపము. మూడవది రావణుని దుశ్చేష్టితములు విన్నవించు కొనుటకు జతుర్ముఖపురస్సరులై యింద్రప్రముఖ దేవతలు పాలకడలి కడ బ్రార్థింపగా విష్ణువు సాక్షాత్కరించినప్పటి రూపము. నాలుగవది సీతాపహరణ వృత్తాంతమునువిని రావణునిపై దండెత్తదలచిసముద్రము లోనికి బోవుచున్న కులశేఖరుల కెదురుగ సాక్షాత్కరించిన రాముని

---

1. ముకుందమాల, 16 శ్లో.

స్వరూపము. ఐదవది వైష్ణవులకు జౌర్యదోషము లేదని కులశేఖరులు పాముడు ముట్టగా మెచ్చి విష్ణువు రంగనాథుడుగా సాక్షాత్కరించిన రూపము.

ఇన్నిమారులు విష్ణుసాక్షాత్కారమును వర్ణించుటతోడ తృప్తి జెందక మఱి నాలుగు తావులందు సైతము శ్రీమహావిష్ణుని సంపూర్ణ స్వరూపమును రఘునాథాచార్యుడు దివ్యముగా వర్ణించినాడు. నీళా విరహ దుఃఖమును రంగనాథున కెఱిగించుటకై వెడలిన నీలవేణి చూచిన యాతని స్వరూపమును గవి వర్ణించియున్నాడు. ఈ నీలవేణి రంగనాథుని యొద్దనుండి నీళ కడకేగి తాను జూచిన రంగనాథుని స్వరూపమును మరల వర్ణించును. నీళాదేవిని బరిణయమాడుటకు దరలి వచ్చిన రంగనాథుని రూపమును హృద్యముగ గవి వర్ణించియున్నాడు వివాహానంతరము పెండ్లికి వచ్చిన యార్యులు తన్ను కొలిచియుండగా నున్న శ్రీరంగనాథుని స్వరూపమును గవి యభినివేశముతో వర్ణించి యున్నాడు. ఈ పైన పేర్కొనిన యన్ని సందర్భములందును గవికి విష్ణుస్వరూపము కనులముందు గదలాడుచుండగా దాను ప్రత్యక్షముగా దర్శించి, పాఠకులచే దన కవితా ప్రాగల్భ్యమున స్పష్టముగా దర్శింప జేసినాడో యనునట్లు వర్ణించియున్నాడు. నిశితముగా బరిశీలించిన శ్రీవైష్ణవులచే నిత్యమనుసంధింపబడు శ్రీవైకుంఠ గద్యయందు భగవద్రామానుజులు కావించిన వైకుంఠుని వర్ణననే పలుతావుల నీతడు చేసి నట్లు కాన్పించుచున్నది.

ఇట్లు తాను భక్తుడై యొక భక్తశిఖామణి చరిత్రను రచించి యందాంధ్రసాహిత్యముననే యపూర్వముగ విష్ణుస్వరూపవర్ణనమును తొమ్మిది పర్యాయములు గావించి రఘునాథాచార్యుడు తన జన్మమును ధన్యము గావించుకొనియున్నాడు.

స్తుతిసంస్తుతులు :

"కలౌ సంకీర్త్య కేశవమ్" అను నార్యోక్తి ననుసరించి శ్రీవైష్ణవ సంప్రదాయమున స్తోత్రవాఙ్మయము కడు ప్రసిద్ధమైనది. ఈ సంప్రదాయమున వెలసిన స్తోత్రములు లెక్కకు మిక్కిలి. కథాంశ స్పర్శలేక కేవల భక్తి పురస్సరములైన స్తోత్రములందు గవియొక్క కవితాసామర్థ్యము, భక్త్యావేశము వెల్లడియగుటకు జక్కని యవకాశ ముండును. కాని రఘునాథాచార్యుడు కథాగతితో సంగతి చెడకుండ నాయా తావులందు స్తోత్రరూపమున భగవంతుని గుణగణములననిస్సీమ శేముషీవిశిష్టమగ గీర్తించియున్నాడు. ఇట్టి పద్యములన్నియు జక్కని శైలిలో నిత్యమను సంధించుకొనుటకు దగినవైయున్నవి.

ఈతడీ ప్రబంధమున నాలుగు తావులయందిట్టి స్తోత్రములకు శీలుకలిగించుకొనినాడు.

1. విష్ణువు సాక్షాత్కరించగా దృఢవ్రతుడు కావించిన స్తవము

2. ఇంద్రాదిదేవతలయెదుట సాక్షాత్కరించిన విష్ణువును గూర్చి బ్రహ్మదేవుడు గావించిన స్తుతి.

3 రాముడై తనకుసాక్షాత్కరించిన విష్ణువునుగూర్చి కులశేఖరులు గావించిన స్తుతి.

4. శ్రీవైష్ణవులకు జౌర్యదోషములేదని నిరూపించుటకు పాము ను ముట్టిన కులశేఖరులకు రంగనాథుడై విష్ణువు సాక్షాత్కరించినప్పుడు గావించిన స్తోత్రము.

ఈ నాలుగు సందర్భములందును భగవంతుడు సాక్షాత్కరింపగా భక్తుడు స్తోత్రము చేసినట్లు కల్పించి కథాంశముతో గలిసిపోవునట్లు

సంఘటించుటయేగాక భక్తిభావబంధురములైన స్తోత్రముల రచించుటవలన నాయా సన్నివేశములలో శాంతరసమునకు నసమాన స్ఫూర్తినిసాధించి తన యద్వితీయకవితావైదగ్ధ్యమును జాటుకొనినాడు రఘునాథాచార్యుడు.

ఈతడు గావించిన స్తోత్రములలో గులశేఖరులు పామునుముట్టగా విష్ణువు సాక్షాత్కరించినప్పుడు కావించిన ప్రార్థమున నొక దండకము రచింపబడినది. అందు దశావతర కీర్తనము చేయబడినది. దివ్యావతార సంకీర్తనము విశిష్టాద్వైతమత సంప్రదాయప్రసిద్ధము. సందర్భమును గల్పించుకొని యీతడీ దండకమును రచించి భగవదవతార విశేషముల గొండాడి సంప్రదాయపాలనము కావించియున్నాడు.

ఇంతియగాక మఱియొక విశేషము - ఈతడు తన ప్రబంధమును శ్రీరామచంద్రున కంకితము కావించియున్నాడు. కావున ప్రత్యాశ్వాసాంతమున, నారంభమున గావింపబడిన కృతిపతి ప్రశంసారూప పద్యములన్నియు నుత్తమస్తోత్రరూపములై యొప్పుచున్నవి.

ఈ విధముగ విశిష్టాద్వైతమత సంప్రదాయాభిజ్ఞుడగు రఘునాథాచార్యుడు శ్రీవైష్ణవమత ప్రబోధకమగు కులశేఖరాళ్వారుజీవితము నితివృత్తముగ స్వీకరించి విశిష్టముగా దన్మత సంప్రదాయపాలనము నొనర్చి విష్ణుభక్తిభావభరితముగా నాపాదచూడమును దీర్చిదిద్ది తన ప్రబంధము నఖండమగు కళాఖండముగా విన్యసించియున్నాడు.

## 4. రఘునాథాచార్యునిపై పూర్వసాహిత్య ప్రభావము

కవి యెట్టి ప్రభాన్వితుడైనను పూర్వసాహిత్యప్రభావమాతనిపై బడుట యనివార్యము. సుప్రసిద్ధమగు ప్రాచీన సాహిత్యముచే ప్రభావితులగుట కాళిదాసాదులగు ప్రముఖులయందు సైతము గోచరించుచున్నది.

ఇట్టి పూర్వసాహిత్యప్రభావమానంతర కవులపై యనివార్యమేయైనను నది కేవల మంధానుకరణమైన నింద్యయేయగును. తనకు నచ్చిన యంశమును యథాతథముగాగాక తన గ్రంథమున రచనా ప్రణాళిక ననుసరించి రమ్యముగా స్వీయతాముద్రవైచి, తనదిగా నొనరించుకొని వాడుకొనుట యుత్తమపద్ధతి.

ఈ దృష్టిలో రఘునాథాచార్యుని కులశేఖరమహీపాల చరిత్రమును సమగ్రముగ బరిశీలించినప్పుడు ప్రబంధనిర్వహణమున నీతడు ప్రసిద్ధులగు పూర్వకవుల రచనావిధానములననేక సందర్భములలో ననుసరించి తన కావ్యమున కవశ్యయమగు రామణీయకమును సమకూర్చినాడని చెప్పవచ్చును.[1] ముఖ్యముగ రామరాజభూషణుని వసుచరిత్ర నీతడతిసన్నిహితముగా ననుకరించియున్నాడు. ఈతడు రామరాజభూషణునకనంతరకాలమువాడని చెప్పుటకీ యంతస్సాక్ష్యము ప్రబల సాధనము.

### 1. కాళిదాసు ప్రభావము :

దృఢవ్రతుని మాధవారాధనవ్రతము రఘువంశమునందలి గోసేవావ్రతమును బోలియున్నది.

అనపత్యుడైన దిలీపుడు తన యనపత్యత తొలగిపోవు నుపాయ

---

1. శ్రీసాగి వెంకటనరసింహము గారి వ్యాసము-ఆంధ్రపరిషత్పత్రిక, శ్రీచిత్రభాను సంవత్సరాది సంచిక, 1942-43, పు. 77

మను జెప్పుమని ప్రార్థించి వశిష్ఠుని యానతిపై నందినీధేనువును భక్తి శ్రద్ధలతో క్షత్రియోచితమైన వర్తనమును విడనాడి, నియమనిష్ఠలతో సేవించి పుత్రుని వరముగా బొందినాడు. అట్లే దృఢవ్రతుడనపత్యుడై శ్రీవైష్ణవులను దన యనపత్యత తొలగిపోవు నుపాయము జెప్పుండని ప్రార్థించినాడు. వారు «క్షీరోపహార నియతితో నొక్క సంవత్సరము భార్యాసమేతుడవై బ్రహ్మచర్యానువర్తనమున శ్రీహరిని భజింపుము» అని యాతనితో బలికినారు. దృఢవ్రతుడు వ్రతదీక్షితుడై దృఢవ్రతము గావించి శ్రీహరి కరుణకు బాత్రుడై యాతని వరప్రభావమున గుమారుని గనినాడు.

ఈ మాధవారాధన కథ కేవలము రఘునాథాచార్యుని కల్పనమే. శ్రీవైష్ణవ గ్రంథము లందెందును దీనికి మూలము కానరాదు. ఇట్లు మూలకముగ నీతడు తీర్చిదిద్దిన యీ సన్నివేశమును గాళిదాసు రఘు వంశము నందలి దిలీపుని గోసేవావ్రత ఘట్టమును జూచియే కల్పించియుండునని యూహింప వీలగుచున్నది.

2. తిక్కన గారి పద్యము వంటి పద్యము :

ద్రోణపర్వమున నభిమన్యుని మరణమునకు నర్జునుడు విలపించు ఘట్టమున గవిబ్రహ్మ యగు తిక్కన వ్రాసిన పద్యము—

హా! యను ధర్మరాజతనయా యను నన్నెడబాయనీకుజ
న్మే యను దల్లినేవ జమనేయను గృష్ణుడు వీడె వచ్చె రా
వే యను నొంటిపోక దగవే యను నేగతి బోవువాడ నే
నో యభిమన్యుడా యను బ్రియోక్తుల నుత్తర దేర్పవే యనున్

పుత్రమరణ సంతప్తహృదయుడగు నర్జునుని శోకపరీతమూర్తిని బాఠకుల కన్నుల యెదట నిలిపి, కరుణరసనిర్భరమై హృదయమును

1. భారతము, ద్రోణపర్వము, 2–242

గరగించు నీపద్యమాంధ్రసాహిత్యాకాశమున ధ్రువతార. ఇట్టి పద్యమును దదనంతరకవులనేకులు తమ గ్రంథములందనుకరించి యున్నారు.

తిక్కన గారి పై పద్యమును రఘునాథాచార్యుడు సైతమను కరించి యున్నాడు.

ధార్మికవర్యుడగు దృఢవ్రతుడు మృగయావిహారతత్పరమతియై యుండి యొక కురంగమును జూచి వెంబడించినాడు. కొంతవడికా లేడి పరుగిడజాలక తత్తరపాటుతో చెదరిన చిత్తముతో నలసి సొలసి యొక సరసిచెంత బడిపోయినది. అప్పుడు కృపారసతరంగితాంతరంగుడైన దృఢవ్రతుడు దానికి శీతలోపచారములు గావించి తన దుష్కృత్యమునకు విచారించిన ఘట్టమున వ్రాయబడిన పద్యమిది—

హా! యిదియేటి వేట యను నబ్బురపాటున దీనిజూడ నే
లా! యను నాగ్రహింపదగునా యను నెంత చలమ్ముగొంటి నౌ
రా! యను లేటినిట్లలతురా యను నింత దలంతె శ్రీనివా
సా! యను నమ్మహీశుడు తదార్తి పరిక్షుభితాంతరాత్ముడై—
1-85

రఘునాథాచార్యుని యీ పద్యము శబ్దాడంబరరహితమై భావతీవ్రత్వయుక్తమై, మృగార్తి పరిక్షుభితుడైన దృఢవ్రతుని మనోగత పశ్చాత్తాపమును బ్రస్ఫుటీకరించుచు సందర్భమునకు దగియుండి రసోచితమై విరాజిల్లుచున్నది. పుత్రశోకక్షుభితుడగు నర్జునుని మానసిక పరిస్థితిని వివరించుటకు గవిబ్రహ్మ స్వీకరించిన పద్యరచనాఫక్కికను రఘునాథాచార్యుడు సైతము నట్టిదియే యగు సన్నివేశమున సముచితముగా సమర్థవంతముగ సరసముగా సంధించుకొని తన యను కరణమును సార్థకము గావించి యున్నాడు.

౨. పోతన ప్రభావము :

రఘునాథాచార్యుని శైలి యాపాతమధురమై సర్వేసర్వత్ర పోతన శైలిని దలపించుచుండును. ముఖ్యముగ నంత్యానుప్రాసలతో నీతడు వ్రాసిన యనేక పద్యములు పోతన పద్యములాయనిపించు చుండును.

ఈ యంత్యానుప్రాసతో గూడిన పద్యరచనము పోతనకు సహజ సిద్ధము. అనేక సందర్భములలో నిట్టి పోతన పద్యరచన నతి సన్నిహితముగా ననుకరించుచు రఘునాథుడు పద్యరచనము సాగించి యున్నాడు. కథా ప్రారంభమున శిష్యులకు గురునిచే విష్ణుభక్తజన పాదములను గుఱించి చెప్పిన పద్యము—

శ్రీదమ్ములు దళితాశ్రిత
ఖేదమ్ములు దుష్టహృద్విగీతాచారో
చ్ఛేదములు శోపిత భవ
శాదమ్ములు విష్ణుభక్తజనపాదమ్ముల్ - 1—35

ఆసందర్భమునందే విష్ణుదాస పదసేవనములను గూర్చి వర్ణించిన పద్యము / 1—3/61 ద్వితీయాశ్వాసమున విష్ణు లీలల గొనియాడుచు రచించిన పద్యము / 2—124 / పోతన కవితామోహితుడై రఘునాథాచార్యుడు వ్రాసినవే. ఇట్టి పద్యము పోతనలో—

భూషణములు వాణికి నఘ
పేషణములు మృత్యుచిత్తభీషణములు హృ
త్తోషణములు కల్యాణని
శేషణములు హరిగుణోపచితభాషణముల్[1]

1. శ్రీమహాభాగవతము, ప్రథమస్కంధము, 46 ప.

ఇట్టివి అనేక పద్యములు పోలికకై చూపవచ్చును. తీవ్రమగు భక్తిభావమును పాఠకుల హృదయఫలకములపై ముద్రించుటకు పోతన యవలంబించిన శైలినే స్వీకరించి భక్తిభావము రఘునాథాచార్యుడు ప్రకటించియున్నాడు.

నిజజీవితమున సైతమీతడు పోతన వలె పరమభక్తుడై తన కృతిని నరాంకితము గావింపక శ్రీకైవల్యవద్యైకనిరతితో శ్రీరామచంద్రున కర్పించిన ధన్యజీవి. ఐహికభోగపరాఙ్ముఖుడై కేవలాముష్మిక కాంక్షతో పరమభక్త్యావేశపరవశుడగు పోతన పోకడలీతని పలుకుబడిలో పరవళ్లు త్రొక్కుచున్నవి.

4. పినవీరనతో పోలిక వేట వర్ణన :

ఆంధ్రసాహిత్యమున వేటను గడు సమర్థవంతముగ వర్ణించిన వారిలో పినవీరన ప్రథమగణ్యుడు. అతని మార్గముననే పెద్దన తన మను చరిత్రమున వేటను గడు రమ్యముగ వర్ణించియున్నాడు. రఘునాథాచార్యుడాతోవనే తన ప్రబంధమున దృఢవ్రతుని వేటను వర్ణించి యున్నాడు. అందు వేట కుక్కలను గుఱించిన పద్యము పినవీరన పెద్దన పద్యములతో సన్నిహితసామ్యము కలిగి యున్నది.

పినవీరన పద్యము—

పులిమల్ల డడవిపోతులరాజు గరుడుండు
గాలివేంగబు వందేల పసిడి
విష్ణుప్రసాదంబు వేడిగుండులువరి
వచ్చిమిర్యము పెట్టిపుచ్చకాయ
వేట మాణిక్యంబు పిరివాది వెరడబల్మి
పెట్టుగాడు వకారి పిడుగు తమక
జిగురుండు చిత్రాంగి శ్రీరాముబాణంబు
పులియందు కస్తూరి బొడ్డుమల్లె

యనగ మఱియును బెక్కు తోయముల పేళ్లు
దొరకులు దేర వచ్చె నుద్దండ వృత్తి
వేటకుక్కలు మృగరాజ విగ్రహములు
వటుకనాథుని వాహ్యాళివాహనములు[1]

పెద్దన పద్యము–

పులియడు బూచిగా డసురపోతులరా జనుమంతిగాడు చెం
గలువ సివంగి భైరవుడు గత్తెర సంపగి వెండిగుండు మ
ల్లెల గుది వాయువేగి చిటిలింగడు సాళ్వడు వత్సనాభి యే
కలముల మిత్తి గబ్బియనగా గలవాని గ్రహించి యుద్ధతిన్[2]

రఘునాథాచార్యుని పద్యము–

కరిగండు పురిగొంగ కఱకు మీసల బంటు
పయ్యాటముల మారి చట్టుగుండె
కొఱవిచూపుల బూచి తుప్పగంతులదిట్ట
యడవుల రాకాశి పిడుగు తునుక
జల్లితోక బెడంగు పిల్లుల బూతంబు
గవ గబ్బికపిసాళి గబ్బిమెకము
[illegible]రుకుల గండు కక్కెర పొంచులాడు గుం
పులమారి జముకోఱ పులుగుచూడు

అక్కెస గుబాటుకాడు పేఱుక్కుతునియ
యనుచు నామమ్ములిడి పెంచినట్టి జాగి

1. శృంగారశాకుంతలము – 1–108
2. మనుచరిత్ర – 4–22

అముల గొలుసుల నిడికొని తమకమదర
నరుగుదెంచిరి యెఱుకు నయ్యధిప కడకు[1]

ఈ విధముగ బినవీరన పద్యము పెద్దనకు, నా యిద్దరి పద్యములు రఘునాథాచార్యునకు స్ఫూర్తి నొసంగినట్లు చెప్పవచ్చును.

౬. కందుకూరి రుద్రకవి ప్రభావము ;

రుద్రకవి నిరంకుశోపాఖ్యానమున నిరంకుశుని భార్య పాత్ర నపూర్వముగా జిత్రించియున్నాడు. ఆంధ్రసాహిత్యమున గాశీఖండమున గుణనిధి భార్యయు, శివరాత్రి మహాత్మ్యమున సుకుమారుని భార్యయు పాండురంగమహాత్మ్యమున నిగమశర్మ భార్యయు దుర్వ్యవసాయదూషితులగుపతుల దుష్ప్రవర్తనములచేనార్తి నొంది పలవించిన పరమ పుణ్యవతులు, కాని నిరంకుశుని భార్యా భర్త వర్తనముచే దనకు గలుగుచున్న వ్యథను సహించుచు దైవమును నిందించుచు దన దురదృష్టమునకు దనలోదాను కుములుచు కూర్చుండక నిర్భయగాము తన యత్తగారి కెఱిగించి యామె బాధ్యతను సూటిగ గుర్తు చేసినది.[2] తన మగనికి బుద్ధి చెప్పి తన కాపురమును జక్కదిద్దుమని యామెకు నచ్చజెప్పగలిగిన ప్రజ్ఞావంతురాలు. ఫలితమెట్లున్నను గార్యసాఫల్యమునకు బ్రయత్నించిన జాణ నిరంకుశుని భార్య.

ఈ నిరంకుశుని భార్య పాత్రచిత్రణలో రుద్రకవి చూపిన విజ్ఞానమును రఘునాథుడు తన హారిటి పాత్ర సృష్టిలో వెలార్చియున్నాడు. అత్తవారింట నెల్లరి వలనను దనకు గలుగుచున్న కష్టముల నత్తతో నేకరువుపెట్టి యామె నొప్పించి దన స్థితిని బాగుపఱచుకొన జూచినది.

1. కు. మ. చ. – 1–౮౦
2. నిరంకుశోపాఖ్యానము – 2–49–60

గిరంకుపని భార్య పరిస్థితి మెఱుగుపడలేదింతియ. మఱి యత్తతో దన యిక్కట్లు. చెప్పుకొనుట వలన మఱింత కష్టములపాలై మూడురోజులు పవసింప వలసిన గతి యెంగిలిపాలు భర్త కొసగిన నేరమునకిల్లు వెడలగొట్ట బడినది హరిణి.

ఇట్లత్తవారింట కష్టపడిన కోడలుగా దన బాధల నత్తకుదెల్పి పరిస్థితిని జక్క దిద్దుకొనజూచిన వివేకవతిగా నిరంకుని భార్య పాత్రతో హరిణీ పాత్రకు సన్నిహిత సంబంధమున్నది.హరిణి పాత్రి యేయితర సంప్రదాయ గ్రంథము లందును బ్రస్తావింపబడలేదు' ఇది రఘునాథాచార్యుని నవీనసృష్టియే. ఈ పాత్రను సృష్టించుటవల్ల నాతనిపై రుద్ర కవి ప్రభావముండియుండునని యూహింపవీలగుచున్నది.

౬. ఆముక్తమాల్యదా ప్రభావము ;

కులశేఖరమహీపాల చరిత్రము వంటి నీళారంగనాథుల వివాహఘట్టమునకు కృష్ణరాయకృతాముక్తమాల్యద యందలి గోదారంగనాథుల వివాహఘట్టముతో సామ్యము కలదు. ఆముక్తమాల్యదా కథకు గులశేఖరమహీపాలచరిత్ర కథకు దగ్గర పోలిక సహజముగనేయున్నది. ఆముక్తమాల్యదలో ఆళ్వారులలో నొకడగు విష్ణుచిత్తుని కథ ప్రసక్త మగును. అతని కుమార్తె గోదాదేవి. ఈమె విష్ణుపత్నులగు శ్రీభూనీళలలో భూదేవ్యంశమున జన్మించినది. రంగనాథుని వరించి యాతనినే పరిణయ మాడినది. ఇక గులశేఖరమహీపాలచరిత్రమున నాయకుడు ఆళ్వారులలో నొకడగు కులశేఖరుడు. అతని కుమార్తె నీళ. విష్ణుపత్ని యగు నీళాదేవి యొక్క యంశమున జన్మించినదీమె రంగనాథుని వలచి వివాహమాడినది. ఇట్లీ రెండు గ్రంథము లందును గథాసామ్యము మిక్కుటముగా నున్నది. ఇక వైష్ణవభక్తిభరితత్వము కూడ రెంటను సమానమే. రంగనాథుడు పెండ్లికి దరలివచ్చుట, వివాహపు వేడుకలు, దేవనికాయము యొక్క సందడి మున్నగు విషయము

లను రఘునాథాచార్యుడు ఆముక్తమాల్యదను జూచియే వ్రాసినట్లు తోచును. మూలసంప్రదాయగ్రంథములందులేనియీవిషయముల నీడ తాముక్తమాల్యదాప్రభావముచేతనే వ్రాసినట్లు పేర్కొనవచ్చును.

ప్రబంధనాయకుడగు కులశేఖరుడు విశిష్టాద్వైతమత పూర్వాచార్యుడగుటచే నాముక్తమాల్యదలో వలె విష్ణుభక్తిసౌరభము గ్రంథారంభముననే గుబాళించినది. ఆముక్తమాల్యద యందు వలె నిందును బంచాయుధస్తోత్రములు, నిత్యసూరులగు ననంతగరుడ విష్వక్సేనుల ప్రార్థనలు కావింపబడినవి.

గోదాకల్యాణమునకు బార్వతియు, సరస్వతియు నింకను దేవతా స్త్రీలును ముత్తయిదువలు. అందు లక్ష్మీదేవి ప్రసంగము విడువబడి యుండుట విశేషము. గోదాదేవి విష్ణుపత్నియగు భూదేవి యంశతో జన్మించినది గదా! అందులకై సపత్నియగు లక్ష్మీదేవి యొక్క ప్రసంగము విడువబడియుండును / 7-60 /.

కులశేఖరమహీపాల చరిత్రము నందలి నీళాకల్యాణము నందును వాణియు,శర్వాణియును బెద్దముత్తయిదువలు. వారికి గీర్వాణాధిపురాణిని గూడ రఘునాథాచార్యుడు తోడుచేసినాడు. వీరు నీళను రంగనాథుని కడకు గొనిపోయినారు / 4-157 /. అంతకుముందు తమ భర్తలతో బాటు 'మిథునతాంబూలములు' పుచ్చుకొని యాశీర్వదించియున్నారు.

ఇచ్చట సైతము నీళాదేవ్యంశసంజాత యగు నీళ యొక్క వివాహపు వేడుకలలో లక్ష్మీదేవి ప్రసంగము విడువబడినది. దీనికితోడు రంగనాథుడు వివాహానంతరము నీళను లక్ష్మీదేవి కప్పగించినట్లును, నామె యాదరించినట్లును రఘునాథాచార్యుడొక రమ్యమైన కల్పన గావించియున్నాడు.

గోదాదేవినిపెండ్లికలంకరించిన విధము నీళాదేవి నలంకరించిన విధము నొక్క తీరున నున్నవి.

ఇట్టి రెండు ఘట్టములను దగ్గరజేర్చి పరిశీలించిన రఘునాథాచార్యునిపై నాముక్తమాల్యదా ప్రభావము వ్యక్తము కాగలదు.

7. పింగళి సూరన ప్రభావము – శ్రీముఖపత్రిక :

సామాన్యముగ నాయిక నాయకునకు ప్రణయలేఖ వ్రాసినట్లు కాదంబరీశాకుంతలాదు లందుఁగలదు. తద్భిన్నముగ కులశేఖరమహీపాల చరిత్రమున శ్రీరంగనాథుడు ప్రియురాలగు నీళ కొక శ్రీముఖపత్రిక వ్రాసిపంపినట్లు రఘునాథాచార్యు డొక కల్పన జేసెను. నాయకుడే నాయికకు లేఖ వ్రాయుట యిందలి విశేషము.

ఈ విషయమున రఘునాథాచార్యునిపై పింగళి సూరన చేసిక ముద్ర గోచరించుచున్నది. సూరనార్యకృత ప్రభావతీప్రద్యుమ్నమున నాయకుడగు ప్రద్యుమ్నుడు నాయిక యగు ప్రభావతిపై గల ప్రేమను వర్ణించుచు శుచిముఖికి లేఖ వ్రాసినట్లున్నది. సంప్రదాయగ్రంథము లందెచ్చటను కులశేఖరాళ్వారు చరిత్ర సందర్భమున రంగనాథుడు నీళకు లేఖ వ్రాసిన ప్రసక్తి లేదు. కావున నీ నవ్య కల్పన గావించుటలో రఘునాథాచార్యునిపై ప్రభావతీప్రద్యుమ్న ప్రభావమే కారణమై యుండును.

లేఖ వ్రాయుటలో ప్రద్యుమ్నని తడబాటు రంగనాథుని యందు గూడ గల్పింపబడుటచే నీయూహ సరియైనదే యని చెప్పవచ్చును.

ప్రద్యుమ్నుడు వ్రాసిన లేఖ యందు నాయికను గూర్చి 'ప్రప్రభాభావతీ' యని తడబాటున వ్రాసినట్లు సూరన కల్పించెను.[1] దానినే గ్రహించి నీళకు రంగనాథుడు వ్రాసిన లేఖ యందు–

1. ప్రభావతీప్రద్యుమ్నము – 3-134, 140

శ్రీలాలిత్యవిశాల రంగనగరిం జెల్వొందు గోవిందుడన్
బాలారత్నము! చింత యేమిటికి సంభావించి శక్రాది ది
క్పాలుల్ మెచ్చ బరిగ్రహింతు నిను సౌఖ్యంబేర్పడన్ భృంగలీ
లాలోలాలికలాంఛితాలిక! నినీళావధూధామణీ![1]

అని నీళానామమును దడబాటుతో లిఖించినట్లు రఘునాథాచార్యుడు కల్పించియున్నాడు.

8. రామరాజభూషణుని ప్రభావము :

కులశేఖరమహీపాలచరిత్రమును ప్రబంధీకరించుటలో రఘునాథుడు రామరాజభూషణుని నాదర్శముగాగొన్నట్లు కాన్పించుచున్నది. ఆయా సన్నివేశములలో, నాయా పాత్రల వర్ణనాదికమున నాయా పద్యరచనా పద్ధతలలో, నాయా కవుల ప్రభావములు రేఖామాత్రముగ రఘునాథాచార్యునిపై ప్రసరించి యుండినను మొత్తముమీద రామరాజభూషణునిప్రభావమువఋిగాఢమైనది. ప్రబంధనిర్మాణము తన్నిర్వహణము, శైలీచమత్కృతి, రసపోషణము, మున్నగుపెక్కంశములలో రామరాజభూషణుని యాచార్యత్వము రఘునాథాచార్యునికున్నది.

రఘునాథాచార్యుడు పరమభక్తిభావభరితమైన కులశేఖరుల జీవితమును గంభీరసుందరముగాజిత్రించుచు నడుమ నీళారంగనాథుల ప్రణయగాథను లలితసుభగముగ మాధుర్యధుర్యముగ వసుచరిత్రమార్గముగ జిత్రించియున్నాడు.

నీళారంగనాథుల విరహము, మన్మథాద్యుపాలంభనములు, నీలవేణిదౌత్యము, వివాహపు వేడుకలు మున్నగువానియందు వసుచరిత్రపోకడలు పెక్కెడల గోచరించుచున్నవి. ముఖ్యముగ నీలవేణి పాత్ర సృష్టి వసుచరిత్రలోని మంజువాణిని జూచియే రఘునాథాచార్యుడు గావించినట్లు స్పష్టముగ జెప్పనవచ్చును.

---

1. కు.మ.చ. 4-51

ఇంక వసుచరిత్రమునందలి యనేక పద్యములలోని భావములు కుళశేఖరమహీపాలచరిత్రమునందు గాన్పించుచున్నవి. నీలవేణి గిరికావిరహవృత్తాంతమును రంగనాథున కెఱిగించుటకు నాకాశయానమున బోయి వచ్చి తన యాకాశగమన విశేషమును వివరించునట్టి—

అపుడు పొడువున నరుగుచో సపదు ఱిక్క
లెల్ల గనుపడె గంపంతలేసి నగుచు
మహి నిరీక్షింప దుంగభూరుహములెల్ల
దుంగపాచలభంగి గానగబడియె[1]

అను పద్యము వసుచరిత్రమునందలి యీ క్రిందిసీసపద్యమునందలి యెత్తుగీతికనుకరణప్రాయము.

గొండ లచ్చనగండ్లయి నిండు చెఱువు
లెల్ల నద్దంపుబిల్లలై యేర్లు ముత్తె
యంపు సరులై యరణ్యంపు గుంపులెల్ల
నారులై తోచు బొడువున నౌరులార 4–58

ఈపద్యమున గిరికకడనుండి వసురాజుకడకువిహాయసవీథిని బోవుచున్న మంజువాణి యాకసము నుండి చూచిన దృశ్యము వర్ణింపబడినది. కులశేఖరమహీపాల చరిత్రమునను, వసుచరిత్రమునను సన్నివేశ మొక్కటియే. కొంచు మించుమించుగ నీలవేణి యనుభవమును, మంజువాణి యనుభవమును నొక్కరూపుననే యున్నవి. రామరాజ భూషణుని పద్యమును జూచి ముచ్చటపడి రఘునాథాచార్యుడీ పద్యమును వ్రాసినట్లు భావింపదగును.

గిరిక వసురాజు విరహమున వేగివేగి మూర్ఛిల్లినది. అప్పుడామె చెలులామెకు శీతోపచారములు చేయదలచిరి. కాని,మరల నాయా

1. కు.మ.చ.— 4–16

శీతోపచారములు గిరికకు మఱింత తాపకారులు కాగలవని వారు తలం తురు. ఆ సందర్భమునందు రామరాజభూషణుని పద్యము—

మోహాపదేశ తమోముద్రితములైన
కనుదమ్ములు హిమాంబు లునుపరాదు
శశిమబిందు తారకాగమ భిన్నకుచ కోక
ములు జంద్రనామంబు దలపరాదు
శీర్యదాశావృంత శిథిలితాసు లతాంత
మసియాడ వీవనల్వీవరాదు
పటుతాప పుటపాక పరిహీన తను హేమ
మింక బల్లవ పుటార్పిడగరాదు
లలన కొనంగ కీలికీలా కలాప
సంతతాలీఢహృదయ పాత్రాంతరాళ
పూరిత స్నేహపూరంబు పొంగిపొరల
జల్లని పటీర సలిలంబు జల్లరాదు – వసు - 3-180

సుందరమగు నీపద్యచమత్కృతిచే నాకృష్టుడైన రఘునాథాచార్యుడు తన ప్రబంధమున నచ్ఛముగ నిట్టి భావముతోడనే యొక పద్యమును రచించినాడు.

మలయానిలాహతాతులమైన చెలిమేన
జందన సలిలమ్ము చల్లవలదు
కుముదబాంధవ రుచిక్షుభితమౌ నురమున
ఘనసారరేణువుల్ గ్రమ్మవలదు
రతిరాజతాపలోహితములై తగు నేత్ర
ములు బద్మపత్రముల్ మొనుపవలదు
పరవికస్వరభీతి బొరలుటతో బఱపున
జూత పల్లవములు చొనుపవలదు

తజ్జనిత్వమ్ము తన్నామధారణమ్ము
తచ్చరత్వమ్ము తత్ప్రియత్వమ్ము నెఱింగి
సేయు శిశిరోపచారముల్ చెలికిదగునె
పగఱకూరిమిగలవారు పగఱకౌరి — 3-133

మన్మథాదుల చెడదిట్టి నీళ విరహతాపము నావజాలక యాత్మహత్యా ప్రయత్నమున, వెన్నెల మడుగు చొరబోయిన సన్నివేశము గిరిక ప్రవర్తన ననుసరించి కల్పింపబడినట్లున్నది. ఆ సందర్భమున రఘునాథాచార్యుడు—

ధరణిపతి కన్య విరహ సంతాపభరము
మది సహింపక వెన్నెల మడువు సొచ్చి
తకువు దొరగెద ననుచు నుద్ధతి వహింప
వలదు సాహసమనుచు నెచ్చెలులు గదిసి[1]

యోదార్చినట్లు చేసిన కల్పనకు మూలముగ వసుచరిత్రమున—

అని వనిత నాలిగాలిం
గనలుచు బోనాడి తుహినకరకిరణఝరిన్
మునగజనజెలులు గని హా
యని వనరుచు నడ్డగింప నతి శోకమునన్[2]

అని యున్నది.

కలకంఠి యగు నీళాదేవిచే గోకిలరసస్ఫూర్తి గళమెత్తి శోకింపజేయుట / 3-184 / సంగీత కళారహస్యనిధియగు రామరాజభూషణుని పోషణలో బెరిగిన గిరిక కాంభోజీమేళవిపంచికారవసుధాపూరంబు తోరనిబుగా యెలుగెత్తి యేడ్చుటను / 4-52 / దర్శించియేయని చెప్పవచ్చును.

రామరాజభూషణుడు మధుమాసవాసరముయొక్క భాసురత్వము నత్యంత నిబిడసుందరమగుశైలిలో వర్ణించినపద్యములయాత్మకముగా

1. కు.మ.చ. 3-162
2. వసుచరిత్ర 4.51

నుండి మిక్కిలి ఖ్యాతి వహించినది. ఆ పద్యమిది—

లలనాజనాపాంగ వలనావసవదనంగ
తులనాభికాభంగదోః ప్రసంగ
మలపానిలవిలోలదళసాస వరసాల
ఫలసాదర శుకాలపనవిశాల
మలినీగరుదనీక మలినీకృతధునీ క
మలినీ సుఖిత కోకకులవధూక
మతికాంత సలతాంతలతికాంతర నితాంత
రతికాంతరణ తాంత సుతనుకాంత
మకృతకామోద కురవకావికలవకుల
ముకుల సకల వనాంత ప్రమోదచలిత
కలిత కలకలకుల కంఠ కౌకలీ ని
భాసురము పొల్చు మధుమాసవాసరంబు[1]

అచ్చముగా నిట్టిదేయగుశైలిలో నీ పద్యమునకు దీటువచ్చునట్లు రఘునాథాచార్యుడీ క్రింది పద్యమును వ్రాసియుండును.

మధుపానవదనూన మదలీన సదళీన
వదనూన మృదుగాన బంధురమ్ము
తతకూలజ తమాలతతి ఖేలదతినేల
పత గాలపితజాల భాసురమ్ము
స్మర శాత శరపాతభూత పరిత నరజాత
విరహాతపరయేత భరహరమ్ము
రసనాగ బిసపూగ కిసభాగరసభోగ
రసికాగత సరాగరాజహంస
మమల కైరవ కమల గంధానుబంధ
మలయ మరుదంకురాగమోన్మాదచరిత

1. వసుచరిత్ర 1_126

పాంథసందోహమగు సరః ప్రవరమొకటి
యా నెలంతల కచ్చోట గానబడియె కు.మ.చ - 3-105

శబ్దాలంకారయిభూష్యమై శ్రవణ సుభగమై యద్భుతమగు తూంగుతో లయాత్మకముగా మృదుమధురములగు పదముల పోహళింపుతో సాగిన యీ పద్యము సరోవర్ణనముతోగూడి యున్నది. రామరాజభూషణుని పద్యమునకు ప్రతిబింబప్రాయము.

ఇట్లు పాత్రసృష్టిలో జమత్కారయుక్త రచనమున, పదగుంఫనమున రామరాజభూషణుని ప్రభావమతివేలముగా రఘునాథాచార్యుని పైనున్నది.

భక్తవతంసుడగు కులశేఖరాళ్వారుల జీవితము నితివృత్తముగ గాని పరమ విలక్షణమగు విధమున విశిష్టాద్వైత సంప్రదాయబద్ధముగా దీర్చిదిద్దబడిన విశిష్టప్రబంధము కులశేఖరమహీపాల చరిత్రము.

శేషము రఘునాథాచార్యుడు భవ్యభక్తిభావభరితముగ, శాంత రససుందరముగ నీప్రబంధమును మలచినాడు. శ్రీవైష్ణవసంప్రదాయ గ్రంథములందులేని యనేకపాత్రలనుసృజించి యనితరసాధ్యములుగా వానినిబోషించియున్నాడు. నీళారంగనాథుల ప్రణయగాథ యుదాత్త శృంగారముతో నొప్పుచున్నది. ఆంధ్రసాహిత్యమున గ్వాచిత్కముగా నున్న హాస్యరసము నతిమాత్రముగా బోషించియున్నాడు. హరిణీ పాత్ర కరుణరససంకలితమై యాంధ్రసాహిత్య పథమున నిలుపబడిన మణిదీపికయై దీపిల్లుచున్నది.

ఈతడాలంకారిక ప్రోక్తములగు పెక్కు వర్ణనల నత్యంత ప్రజ్ఞా పూర్ణములుగా వెలయించినాడు. ప్రచురములగు నలంకారములతో దన ప్రబంధకన్యనలంకరించి దీప్తినిజేకూర్చినాడు రఘునాథకవివతంసుడు. ఈ ప్రబంధము చక్కని కథాకథనము తోడను దానికి సాటివచ్చు శైలీ

సౌకుమార్య మాధుర్యములతోడను సంతరింపబడినది. పెక్కురు పూర్వ కవులవలన స్ఫూర్తినిబొందినది ప్రబంధము. ముఖ్యముగ వసుచరిత్ర యందలి రచనా చమత్కృతులను బుడికిబుచ్చుకొనినట్లున్నది.

రఘునాథాచార్యుడు కృత్యాదియందువష్ట్యంతములలో "హృద్యా నవద్య పద్య స్వాద్య రసోద్యత్ప్రబంధ సమ్యక్ప్రృతి" / 1-26 / అని శ్రీరాముని గిర్తించినాడు. అట్టి కీర్తన మీతని ప్రబంధమునకుగూడ ముమ్మూర్తుల వర్తించును. రఘునాథాచార్యకృతమగు నీ కులశేఖర మహీపాలచరిత్రము "హృద్యానవద్యపద్యస్వాద్యరసోద్యత్ప్రబంధము"



# 5. సాహిత్యమున స్థానము

## ఉదాహృత గ్రంథసూచి


| | |
|---|---|
| ఆచార్య సూక్తిముక్తావళి | శ్రీ నంబూరి కేశవాచార్యులు |
| ఆముక్తమాల్యద | శ్రీ కృష్ణదేవరాయలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1967 |
| ఆళ్వారుల, ఆచార్యులచరిత్ర | శ్రీ టి. లక్ష్మణాచార్యులు, శశిరేఖా ముద్రాక్షరశాల, 1927 |
| ఆళ్వారులు దివ్యప్రబంధములు | శ్రీ ధనకుధరం వరదాచార్యులు గారు |
| కావ్యాలంకార సంగ్రహము | / వ్యాఖ్యానము / శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి గారు, యం. శేషాచలం అండ్ కో., 1959 |
| గానకళాబోధిని | శ్రీ యన్.సి. పార్థసారథి, బాలసరస్వతీ బుక్‌డిపో, 1981 |
| ఛందోలోకసమున్మేషము | శ్రీ టి. భాస్కరరావు, మహతీ గ్రంథమాల, తృతీయముద్రణము, 1981 |
| ద్వాదశసూరి చరిత్ర | శ్రీ కె.టి.యల్. నరసింహాచార్యులు, శ్రీగోదా గ్రంథమాల. ప్రథమ ముద్రణము, 1973 |
| నిరంకుశోపాఖ్యానము | కందుకూరి రుద్రకవి |
| పరమయోగివిలాసము | తాళ్ళపాక తిరువెంగళనాథుడు, కాకినాడ ముద్రాక్షరశాల, 1928 |
| ప్రభావతీ ప్రద్యుమ్నము | పింగళి సూరన |
| మనుచరితము | / వ్యాఖ్యానము / శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి. వెంకటరామ గ్రంథమాల, 1968 |

| | |
|---|---|
| వసుచరితము | రామరాజభూషణుడు, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ, 1987 |
| విజ్ఞానసర్వస్వము | తెలుగుభాషా సమితి |
| శృంగారశాకుంతలము | పిల్లలమర్రి పినవీరభద్రకవి, ఎమెస్కో సంప్రదాయసాహితి 1971 |
| శ్రీమదాంధ్ర మహాభారతము / ద్రోణ/ | తిక్కన |
| శ్రీ మహాభాగవతము | పోతన |
| శ్రీముఖసూక్తి / ప్ర. భా. / | శ్రీ బచ్చు పాపయ్యశ్రేష్ఠి, భారతమాత ప్రెస్, యం.యస్.174 ప్రథమ ముద్రణము, 1949 |
| సంస్కృత గ్రంథములు : | |
| కావ్యప్రకాశము | మమ్మటుడు, చౌకాంబా సంస్కృత సంస్థాన్, నాల్గవముద్రణము, 1978 |
| దశరూపకము | ధనంజయుడు |
| దివ్యసూరిచరితము | గరుడవాహన పండితుడు |
| భగవద్భక్తిరసాయనము | మధుసూధన సరస్వతి |
| ముకుందమాల | శ్రీ చెలమచర్ల రంగాచార్యులు, శ్రీనివాస పబ్లికేషన్స్, 1973 |
| ముకుందమాలవ్యాఖ్యానము | శ్రీ కాంచీప్రతివాదిభయంకరమ్ అణ్ణంగరాచార్యులు, రామానుజపత్రిక సిరీస్50, సద్గ్రంథప్రకాశసభ 1954 |
| సాహిత్యదర్పణము | |
| తమిళ గ్రంథములు : | |
| గురుపరంపరాప్రభావము | పిన్పళ్ళి కరాన్ పెరుమాళ్జియ్యర్ |
| పెరుమాళ్ తిరుమొళి | శ్రీ కాంచీ ప్రతివాదిభయంకరమ్ అణ్ణంగరాచార్యులు, శ్రీరామానుజ పత్రిక సిరీస్, 1962 |

ఆంగ్ల గ్రంథములు :


| | |
|---|---|
| A hand book of Hindu Religion | Tirumala Tirupati Devasthanams |
| Alwar Saints | Sri Suddanandaswami |
| Alwars of South India | Sri K. C. Varadachari, Bharatiya Vidya Bhavan, Bombay, 1966 |
| Grains of Gold | Sri R. S. Desikar |
| Studies in indian history | Sri K. K. Pillay, 1979 |


వ్యాసములు :


| | |
|---|---|
| శ్రీ కోరాడ రామకృష్ణయ్య | భారతి, ఆగష్టు, 1949 |
| శ్రీ సాగి నరసింహము | ఆంధ్రపరిషత్పత్రిక, చిత్రభాను సంవత్సరాది సంచిక, 1942–43 |
| శ్రీ నిడదవోలు వెంకటరావు గారు | Journal of University of Madras, Section A – Humanities Vol. XXIII No. 1 – 2 (July–December) |

## గ్రంథకర్త పరిచయము ;

పేరు : తట్టా లక్ష్మీనరసింహాచార్యులు

వృత్తి : ఆంధ్రోపన్యాసకులు

చిరునామా : శ్రీమతి గెంటెల శకుంతలమ్మ కళాశాల, జగ్గయ్యపేట

విద్యార్హతలు : భాషాప్రవీణ, ఎం.ఏ., (తెలుగు) ఎం.ఫిల్.,

వ్యాసంగము : వేదాంత సాహిత్య శాస్త్రములపై పరిశోధనము. శ్రీకులశేఖరాళ్వారుల చరిత్ర-సూక్తులు అను గ్రంథము అముద్రితము. "ఆంధ్ర భాగవతములో విశిష్టాద్వైత పాలనము" అను నంశముపై పిహెచ్.డి., పట్టము కొఱకు పరిశోధన పూర్తికావచ్చినది.